# ఆంధ్రగ్రంథమాల పుస్తకములపట్టిక

ఆంధ్రవిజ్ఞానసర్వస్వము (౭ సంపుటములు) సంపు. 1 ... రు. 10-0-0

శ్రీ మహాఋషినిఘంటిత యోగశాస్త్రము—కా. సూర్యనారాయణయోగిని ... 5-0-0

భగవద్గీత (సంస్కృ.)—బె. రామారావుగారి వ్యాఖ్యానముతో 1, 2, 3 సంపు॥లు మాత్రమేఉన్నవి. సంపు. 1 కి ... 1-8-0

శతకకవులచరిత్ర—వం. సుబ్బారావుగారు ... 1-8-0

పారిభాషికపదకోశము (ఇంగ్లీషులోని శాస్త్రీయపదములు తెలుగుపదముల నిఘంటువు) ... 1-4-0

ఆంధ్రవాఙ్మయసూచిక (ముద్రితాముద్రితగ్రంథములపట్టిక) 1-0-0

శ్యామసుందరము—ఒం. సత్యనాథముగారు ... 1-0-0

జీవనప్రభాతము (న.)—కె. యన్. వెంకటరమణిగారు ... 1-0-0

భీష్ముడు (నాటకము)—పో. పిచ్చిరెడ్డిగారు ... 1-0-0

అవిమారకము (నాటకము)—మానపల్లి రామకృష్ణకవిగారు 0-10-0

కృషీవలవిజయము ... 0-8-0

వివాహతత్త్వము—బం. మల్లయ్యశాస్త్రిగారు ... 0-8 0

నిరుద్ధభారతము—మం. వెంకటశర్మగారు ... 0-8-0

శ్రీరామవిజయము (నాటకము) ... 0-8-0

ఆరోగ్యసాధనము— గాంధీమహాత్ముడు ... 0-8 0

గీతాబోధ— , ... 0-4-0

ప్రార్థనగీతావళి ... 0-4-0

హాలికోద్ధారము—(ప్ర) శేషాద్రిశర్మగారు రు. 0-4-0

మానవస్వత్వములు—థామస్ పెయిన్ 0-4-0

హిందీతెలుగు బాలశిక్ష—పం. ఆ. శాస్త్రిగారు 0-6-0

,, మొదటివాచకం 0 6-0

**మేనేజరు, ఆంధ్రగ్రంథమాల,**

7, తంబుశెట్టివీధి - - - జి. టి., మద్రాసు,



# విషయానుక్రమణిక

**1945, మే**



## చిత్రములు



**ఆశ్రితరక్షణ**

ధ్దుడు ఉప   నంతరము గాలివానచే తపింపబడినప్పుడు ముచిళిందుడు అను నాగరాజు ఆశ్రయమిచ్చుట

(నాగార్జునకొండ శిల్పము.)

—చిత్రకారుడు : శ్రీ తేజోమూర్తుల కేశవరావు




సంపుటము 22 | మే, 1945 | సంచిక 5

పార్థివ - వైశాఖము

# విభ్రమము



= శ్రీ మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి =

ఈ వరుదెంచు సవ్వడియె యెక్కుడుగాఁగఁ గరంచెడిన్ ననున్
నీ వచనమ్ముకన్నఁ జెలి! నీ వనునట్టిది నాకు వ్యక్తమై
పోవఁగ లోని పొంగణఁగిపోవును వ్యక్తమెగాక యుంట నే
దైవము సైతమింత మమతన్ బురికొల్పెడినేమొ చూడఁగన్

చిక్కిన రత్నగర్భను త్యజింపఁగ నీయక నైహికమ్మునన్
గుక్కక పోవనీక యదిగో! చెలి! సర్వరస స్వరూపివై
చక్కని చూపు మిక్కిలి ప్రసన్నముగన్ భవదక్షులందు ఆ
దృక్కొకఁడున్నఁజాలు సశరీరపు స్వర్గసుఖమ్ము నొందఁగన్

ఒక్క యిహమ్మటంచు మొదలుండినచో నిఁక బ్రక్కనున్నయున్
లెక్కకు వచ్చుగాని మొదలే యదశూన్యముఁ జేసి సున్నకున్
మ్రొక్కులు వెట్టనక్షతలు మొండియు గంధము మొండిగాదె యా
చక్కదలంపరాదు సుమి స్వప్నము నందయినన్ మనోహరీ!

మాటికిఁ గంటిగ్రుడ్లొరసి మబ్బును మబ్బును రాచుకొన్నటుల్
బోటిరో! చూపటన్న మెఱపున్ సృజియింపుచునుండ మాటయున్
నోట ధ్వనించుచున్నది మనోగతి నెప్పటికప్డు నాసికన్
సూటి నొనర్చు కొంచుఁ గనుచూపును ముందిడు కొంచు వింతగన్

కొలుకుల మధ్య సూక్ష్మతను గ్రుడ్డులకుంగల మేళనమ్ముచే
గలిగిన చూపె కారణముగా ధ్వని పుట్టుచు నుండులోనఁ గ
న్నులెపుడు మూసియుంచినను నోరసలే మెదలింపకుండినన్
జెలియరో! వీనిసృష్టి యొక చిన్నము భిన్నముగాక సాగెడిన్

కన్నెటు లీవు త్రిప్పినను గాని మనోగతమే ప్రధానమై
యున్నెడనుండి చూపెడమనో కుడినో ప్రసరించి నెచ్చెలీ!
వెన్నెలగానో వెల్గుగనో విభ్రమముంగలిగింపఁ జొచ్చెడిన్
మున్న మెఱుంగుగా నుదయముంగని యుండియు గూడనంతలో.



# ఆత్మ: వేదాంతదర్శనము

= శ్రీ నిర్వికల్పానంద =

శరీరమును, ఇంద్రియములను, ప్రాణములను మనస్సును ఆత్మగా నిర్ణయించుకొనెడి వాదము లున్నవి. ఇవి వేదానుమోదితములు కావు. వైశేషిక దర్శనము జ్ఞానమునకు ఆశ్రయమును, దేహాద్వ్యతిరిక్తమును అగు ఆత్మను ప్రతిపాదించుచున్నది. విషయేంద్రియ సంయోగమున జ్ఞానము ఉత్పన్నమగుననుట సర్వతంత్రసమ్మతము. కణాదమతమున, (అనగా వైశేషికదర్శనమున) జ్ఞానము గుణపదార్థము. గుణము ద్రవ్యాశ్రితము. ద్రవ్యము లేనిచో, గుణముండజాలదు. జ్ఞానము గుణమగుటవలన తదాశ్రయమగు గుణియొకటి యుండవలెను. జ్ఞానోత్పత్తి విషయేంద్రియ సాపేక్షమైనను, అవి జ్ఞానాశ్రయములు కాజాలవు. ఏలయన, జ్ఞానమున కాశ్రయమగునది జ్ఞాతయే. జ్ఞాతకు కాలాంతరమునగూడ జ్ఞాతవిషయము స్మృతికి రాగలదు. ఇంద్రియములుగాని విషయములుగాని వినష్టమైనప్పుడు, అవియే జ్ఞాతయైన పక్షమున, స్మృత్యవకాశముండదు. పూర్వదృష్టమగు విషయము చక్షురింద్రియము వినష్టమైనను స్మృతికి వచ్చుచున్నది; పూర్వజ్ఞాతమగు విషయము వినాశమైనను స్మృతికి వచ్చుచున్నది. కనుక, విషయేంద్రియములు జ్ఞానాశ్రయములు కాజాలవు. వీనికంటె వేరగు జ్ఞాత యొకడున్నాడు.

ఇక శరీరము కూడ జ్ఞానాశ్రయము కాజాలదు. ఏలయన, శరీరము భౌతికపదార్థము. జ్ఞానము విశేషగుణము. భౌతికపదార్థమునకు సంబంధించిన విశేషగుణము, కారణ గుణపూర్వకము. ఎట్లన: శరీరమునకు కారణభూతమగు పరమాణువులు జ్ఞానగుణశూన్యములు. ఇట్లనుటకు కారణము: శరీరమునకు వలె ఘటాదులు కూడ పరమాణు కార్యములేయైనను ఘటాదులయందు జ్ఞాన మనుభూత మగుట లేదు కాని శరీరమున అనుభూత మగుచున్నది. పరమాణువులు జ్ఞానగుణసంపన్నము లైన పక్షమున, తదారబ్ధకార్యము లన్నిట జ్ఞాన మనుభూత మయ్యెడిది. భూస్థాపితమైన మృతశరీరము మృత్తికారూపమున పరిణామము నందినప్పుడు, తన్నిర్మిత మగు ఘటమున జ్ఞాన మనుభూతము అగుచుండుట లేదు.

ప్రతిపరమాణువునను జ్ఞానము సూక్ష్మరూపమున నున్నది. ఇంద్రియ సాహాయ్యమున నాజ్ఞాన మభివ్యక్త మగుచున్నది. కాని ఘటాదులు ఇంద్రియరహితము లగుటవలన ఈ జ్ఞాన ముపలబ్ధ మగుటలేదు అనినచో, పరమాణువులయందు గాని తదారబ్ధము లగు ఘటాదులయందు గాని జ్ఞానము సూక్ష్మరూపమున నున్నదను విషయము ప్రమాణసిద్ధము కాదు. ప్రమాణసిద్ధమైన యెడలనే, ఇంద్రియాభావమున జ్ఞానా[illegible]కి అనవచ్చును. పరమాణు ప్రభృతులయందు జ్ఞాన మున్నదనుట కేవల కల్పనామాత్రము.

ఇట్టి కల్పన నాశ్రయించినయెడల కలుగు లాభ మొకటిఉన్నది. అది జ్ఞాన నిత్యత్వము నంగీకరించుట. వేదాంతమతమున జ్ఞానము నిత్యపదార్థము. ఇంద్రియ సాహాయ్యమున అంతఃకరణమున విషయాకారవృత్తి ఉద్భవించి చైతన్యమువలన ప్రకాశము నందుచున్నది. విరోధిమతమున దేహధర్మ మగు సూక్ష్మ జ్ఞానము ఇంద్రియ సాహాయ్యమున అభివ్యక్తి నందుచున్నది. సూక్ష్మజ్ఞానము పరమాణువులయొక్కయు ఘటాదుల యొక్కయు ధర్మమైనను, ఇంద్రియాభావమున ప్రకాశప్తి నందుటలేదు. ఈ రెండుమతములకును గల పార్థక్యము

అల్పము. కనుక, విరోధికూడ అజ్ఞాతముగ వేదాంత మతము ననుసరించుచున్నా డనవచ్చును. వైశేషికులు జ్ఞానాశ్రయ మగు ఆత్మ ననుమానించుచున్నారు. చార్వాకులు అనంతపరమాణువులను జ్ఞానాశ్రయముగ చెప్పుచున్నారు.

జ్ఞానము శరీర ధ ర్మ మైన యెడల అనుభూత విషయస్మృతి, పొసగదు. శరీరము పరిణామధర్మి. బాల్యమున నుండిన శరీరము వార్ధక్యమున లేదు. బాల్య స్మృతి వార్ధక్యమున కలుగుటకు అవకాశము లేదు. కనుక చార్వాకుల యుక్తికంటె న్యాయవైశేషికుల యుక్తియే సమీచీన మని తేలుచున్నది.

కార్యనియుక్తము లగు యంత్రాదులను గమనించినయెడల, అవి స్వతంత్రముగ పని చేయుచున్న వను భ్రాంతి కల్గును. కాని, అధిష్ఠాతలేనిదే అవి పరిచాలితములు కాజాలవు. చార్వాకులు ఉపర్యుక్త మగు భ్రాంతికి లోనై, ద్వితీయవిషయమును గమనింపరైరి. ఘటికాయంత్రము, గోలకము, కందుకము మొదలగునవి. సంస్కారప్రభావమున స్వతంత్రముగనే పనిచేయుచున్నట్లు తోచినను, వానిని ప్రథమమున నియమించిన కర్తను విస్మరింపజాలము.

శరీరము స్వశక్తి వలననే పనిచేయుచున్నది కాని, మృతశరీరమున శక్తిలేకుండుట వలన కార్యాక్షమమగుచున్నదనినను, ప్రకారాంతరమున శరీరాతిరిక్తమగు ఆత్మను అంగీకరించినట్లే యగును. ఏలయన, శరీరగతమగు శక్తి, శరీరముకాదు. శరీరకృత్యములను నిర్వహించునదియును, శరీరాతిరిక్తమును నగు శక్తిని చార్వాకు లంగీకరించుచున్నారు. చార్వాకులు దానిని దేహగత శక్తియనుచున్నారు; వైశేషికులు ఆత్మ అందురు.

తండుల చూర్ణాది పదార్థములలో మాదకత లేకుండినను, మిళితపదార్థోత్పన్న మగు మద్యమున మద శక్తి యేర్పడునట్లే, ఏ ఒక భూతమునను చైతన్యము లేకుండినను, మిళితములగు పృథివ్యాది భూతములు శరీరముగ పరిణతమైనప్పుడు చైతన్య మావిర్భవించుచున్నదని చార్వాకులందురు. ఆయా పదార్థములలో అవ్యక్తముగ మదశక్తి లేకుండిన మిళితమైనను మద శక్తి ఆవిర్భవింపదని సాంఖ్యాచార్యు లనుచున్నారు. నువ్వులలో నూనెయుండుటవలననే, నిపీడితావస్థయందు తైలము వెలువడుచున్నది. ఇసుకను పిండినను నూనెరాదు. అందు తైలమవ్యక్తముగ నుండకపోవుటయే కారణము.

సాంఖ్యాచార్యు లింకను చెప్పునదేమన: శరీరము మూలపదార్థము కాదు, కొన్ని మూలపదార్థముల సంహతి (కలయిక)చే నేర్పడినది. సంహత పదార్థము పరార్థము. అనగా, అది స్వప్రయోజనార్థము కాక, అన్యప్రయోజనార్థము నిర్మితమైనది. గృహశయ్యాదులు పరార్థమైనట్లు, శరీరము కూడ పరార్థమే యగుచున్నది. సంహతపదార్థము భోగ్యము కాని, భోక్త కాదు. శరీరము కూడ సంహతపదార్థ మగుటచే, పరార్థ మగుచున్నది. ఆ పరుడే ఆత్మ.

దేహాత్మవాదము నంగీకరించినచో పుణ్యపాపముల ఫలభోగము కానేర దని న్యాయదర్శనప్రణేత యగు గౌతముడు పల్కుచున్నాడు. ఏలయన, దేహాదిసంఘాతము అన్యత్వమునకు అనగా, భేదమునకు అధిష్ఠానము. శరీరములు పెక్కులు ఉత్పన్నములగుచు వినష్టములగుచున్నవి. కనుక, కృతహాని — అకృతాభ్యాగమదోషములు సంభవించును. కృతహాని యనగా చేసినదాని ఫలము అనుభవమునకు రాకపోవుట; అకృతాభ్యాగమ మనగా తాను చేయని దాని ఫలితమును అనుభవించుట.

మఱియును, శరీరమే ఆత్మయైనపక్షమున మృత శరీరమును దహన మొనర్చినవారికి పాపము తగులు ననవలసియుండును. దీని నెవ్వరును అంగీకరింపరు. దేహాతిరిక్తమైన ఆత్మయొకటి ఉన్నదను ప్రత్యయమే దీనికి కారణము. అగుచో, సాత్మకమైన దేహమును దహన మొనర్చినను హింసాకృత మగు పాపము సంభవింపదు అని ఎంచకూడదు. ఏలయన, ఆత్మ నిత్యమే యైనను, శరీరాతిరిక్తమైనదైనను తద్భోగోపకరణము

లను శరీరేంద్రియములను పీడించుటయే హింసాపద వాచ్యమగును.

'మృతశరీర' మనుపట్ల కొందరు శరీరము మృత మగునాయని శంకింపవచ్చును. నైయాయికాచార్యులే ఆత్మకు జననమరణము లున్నవని చెప్పుచున్నారు. అభినవ శరీరాదులతో ఆత్మకున్నగల్గు ప్రాథమిక సంబంధము జన్మయనియు, చరమ సంబంధ ధ్వంసము మరణమనియు వారి విశ్వాసము. కాని, మృత మగునది శరీరమే యని వేదాంతశాస్త్రము. ఛాందోగ్యోపనిషత్తు 'జీవాపేతం వావకిలేదం మ్రియతే నజీవో మ్రియతే' అనుచు, జీవపరిత్యక్తమగు శరీరమునకే మృతిగాని జీవునకు గాదని తెల్పుచున్నది. కనుక జీవచ్ఛరీరమును పీడించినదనే హింసకలుగునని తేలుచున్నది. అంతియగాక, అసమ్మాన సూచకములగు వాక్యములను ప్రయోగించినను పాపము కల్గును. ఈ విషయమునుగూడ ఛాందోగ్యమే ప్రాణోపాసనా సందర్భమున నుపవర్ణించుచున్నది.

శరీరమువలెనే ఇంద్రియములుగూడ సంహత పదార్థములు. సంహత పదార్థములు పరార్థములని పైన దెల్పియుంటిమి. కనుక, ఇంద్రియాతిరిక్తమగు ఆత్మ యొకటి యున్నదని తేలుచున్నది. న్యాయదర్శనకారుడగు గౌతముడు 'దర్శనస్పర్శనాభ్యామేకార్థ గ్రహణాత్' అను సూత్రమున ఇంద్రియాత్మవాదమును ఖండించియున్నాడు.

ఏదైన ఒక విషయమును గ్రహించుటకు నేత్రేంద్రియమును, త్వగింద్రియమును ఆవశ్యకములగుచున్నవి. 'నేను పూర్వము చూచినదానినే ఇప్పుడు తాకుచున్నాను' అను లోకానుభవమున గ్రహణద్వయము ఏక కర్తృకమను ప్రతిసంధానము కలుగుచున్నది. దీనివలన, ఇంద్రియములు ఆత్మ కానేరవనియు, ఇంద్రియాతిరిక్తమగునదియే ఆత్మయనియు ప్రతిపన్నమగుచున్నది. ఆయా ఇంద్రియములు లేకుండిన దర్శన స్పర్శన ఘ్రాణాదికార్యములు జరుగకుండుట నిక్కము; కాని, అవి కర్తృపదవాచ్యములు కానేరవు. వృక్షచ్ఛేదన కార్యము, పరశువుద్వారా నిర్వహితమైనను, కర్తయగు పురుషుడు వేరొకడు గలపబడుచున్నాడు. అదేరీతిగ ఇంద్రియములు ఆత్మకు ఉపకారకములు. అదియును గాక, ఇంద్రియ విషయములు నియమితములు. ఒక్కొక్క ఇంద్రియము నిర్దిష్టవిషయ గ్రహణమునకే సామర్థ్యవంత మగుచున్నది. ఇక ఆత్మయన్ననో, అనియమిత విషయమై, సమస్తవిషయములను గ్రహింపగలుగుచున్నది.

'ఇంద్రియాంతర వికారాత్' అను సూత్రమున గూడ గౌతముడు ఇంద్రియాతిరిక్తమగు కర్తను నిరూపించియున్నాడు. ఎట్లన: సురుచియుక్తమగు నొక ఫలవిషయమున చక్షురింద్రియ ద్వారమున రూపమును, ఘ్రాణేంద్రియద్వారమున గంధమును గ్రహింపబడి తద్రసవిషయమగు అనుమాన మొనర్పబడ, రసనేంద్రియమునకు చాపల్యము కలుగుచున్నది. ఇక్కడ అనుమాత యొక్కడున్నాడను విషయము విశదమగుచున్నది. చూచినదొకరు, వాసనచూచిన దింకొకరు, అభిలాష జనించిన దింకొకరికి. ఇంద్రియాత్మవాదు లిద్దాని నెట్లు సమర్థింపగలరు? అభిలాష ఎవరికి కలుగుచున్నదో, తెలుపుమనిన, కని చెప్పవలసి వచ్చును.

ఇక ప్రాణాత్మవాదమును ఖండించుటకు దర్శనకారులు విశేషములగు యుక్తులను జూపలేదు. ఏల యన, భూతచైతన్యవాదము ఖండితమైనప్పుడే, ప్రాణాత్మవాదముకూడ ప్రత్యుక్తమైనది. కాని, బృహదారణ్యకమున ప్రాణాత్మవాదము విశేషముగ ఖండితమగుట గమనింపనగును. (చూ. ౭ వ-పేరా).

మనస్సు ఆత్మయా యను విషయము ప్రస్తుతము విచారణీయము. ఏ విషయమునైనను గ్రహింపవలసిన, తదుపయుక్తమగు ఇంద్రియముండవలెనను విషయము నిర్వివాదము. నేత్రేంద్రియము లేకుండిన యెడల రూపజ్ఞానము కలుగదు. అట్లే, వివిధేంద్రియముల సాహాయ్యమున విషయజ్ఞానము లభ్యమగుచున్నది. స్మృతిజ్ఞానమున కుపాలంభకమగునదేమనిన, మనస్సనవలసియుండును. మనస్సు వలననే ఆత్మకు ఈ జ్ఞానము, అన్య విషయజ్ఞానమువలెనే, కలుగుచున్నది. కనుక, మనస్సు

గూడ ఇంద్రియమే అని స్పష్టమగుచున్నది. తదితరములు బహిరింద్రియములగుచో, మనస్సు అంతరింద్రియము.

స్మృతివలెనే సుఖదుఃఖములనుగూడ ఆత్మ మనోద్వారముననే అనుభవించుచున్నదను విషయము గమనార్హము. రూపదర్శనముననకే నేత్రేంద్రియము తోడ్పడుచున్నది. దానివలన రసానుభూతి కొజాలదు. రసానుభూతికి జిహ్వేంద్రియము ఆవశ్యకము. అట్లే సుఖదుఃఖానుభూతికి మరియొక ఇంద్రియము అవసర మగుచున్నది. అనుభూతికర్త ఆత్మ, సాధనము మనస్సు. మనస్సే ఆత్మయనినచో, ఆత్మయొక్క ఆత్మత్వము అస్వీకృతమై, నామమాత్రముగ మనస్సునకు ఆత్మత్వము ప్రసాదింపబడుచున్నది. కర్తృత్వ కరణత్వములు పరస్పర విరుద్ధములగుటచే ఏకాధిష్ఠానాశ్రయములు కొజాలవు. కనుక, ఆత్మయే మనోరూపమున సుఖదుఃఖాదులను పరిగ్రహించి, ఆత్మరూపమున భోగించుచున్నదను వాదము నిలువనేరదు.

వేదాంత సిద్ధాంతము అసమగ్రముగనో లేక వికృతముగనో గ్రహింపబడుట వలననే మనస్సు ఆత్మ యను భావము ప్రచారితమైనదని తోచుచున్నది. వేదాంతమతమున ఆత్మ నిత్యచైతన్య స్వరూపమును, అసంగమును, ఆత్మకెట్టి ధర్మములును లేవు. సుఖదుఃఖములు, జ్ఞానము, స్మృతి మున్నగునవి మనస్సు లేక అంతఃకరణముయొక్క ధర్మములు. ఆత్మ చైతన్య స్వరూపము లేక జ్ఞానస్వరూపమైనను అసంగము. కనుక ఆత్మ స్వరూపజ్ఞానము మనోధర్మము కొజాలదు. వృత్త్యాత్మకజ్ఞానమేమనోధర్మము. సాంఖ్యాచార్యులు నేత్రరశ్మి ఒకానొక పదార్థముతో సంయుక్తమైన తోడనే, దర్శనేంద్రియము తద్విషయాకారముగ పరిణతినందునని చెప్పుచున్నారు. అనగా, దర్శనేంద్రియమునకు విషయాకారవృత్తి కలుగుచున్నదని కాని, దర్శనేంద్రియము విషయాకారముగ పరిణతమైనతోడనే విషయదర్శన మగుచుండుట లేదు. అన్యమనస్కుడగు వ్యక్తి సన్నికట వస్తువునుగూడ చూడలేకుండుట మనకు దెలిసియేయున్నది. కనుక, దర్శనవిషయమున మనస్సు గూడ సహకృతమైన యెడలనే దర్శనమగుచున్నదని స్పష్టము. నేత్రేంద్రియము విషయాకారముగ పరిణతి నందినతోడనే, తత్సంయుక్తమగు మనస్సుగూడ విషయాకారముగ పరిణతి నందుచున్నదని అంగీకరింపవలసి యున్నది. వేదాంతమతమున అంతఃకరణము నేత్రేంద్రియ ద్వారమున విసర్గతమై, విషయాకారమును దాల్చుచున్నది.

స్వప్నమునందువలెనే స్వప్నావస్థయందు అంతఃకరణముననే విషయానుభూతి యగుచున్నదనుటకు వలనుపడదు. ఏలయన, స్వప్నము మాయాధి విరచితమగుటవలననే నిది సంభవమగుచున్నది. అగుచో, జాగ్రదవస్థకూడ మాయామయమగుటవలన నిట్లెందుకు కాగూడదనిన; స్వప్నదర్శనము ఆగంతుకము, జాగ్రత్తయనినచో అట్టిది కాదు.

అంతఃకరణము విషయాకారముగ పరిణతమైనను, దర్శనము సిద్ధింపదు. విషయదర్శనమున ప్రకాశక మెయ్యది అను ప్రశ్న అట్లే నిలచిపోవుచున్నది. ఇంద్రియములును, మనస్సునుగూడ జడపదార్థములు, చైతన్యవంతములు కావు, అప్రకాశకములు ప్రకాశధర్మవంతములు కానివి ఇతరమును ప్రకాశింపజేయుననుట, హాస్యాస్పదము. కనుకనే, వేదాంతాచార్యులు ప్రకాశరూపమగు ఆత్మ అంతఃకరణ వృత్తియందు ప్రతిబింబితమై, ఈ వృత్తిని ప్రకాశింపజేయుచున్నదనుచున్నారు. అప్పుడే విషయము ప్రకాశితమగుచున్నది. ఈ సిద్ధాంతమును సాంఖ్యాచార్యులు గూడ అనుమోదించుచున్నారు. నైయాయికాచార్యులు ఆత్మప్రతిబింబము నంగీకరింపకుండినను, ఆత్మ మనస్సంయోగము లేకుండిన జ్ఞానోత్పత్తి కలుగదని అంగీకరించుచున్నారు.

ఫలితార్థమేమన: వేదాంతమతమున వృత్త్యాత్మకమగు జ్ఞానమును, సుఖదుఃఖములును మనోధర్మము లేయైనను, మనస్సు అప్రకాశక మగుటవలన, విషయములను ప్రకాశింపజేయుటకు ఆత్మయవసరమగుచున్నది. మనస్సుయొక్క ఆత్మత్వముకూడ ఖండితమగుచున్నది. ఈ విమర్శనప్రణాళి ననుగమించి చూచిన యెడల, శరీరమును, ఇంద్రియములును, ప్రాణమును, మనస్సును ఆత్మగా నంగీకరించెడు వాదములు నిస్సారములనియును, వీనికి పరమగునదియును, అనుగ్రాహకమగునదియును ఆత్మయని విస్పష్టమగుచున్నది.

# ప్రాక్ పశ్చిమ రీతులు*



## శ్రీ కొంతి వెంకట రామమూర్తి

నూతన్మనాడు యుగ విద్యుచ్ఛక్తిమంతమై విజయోల్లాసమున, ప్రభాపటలితో మనపై విరిసినది. ఫిరంగుల మోతతో, యంత్రముల త్రాణతో ఈ విద్యుత్తు మనపై వచ్చిపడినది. ప్రకృతి విజ్ఞానమార్జించిన శ్రేష్ఠ ప్రతిష్ఠతో వచ్చిచేరినది. ఆర్థిక, రాజకీయములందు సుఘటితమైనట్టి విజ్ఞాన మానాడు వచ్చినది. మన మనోభావితములును, జీవనగతులును వ్యవహారయోగ్యములు కావని ఉత్క్షిప్తమైనవి. మన వ్యవస్థలు యూరపునుంచి వీచిన యీ జంఝామారుతమున విశీర్ణమైనవి. సంస్కృతీ శోభచే ఆర్యావర్తమునకు వేరుతెగినట్లయి ఊపిరాడక పోయినది. స్థైర్యముతప్పి, అభిమానముపోయి, అర్ధజ్ఞానము కోల్పోయినది.

జీవనపథము కొత్తది మెట్టుచుండగా ఆర్యావర్త ఓజస్తేజసులకు సరితూగగల మాన్యక్షేత్రము కనరాలేదు. బుద్ధి వ్యాపారమున భారతీయులు అనుచరులైరి. మామిడిపండు ఆపిల్ పండు కాకపోవచ్చును. గాని కావుననేను, పంపకమునను, అమ్మకమునను దాని పద్ధతులు మామిడిపండునకును సాధ్యము. మన సంస్కృతీ ప్రతిభ బుద్ధ్యాత్మల మేరలో విరాజిల్లును. యూరప్ ప్రతిభ భౌతికవిషయ జగమున విహరించును. మన సత్త్వసీమకే మనము చేరుకొని, పాశ్చాత్యరీతుల వెలుగుజాడన దాని సార వివేచన చేయవలెను. పాశ్చాత్య జీవనపథమున అనుచరిస్తున్న భారతీయ జీవన మార్గమున నేతృత్వము మేలు. కాని నవవిధాన మలవడిన నాయకుల అవసరమున్నది. పాశ్చాత్య సరళి వెలుగున మనలబ్ధిని శోధింపగలవారి అవసరమున్నది.

పాశ్చాత్య వైభవము భౌతికశాస్త్రములందు ప్రతిఫలించును. భౌతిక శాస్త్రజ్ఞుని అనుభవప్రామాణ్యమే ఋషి అనుభూతికిని కలదని స్వర్గీయ శ్రీ ఎడింగ్టన్ అంగీకరించినారు. ఋషి లభ్యమైన సామగ్రిని పాశ్చాత్య శాస్త్ర పద్ధతుల సాయమున గ్రహించవలెనని వారు ఏర్పరచినారు. ఋషిదర్శనమును మూర్తిమంతముగా వ్యక్తముచేయవలయునని వారు విశేషించి సూచించినారు. వీరు అపేక్షించినదే హిందువులు నెరవేర్చినారు. అగోచరదర్శనము దేవతారూపమున మూర్తీభవించినది. బుద్ధ్యాత్మలకు భానమైనసూక్ష్మ సుసూక్ష్మ స్వరూపములు—అణుకణములే ఈ దేవతారూపములు. భౌతిక శాస్త్రము రసాయన శాస్త్రముగా వర్ధిలినట్లు దర్శనశాస్త్రము రసతంత్రముగా వర్ధిల్లవలెను. ఆత్మబుద్ధులు దర్శించు మూలాణువులేవి? దేవతా స్వరూపములందలి అణుక్రమమును, సాంఖ్యక్రమమును నిరూపించుటకు పూర్వము ఆ దేవతలగుణ పరీక్ష అవసరమగును. బ్రహ్మము అణురూపి, సాంఖ్యస్వరూపుడు. అణువులను, అణుసంజ్ఞకమైన సంఖ్యలను పాశ్చాత్యులుగూడ కనుగొనిరి కాని ద్రవ్యసంబంధమున, దేవతాస్వరూపములందును, మానవ లోకమందును, బుద్ధ్యాత్మల సందర్శనమందును ఏ అణువు లున్నవో, అణు సంజ్ఞా సూచకమగు సంఖ్య లేవో అరసి గ్రహించవలసినది దేశము.

---

* ఏప్రిల్ 23న మద్రాస్ సంస్కృతకళాశాలలో కుప్పుస్వామిశాస్త్రి రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ ప్రారంభోత్సవ సమయమందుచేసిన ఉపన్యాసభాగము.

# భారతి - పార్థివ వైశాఖము

దేవతల రసవిద్యనే కాదు మనము తెలుచవలసినది, వారి జీవశాస్త్రమును, బహుశః వారి సంఘవిధానమునుగూడ గ్రహించవలెను. హిందువు లారాధించు దేవతామూర్తులు అతని మానసపుత్రులు, హృదయవాసులు, జీవన విలోలురు. మన యీ శరీరములందలి భౌతికాణువుల పటుత్వము తప్పి పొందిక చెడినచో అనారోగ్యమేర్పడును. అదేవిధమున ఆత్మబుద్ధులకు జీవాంశమణుకణములు, వాని స్వధర్మమగు సంలీన క్రియాశక్తి నష్టమైనను అనారోగ్యమే వాటిల్లును. బ్రహ్మ సర్గజీవనదేవత. మన అంతర్నివాసి, బ్రహ్మ సృష్టిచేయమానినాడు. ఇందుచే మన శిల్పవిధము, శాస్త్రపథము ప్రవహించని తటాకములైనవి. బాహ్యముగ దేవళములందలి పిల్ల గుడులలో బ్రహ్మను ప్రతిష్ఠించినాము. జీవితాధి దేవత భూదేవి భర్త గుడిలో ఒకమూల నక్కుచున్నది. దేవభక్తులు దువ్వలువలను, నగలను లక్ష్మిపై గుప్పుచున్నారు. కాని పురోహితుని భార్యా ధర్మము భూదేవి పరిధానము. మన అభ్యంతర సంచారి భూదేవికి మూర్తిలేదు. ప్రాణసంచారమున కర్థము మూర్తిమంతమైన సృష్టి, సర్గమైన మూర్తిభావము. మన అంతర మందుండు బ్రహ్మదేవుడు, భూదేవి ఏల నిర్వీర్యులైనారు. వారి విన్యాసము మారినదా? వారు కృశించిపోకుండ ప్రత్యుజ్జీవితుల జేయలేమా? మన బుద్ధ్యాత్మల సముత్తేజమున కావశ్యకము కనుక దేవసంఘ కర్తవ్యములందును, బాంధవ్యములందును మార్పులు చేసి కొత్తలేమైన కావింపవలెనా? మానుష స్వత్వముయొక్క ఈ అంశను భారతీయ విజ్ఞానము తెలిచినట్లు మరెచటను తెలుచలేదు. విశ్వదేవుల పునః ప్రతిష్ఠ సంభవమేయగును.

భారత సంస్కృతీ శోధన ఈ దేశమునకే కాదు, అఖిలలోకమునకును అవసరమే. లోకమింగుకై ఆశగొనియున్నది. యూరప్‌లో పర్యటించగా నాకు తోచిన విషయములను 25 ఏండ్లక్రితము పూర్వోపాధ్యాయులు డా॥ ఏ. యన్. వైట్ హెడ్ గారికి తెలుపుకొంటిని. గణిత, తత్త్వశాస్త్రములందు వారు విఖ్యాతులు. నే చెప్పినది విని వారు తమ భావమిట్లు తెలిపిరి. "నీ వయస్సున నేను, ఏషియా సంగతి తేలిపోయినది, ఇకముందు యూరపుచే సంస్కృతమగుటే ఏషియా భవితవ్యమనుకొంటిని. కాని ఆ ఊహ సరికాదని గ్రహించుచున్నాము. లోకభవిష్యము నైనా భారతభూములం దిమిడియున్నట్లున్న టర్కీ, జపానులు అనుకరింపగలవేమోగాని దారిచూపించలేవు. భారతీయులు లోకము నేమికావింతురో చూచుటకును కాని నేనంతవరకు బ్రదుకను. మీరు చూడగలరేమో" అన్నవారి యీ మాటలు నా మనస్సులో ఇంకను నిన్న మొన్నటి పలుకులవలె మెదలుచుండును.

లోకజాతుల సమూహమున భారతదేశము భిక్షువు. లోకనాయకత్వ మీ భారతమెట్లు తాల్చగలదనుకొందుము? కాని అధ్యాత్మేతిహాసము నందలి శివుడు తలపుకు వచ్చుచున్నాడు. శ్మశానవాటికలో ఆది భిక్షువు నివాసము, భూతగణములతో వానిసాంగత్యము, వాని చుట్టును కాలహతమైన అస్థికాచయము, వాని మెడచుట్టును, పాముల సరములు. కాని ఈ భిక్షువునే లోకస్వాంతము పార్వతీరూపమున వలచినది. అతడే పరమశివుడు. అతని తృణీకరించిన దక్షయజ్ఞము బాగుపడలేదు. భిక్షువులకును స్థానమున్నది, ఆశకలదు. విధివశ్యులను భిక్షువులకు కాదు. విధిని శాసించగల భిక్షువులకు.

భారతభూమి మహాదేవుని నిలయమే కాదు, మహాదేవునికి మూర్తి, పరమశివుని భౌతిక స్వరూపము. శివుడీ విధమున అవతరించినాడు. అతడు తపస్వియే కాదు. మహాశిల్పి. నిఖిలభువన నటరాజతడు. సర్వమందును అతడు నర్తించును. ప్రధావకమైన ప్రతి ముహూర్తమందును ఆతని నాట్యము. మహావకాశమందలి ప్రతి తావునను ఆతని నృత్యమే. చాలకమైన అణువణువునను అతని గాత్ర విక్షేపము. చంచలపక్ష్మమున అతని నాట్యవిన్యాసము. భావనావిహంగములం దాతని నృత్యఖేల. ఊర్ధ్వతాండవమున శివుడు విశ్వాతీతుడు. అపుడతనినాట్యము ప్రళయగాన మాలకించి నిష్పందమై శాంతించును. శివునితో పాటువ, ఆర్యావర్తము

నకు. ఈ ధాత్రియు గొప్పశిల్పి—గాన సుందరును, ఖేలనలోను, చిత్రణములో, చెక్కడములలో, కట్టడములలో, స్వప్న సందర్శనములలో-భారతము మహాశిల్పి, తపస్వియును. కాని నేడు భాగ్యహీన మనిపించును. పరాంచలమున జీర్ణవస్త్రధారిణి, భగ్నవై కూర్చున్నది.

భారతీయ జీవనతత్త్వమున మూలాంశము లున్నవి. సర్వమును ఏకముగా అవలోకించగల దృష్టి, సమస్తము ఏకమను తాత్పర్యము, శక్తి పారవశ్యము వలన జనించు కార్యజాలము. వేమందును, సర్వాతీతముగను ఉన్న ఏకమే శివస్వరూపము -అంతర్నిహితమునకును సర్వాతీతమునకును శివుడు, సమన్వయమూర్తి. మనుజ సంఘమున ముఖ్యభేదమొకటికలదు,- ధర్మము నిహితమని ఆర్యుడనును, అతీతమని సెమెటిక్ అనును; ఇదే ప్రభేదమని డా. వైట్‌హెడ్ **Adventures of Ideas** అను గ్రంథమున వ్రాసినారు. కాని భేద మీ దేశమున నశించినది. ఆత్మకును, బ్రహ్మకును తాదాత్మ్యము చెప్పి సేతువుకట్టినారు.

మానవుని బాహ్యాభ్యంతర జీవనసమన్వయము కేవల అలౌకికాపేక్షితము కాదు. మానవ్యకము నుపలక్షించుచున్న సంకటమున ఈ సమయమునకు వ్యావహారిక ప్రాధాన్యత గలిగినది. యూరప్ అమెరికా ఖండములందలి మహాజాతులదే ఏకలోక మన్వేషించుచున్నవి. తీర్చిన రాణువలచే, రాజకీయ వ్యవస్థలచే ఆ లోకమును నిర్మించబూనుచున్నవి. కాని మనుజుల హృదయములందు విరియని ఏకలోకము లోక వ్యవహారమం దెట్లు పుష్పింపగలదు? 4 వేల సంవత్సరములుగా మానవ హృత్సీమలందు భారతదేశ మీ ఏకలోకాన్వేషణ చేయుచున్నది. పాశ్చాత్య కృషికి నేటి యీ మానవ సంకటతరణమునకు భారత జ్ఞానానుభవము తోడు కావలెను.

నిష్క్రమకః భారత జీవనధ్యేయమని భగవద్గీత వచించుచున్నది. వివశమైన శక్తినుండి కర్మ ప్రభవించును. సర్వము నేకముగా వీక్షించగల దృష్టి, ఏకమును సర్వముగా గ్రహించగల భక్తి—ఈ రెండంశల వల్లనే మూడవదగు శక్తి పారవశ్యము ప్రాప్తించును. భారతదేశమునకు తన ధ్యాసలేదు. వివశయే కాని, శక్తిపూర్ణ కాదు. యూరప్ అమెరికాలు శక్తిమంతములే కాని స్వనిమగ్నములు, వైవశ్యము లేదు. శక్తి వైవశ్యము రెండువిధముల అభివ్యక్తమగును. ఒకటి శివునివిషము, రెండవది పార్వతీతీరు. శివుడు నృత్యఖేలలో ప్రతిబింబించును. పార్వతి సపర్యలలో ప్రతిఫలించును. భారతమునకు మార్గము శివుడు చూపుచున్నాడు. యూరప్ అమెరికాలకు బహుశః పార్వతి బాటచూపుచున్నది. పర్వతసానువులందు, నదీప్రవాహములలో, మైదానములలో, సీమభూములందు, మృత్సారమున, సూర్యకాంతిలో, ధనములో దేహపరిశ్రమలో సంపదలునిబిడమైయున్నవి. భారతదేశము వీటిని వృద్ధిచేసికొనవలెను. ఒకొక్కరి కోసమే కాదు, ఎల్లవారికొరకును అభివృద్ధి చేయవలెను. పార్వతివలె యూరప్‌అమెరికాలు తపస్తప్తమై శక్తిపారవశ్యము కాంచవలెను. శాస్త్రము పదికొలది మంది లాభార్థమోగాక సకలజనుల సంసేవకుపయోగపడును. హితమొనర్చ నిర్మించలేని శాస్త్రము విసర్జితమగును. స్వల్పగణమునకు గాక జాతులన్నిటిని ఆర్థికరాజకీయ సంస్థాపన గావించవలెను.

మానవ్యక మీ నాడు దారికై ఈదిక్కుల తడవుచున్నది. ఆయా యుగములకు నిదర్శనముగ ద్వాపర కలియుగము లున్నవి. ఇక రానున్నది శివయుగము. శివుడు ఆత్మబుద్ధుల సుసూక్ష్మస్వరూపి, అణుమూర్తి, మానవజీవి భారతవీర్యము ధరించి ప్రసవింపగలదు. మరొకసారి నవకుమారసంభవమును మానవ్యకము చూచుకొనగలదు.





శాన్‌ఫ్రాన్‌సిస్కోలో మిత్రరాజ్యాల సభలు జరిగే భవనం, శాన్‌ఫ్రాన్‌సిస్కో యుద్ధస్మారకభవనం ఇది. ఆభవనంలోని విశాలమైన హాలుదృశ్యం.

# శాన్‌ఫ్రాన్సిస్కో ప్రాంతప్రాధాన్యము



ఈ యుద్ధానికి పూర్వము అమెరికా సంయుక్త రాష్ట్రపు పశ్చిమకోస్తా చాలా శీఘ్రంగా అభివృద్ధిచెందుతూ ఉండెను. యుద్ధం రావడంవల్ల యీ ప్రాంతం మరింత వేగంగావృద్ధిచెందుచున్నది. ఇక్కడ వర్తకనావల నిర్మాణం అపారంగా జరుగుతోంది. విమానాలను నిర్మించే ఫ్యాక్టరీలకిది ముఖ్యనిలయంగా ఉంది. ఈ నౌకానిర్మాణం, యీ విమానోత్పత్తి యుద్ధానంతరం కూడా యిక్కడ సాగుతూ ఉండగలవు. అమెరికా పశ్చిమకోస్తామీద అమెరికా సంయుక్తరాష్ట్రములలో చేరిన పెద్దరాష్ట్రములు నాలుగున్నవి. (౧) కాలిఫోర్నియా (౨) ఆరెగాను (౩) వాషింగటను (౪) నెవాడా ఈ నాలుగు రాష్ట్రములలోను నెవాడా రాష్ట్రమునకు మాత్రము కోస్తా ప్రాంతంలేదు. యిరుగుపొరుగు రాష్ట్రములన్నింటిలోను, కాలిఫోర్నియా రాష్ట్రంతోనే నెవాడా రాష్ట్రమునకెక్కువ వ్యాపార సంబంధంకలదు. పశ్చిమకోస్తాలోని నాలుగురాష్ట్రములు కలిసి ఫ్రాన్సుదేశానికి రెండింతలు వైశాల్యముకలవై యున్నవి. ఇక్కడ జనసంఖ్య 1 కోటి 20 లక్షలవరకు ఉంటుంది. ఇచట క్రొత్తక్రొత్తగా విజృంభించిన పరిశ్రమల మూలంగా ఇచటకు ఆకర్షింపబడిన ప్రజలే ఇక్కడ కొత్తగా కాపురస్తులై యుంటున్నారు.

కాలిఫోర్నియా రాష్ట్రములలోనే శాన్‌ఫ్రాన్సిస్కోనగర మున్నది. ఈ రాష్ట్రంలోని ఉత్తర ప్రాంతంలో వర్ష మెక్కువ. చాలా చల్లగా ఉంటుంది. దక్షిణప్రాంతంలో సమ శీతోష్ణంగా, మధ్యధరాసముద్రప్రాంతంలో ఉన్నట్లుగా ఉంటుంది. సెరానెవాడాపర్వతశ్రేణి ఉత్తర దక్షిణాలుగా విస్తరించి ఉన్నందున యీ కోస్తారాష్ట్రములకున్నూ అమెరికాలోని తూర్పుప్రాంతానికిన్ని రాకపోకలు అంతసులభం కావు. ఈ కోస్తాప్రాంతం యుద్ధకార్యోత్పత్తికి మంచి ఆయువుపట్టుగా ఉన్నది.

దక్షిణ కాలిఫోర్నియాలోని ప్రజలు వ్యాపారపు సరకులను అమ్మకంలో సాటిలేని సమర్థులు. తమ ప్రాంతం చాలా శోభస్కరమైనదనీ, ఆరోగ్య ప్రదమనీ, అత్యంత రమణీయమనీ వారు విశేషంగా ప్రకటించుకుంటూ ఉంటారు. ఇతర ప్రాంతవాసులను ఆ విధంగా అక్కడికి ఎక్కువగా ఆకర్షిస్తారు.

బ్రహ్మాండమైన హాలీవుడ్ ఫిల్ము సంస్థానం యీ కాలిఫోర్నియా రాష్ట్రంలోనే ఉంది. కాలిఫోర్నియారాష్ట్రపు నైసర్గిక శోభ చాలా గొప్పదని ఇక్కడతీసే ఫిల్ములద్వారా విశేషంగా వ్యక్తమౌతున్నది. వాతావరణస్థితి దివ్యంగా ఉంటుందనిన్ని, పల్లెటూళ్లు పసందుగా ఉంటాయనిన్ని ఎక్కువగా ప్రకటించి యితర ప్రాంతాలవారిని ఆకర్షిస్తూ ఉన్నారు.

ఎండకాలంలో వర్షాలు ఉండవు. శీతకాలంలో చలి ఎక్కువగా ఉండదు. అందువల్ల బయటి ప్రదేశాలలో ఫిల్ములకు కావలసిన సీనులను ఫోటోలు తీయుటకు దివ్యంగా ఉంటుంది. సముద్రతీరంఉంది. పర్వత ప్రాంతాలూ ఉన్నవి. ఎడారులున్నవి. ఫిల్ము స్టూడియోలకు చేరువలోనే మహోన్నతమైన వృక్షాలుగల పర్వత ప్రాంతాలు ఉన్నవి. చక్కని పైరుపంటలతోగల గ్రామాలున్నవి. అన్నిరకాల నైసర్గికదృశ్యాలున్న ఫిల్ము స్టూడియోలకు అందుబాటులో ఉండడంచేత ఫిల్ములకు కావలసిన అనేకసీనులను సులభంగా ఫోటో తీయవచ్చును. అందువల్ల ఫిల్ము పరిశ్రమకు ఇదిముఖ్యస్థానముగా నున్నది. హాలీవుడ్‌లో తయారయ్యే ఫిల్ములను చూడని అమెరికను ఉండడు. చికాగో నగరానికి పశ్చిమంగాఉన్న లాస్ ఏంజెల్సులోని పెద్దవ్యాపార

పరిశ్రమలలోకి యీ ఫిల్ముపరిశ్రమ ఒకటిగా రాణిస్తూన్నది.

ఇదిగాక, యిచటి విమానోత్పత్తి ఫ్యాక్టరీలు బ్రహ్మాండమైనవి. అమెరికా మొత్తంమీద ౧౯౪౦ సం.లో ఉత్పత్తియైన విమానములో సగమువంతు ఇచటి ఫ్యాక్టరీలలోనే ఉత్పత్తి యైనవి. కిరసనాయిలు శుద్ధిచేసే యంత్రాగారములు ఇక్కడ ఉన్నన్ని అమెరికాలో ఇంకెక్కడనులేవు. ఉత్తర అమెరికాకు దక్షిణఅమెరికాకు మధ్య పెనామా కాల్వను త్రవ్వి అటు పసిఫిక్కు మహాసముద్రమును ఇటు అట్లాంటిక్కు మహాసముద్రమును కలుపుటవల్ల అమెరికాలోని పశ్చిమకోస్తావైపులనుండి సులభంగా అమెరికా తూర్పుకోస్తాలోని రేవులతో నౌకారహదారీ వృద్ధియైనది. తత్ఫలితంగా కాలిఫోర్నియాకోస్తా ప్రాంతాల ఆర్థికంగా వృద్ధిలోనికి వచ్చినవి.

ఈ పశ్చిమకోస్తాలో నేలబొగ్గుగనులు లేవనే చెప్పవచ్చును. అందుచేత ఇచటి యంత్రాగారములు పనిచేయుటకు కిరసనాయలు మూలంగా ఆయిలు ఇంజనులైనా పనిచెయ్యాలి, లేదా, జలపాతముల ద్వారా సప్లయి అగుచున్న విద్యుచ్ఛక్తి మూలంగా యీ యంత్రాగారములు పనిచెయ్యాలి. కాలిఫోర్నియా ప్రాంతంలోఉన్న కిరసనాయిలు గనులలోని కిరసనాయిలు అంతా అయిపోయినట్లయితే, అటుపిమ్మట యిచటి యంత్రాగారములన్నియు విద్యుచ్ఛక్తితోనే పనిచేయవలసి వస్తుంది. ఈవిషయమును ముందుగానే గ్రహించి విద్యుచ్ఛక్తి ఉత్పత్తి నానాటికీ వృద్ధి చేస్తున్నారు.

ఇక్కడ ఎండకాలంలో వర్షములు లేకపోవుట చేత పైరుపంటలకు సాధ్యమైన అనుగుణమైన ప్రాంతాలలోనే ఎక్కువ ఫలసాయమును రాబట్టుటకు మిక్కుటమైన కృషి చేయబడుచున్నది. ఇక్కడ నారింజలు, నిమ్మలు కూరగాయలు ఎక్కువగా పండుచున్నవి. యితరత్రా ఉన్నధరలే ఇక్కడకూడా పలుకుతున్నవి.

కాలిఫోర్నియాలోని దక్షిణప్రాంతం ఎంతో చూడ సొంపయినది. అందువల్ల చాలామంది కొత్త కొత్తగా వచ్చి ఇక్కడ పాతకాపులగుచున్నారు. మొట్టమొదట వలసవచ్చినవారు స్పెయిన్ దేశీయులు. కొత్తవారు చాలామంది ఇక్కడ స్థిరావాసులగుచుండుట వల్ల సమర్థులు ప్రవీణులునైన ప్రముఖుల తెలివితేటల వల్ల బాగా యీప్రాంతం నానాటికి వర్థిల్లుతున్నది.

కాలిఫోర్నియా రాష్ట్రంలోని ఉత్తరప్రాంతము పెద్దపర్వత లోయగానున్నది. ఇక్కడ ద్రాక్షతోటలు విశేషంగా పెంచుతున్నారు. అందువల్ల ఉత్తర కాలిఫోర్నియా ప్రాంతం పెద్దద్రాక్షారామమని చెప్పవచ్చును. (1) సాక్రెమెంటో, (2) సాన్ జోయాక్విన్ అనే రెండు నదులు ఇక్కడ ప్రవహిస్తున్నవి. కాని యీ నదీజలములను వ్యవసాయమున కుపయోగించుటకై నీటిపారుదల ఏర్పాట్లు జరుగవలసియున్నవి. ఈ రెండు నదుల యందలి ప్రవాహజలములను అరికట్టి నిల్వచేయుటకు రెండు పెద్దజలాశయములను నిర్మించుటకు పని జరుగుచున్నది త్వరలోనే యీ నిర్మాణములు పూర్తికాగలవు. ఈ జలాశయములలోని నీరు పైరుపంటల సాగుకు మాత్రమేగాక, పట్నములలోని ప్రజలు త్రాగుటకొరకున్నూ సప్లయి చేయబడును. ఉత్పత్తియగునట్టి ఫలసాయమును విక్రయించుటకు తగిన వ్యాపారరంగము అందుబాటులో లేదు. సహకారసంఘముద్వారా పంటసరకులను విక్రయించుటకై ఏర్పాట్లు చేసికొన్నారు.

### శాన్‌ఫ్రాంసిస్కోసభ

ఉత్తర కాలిఫోర్నియాకు ప్రధాననగరంగా కాలిఫోర్నియా ఉన్నది. కాలిఫోర్నియాకు బాహ్య ప్రపంచంతో సంపర్కం శాన్‌ఫ్రాంసిస్కో ద్వారా ఏర్పడుచున్నది. ఈ శాన్‌ఫ్రాంసిస్కోనగరంలోనే సంయుక్తరాజ్యాల సమావేశము జరుగుచున్నది. శాన్‌ఫ్రాంసిస్కో రేవు చాలా పెద్దది. సహజసిద్ధమైన నౌకాశ్రయం కలదు. ఈ రేవుకు "సువర్ణద్వారం" అనినామకరణం చేయబడినది. ఇంతకన్నా

పెద్ద ఓడరేవు అమెరికా పశ్చిమకోస్తామీద లేదు, దానికి పోటీగా దక్షిణ కాలిఫోర్నియాలో లాస్ ఏంజెల్సురేవు ఉన్నది. కాని ఇది జనసంఖ్యలోగాని పరిశ్రమలలోగాని దానికన్న మించియున్నది. దానికి పోటీగా ఇంకా ఉత్తరంగా వాషింగ్టను రాష్ట్రంలో సియాటిల్ అనే రేవు ఉన్నది.

ఓరెగాను రాష్ట్రములో పోర్టులాండు రేవులో నౌకా నిర్మాణశాలలు చాలా బ్రహ్మాండమైనవి ఉన్నవి. ఈ రేవుకు సమీప ప్రాంతాలలోనే కలప చాలా సమృద్ధిగా లభిస్తుంది. మంచి మంచి సముద్రతీర రేవులుకూడా ఉన్నాయి. ఉటాఅనే ప్రాంతంలో ఇనుము ఎక్కువగా లభిస్తుంది. ఇది పోర్టులాండురేవు వద్ద ఫ్యాక్టరీలకు రవాణా చేయబడుచున్నది. గోధుములుకూడా విశేషంగా ఇక్కడికి రవాణా అవుతున్నాయి. అన్నింటికన్న ఎక్కువ సమృద్ధిగా ఇక్కడ సప్లయిఅయ్యేది విద్యుచ్ఛక్తి. ఇంత విరివిగా విద్యుచ్ఛక్తి సప్లయి చేసేటటువంటి విద్యుదుత్పత్తి స్థానం యూరోపుఖండంలోగాని అమెరికాలోగాని మరెక్కడా లేదు. కొలంబియా నది ఇక్కడ ప్రవహిస్తోంది. ఇచటిభూసారం చాలా మంచిది. తొలియుగాలలోని అగ్నిపర్వతోద్భూత పాషాణ మృత్తికతోకూడిన నేల ఇది. గోధుమపంటకు బంగారువంటి నల్లరేగటి నేలఇది. కొలంబియానదికి ఆనకట్టుఉంది. విద్యుచ్ఛక్తి ఇక్కడ ఉత్పత్తి అవుతున్నది.

గ్రాండు కవులీ ఆనకట్టవద్దను, బోనెవిల్లీ ఆనకట్టవద్దను ఉత్పత్తియగుచున్న విద్యుచ్ఛక్తి కొలంబియా నదీప్రాంత మంతటికీ కావలసిన విద్యుత్తుకు రెండింతలుగా ఉన్నది. ఇక్కడ చవుకగా విద్యుచ్ఛక్తి సప్లయి అగుచుండుటవల్ల అనేక యంత్రాగార పరిశ్రమలను నెలకొల్పుటకు ప్రోత్సాహ మేర్పడుచున్నది.

నెవాడా రాష్ట్రములోని భూసారం మంచిది కాదు. చెట్టుచేమలు విరివిగా పెరుగవు. ఈ రాష్ట్రంలో పశువుల మందలుమాత్రం ఎక్కువగా పెంచబడు చున్నవి. పాడి పరిశ్రమకిది ముఖ్యకేంద్రంగా ఉంది.

## అమెరికా పశ్చిమకోస్తా పురోభివృద్ధి

యుద్ధంమూలంగా యీపశ్చిమకోస్తాలో యిటీవల ఎక్కువగా విజృంభించిన పరిశ్రమలకు విశేష జనం ఇక్కడ నివాస మేర్పరచుకోనవలసివచ్చింది. ఇక్కడ విమానాశ్రయాలు వృద్ధియైనాయి. సైనిక మకాములు ఎక్కువైనాయి. నౌకానిర్మాణశాలలందును, విమాననిర్మాణ ఫ్యాక్టరీలలోను కొత్తగా వచ్చిన జనం ఎక్కువగా పనిచేస్తోంది. పసిఫిక్కు మహాసముద్రంలోని యుద్ధరంగములకు యీ పశ్చిమ కోస్తానుంచి సేనలు వగైరా పోతూ ఉండాలి. ఈ కోస్తాలో నిర్మింపబడే వర్తకనావలు అపారంగా హెన్రీ కెయిజరుగారి యాజమాన్యమున నిర్మింపబడు చున్నవి. ఇతడు చాలా పెద్దవ్యాపారస్థుడు. ఇటువంటివ్యాపారస్థులు ఇక్కడ యుద్ధావసరములకై సాగించుచున్న పరిశ్రమల మూలంగా విశేషజనాన్ని యీ ప్రాంతానికి ఆకర్షించారు. యుద్ధానంతరంకూడా ఈ జనానికి పనిపాటలు ఉండేనిమిత్తమై ప్రస్తుతం వృద్ధిలోనికివచ్చిన పరిశ్రమలనే యుద్ధానంతరంకూడా సాగించుచుండుటకై కొన్ని యుద్ధానంతర నిర్మాణ విధానములను సూచించుచున్నారు. నూత్న యంత్ర పరిశ్రమలను నెలకొల్పి నిర్వహించుటకు మ్యునిసిపాలిటీలుకూడా తోడ్పడ నిశ్చయించినవి. విద్యుచ్ఛక్తి సప్లయి విషయములో ఒకరాష్ట్రమునందు విద్యుత్తు సప్లయి చాలకపోతే మరొకరాష్ట్రమునుండి సప్లయి పొందుటకు పరస్పర విద్యుత్ సప్లయి ఏర్పాట్లు ఆయా రాష్ట్రములు యుద్ధానంతరాభివృద్ధికొరకై నిర్ణయించు కొన్నవి.

కాబట్టి యుద్ధానంతరం అమెరికాలోని మ కోస్తాప్రాంతములోని వివిధ రాష్ట్రములు చాలా వృద్ధి లోనికి రాగలవై యున్నవి.

# ఉదాహరణవాఙ్మయము - దాని విశిష్ట

= శ్రీ క్రొవ్విః రామం

తెలుగు సీమకే వెలుగుతెచ్చిన లఘుకృతులలో ఉదాహరణలు ప్రముఖస్థానం వహిస్తాయి. "ఉదాహరణ" అంటే "మచ్చు" అనే అర్థంలో మాత్రం యిక్కడ యీ పదాన్ని వాడుకచెయ్యలేదు. ప్రబంధాల లాగే ఆంధ్రసారస్వతానికి విశిష్టతను చేకూర్చిన ఒక శాఖకు ఉదాహరణ అని పేరు. ఈ రచనకు శ్రీకారాన్ని చుట్టినవాడు వీరశైవ మహాకవిఅయిన పాల్కురికి సోమనాథుడు. సంస్కృతంలోకూడా యీ కవి ఉదాహరణను రచించి ఖ్యాతిపొందేడు. ఎనిమిది విభక్తులతో ఎనిమిది పద్యాలు, కళికలు, ఉత్కళికలు కలిగి భక్తిభావ బంధురంగా వుండే రచనా విశేషానికి ఉదాహరణ అనిపేరు. ఈ ఉదాహరణకి చివర సార్వవిభక్తికంగా ఒక వృత్తంకూడా వుంటుంది. పన్నెండో శతాబ్దిలో పాల్కురికి సోమనాథుడు మొట్టమొదట బసవోదాహరణమనే గ్రంథాన్ని రచించేడు. సంగీత సాహిత్యాలను మేళవించి, మార్గ దేశి, కవితలకు చక్కని సమన్వయాన్ని కుదిర్చిన ఉదాహరణలు ఆంధ్రసాహిత్యంలో ధృవతారలు.

ప్రతి ఉదాహరణలోను వృత్తము, కళిక, ఉత్కళిక, అనే మూడు భాగాలు వుంటాయి. "ఉత్కళిక" కళిక తాలూకు భాగమే కనక దీన్ని ప్రధానంగా రెండు భాగాలక్రిందనే విభజించవచ్చును. కళికను, ఉత్కళికను కూడా దేశకవితకు తలమానికమైన "రగడ" అనే జాతీయచ్ఛందస్సులోనే రచిస్తారు. ఇవి తాళాంగ ప్రధానము లవడంచేత, హృద్యంగా పాడుకోడానికి ఉపచరిస్తాయి. ప్రజల హృదయకుహరాల్లో భక్తిభావాన్ని పెంపొందింపజేయడానికికూడా ఎక్కువగా తోడ్పడతాయి. మధురగతి రగడకు ఏకతాళము, వృషభగతి రగడకు త్రిపుట, ద్విరదగతి రగడకు జంపె మొదలైన అనుగుణమైన తాళాల్ని లాక్షణికులు నిర్వచించేరు. కవి, తన రచనా నైపుణ్యాన్ని ప్రదర్శించడానికీ, పాండితీపటిమను వెల్లడిచెయ్యడానికీ, మార్గ కవితను అవలంబించి వృత్తాన్ని వ్రాసే వాడనీ, భగవన్మహిమను గానయోగ్యంగా చేసి భక్తిప్రబోధానికి ఎక్కువ అవకాశం కల్పించడంకోసం దేశీయ ఛందస్సులో కళిక ఉత్కళిక వ్రాసేవాడన్నా సత్యదూరం కాదు. వీరశైవాన్ని అనన్యసామాన్యంగా ప్రచారం చేసిన పాల్కురికి సోమనాథుడే మొదటి ఉదాహరణ వ్రాయడంచేత, యిది ప్రచారానికి పరికరంగానే వెలిసిందనడానికి సందేహంలేదు. ద్విపదప్రబంధకవితకు చివరను, యక్షగాన కవిత్వానికి ముందు యీ ఉదాహరణలు పుట్టేయని మిత్రులు శ్రీ నిడదవోలు వేంకటరావుగారి అభిప్రాయం.

భాషా పరిణామానికి సంబంధించిన సరి కొత్త విశేషాలు కూడా యీ ఉదాహరణ వాఙ్మయంలో మనకు లభ్యమవుతున్నాయి. ఒక్కొక్కవిభక్తికీ అనేకమైన ప్రత్యయాలుంటే అందరు ఉదాహరణ రచయితలుకూడా, వాటిలో కొన్నిటిని మాత్రమే ప్రయోగించి, మిగిలినవాటిని పరిత్యజించేరు. ద్వితీయలో 'ని' తృతీయలో "చే", "చేత," చతుర్థిలో "కై" పంచమిలో "వలన" షష్ఠిలో "కు" సప్తమిలో "అందు" అనే ప్రత్యయాల్ని మాత్రమే వారువాడేరు అంటే ద్వితీయలో "ను," "ల" "కూర్చి" "గురించి" అనే ప్రత్యయాల్ని ఉదాహరణ కవులు పూర్తిగా వదలిపెట్టే



# సౌందర్యము యొక్క రెండు తరాలు

వారిద్దరికి **20** సంవత్సరములు తేడా; గాని, ఆ తల్లియొక్క సౌందర్యము, పదహారు సంవత్సరముల వయస్సుగల కుమార్తెకువలె వున్నది. తల్లి తన చిన్నతనమునుంచి—తన తల్లియొక్క సలహాను పొంది—చర్మ సౌందర్యమును, పియర్సు సబ్బుతోను నిర్మలమైన నీటితోను కాపాడుకొను చున్నది. ఈ రోజున సౌందర్యవతియగు తన కుమార్తె ఇదే చేస్తోంది. గాన ఆమె శరీర కాంతి, తన తల్లి శరీర కాంతివలె వుండును.

ఇండియాలో నలభై సంవత్సరములనుంచి అందమైన స్త్రీలు ప్రత్యేకముగా పియర్సునే వాడు చున్నారు. దీని పరిమళము, మృదువైన నురుగు దీనికి సబ్బులలో ప్రాముఖ్యత నిచ్చినవి.




# పియర్సు సబ్బు

శాశ్వతముగా సౌందర్యమును కాపాడుటకు

TG, 38-172 TL

A. & F. PEARS, ISLEWORTH, ENGLAND

రన్నమాట. ఈ విధంగానే తక్కిన విభక్తులలో కూడాను. బసవోదాహరణలో "ఇట్లతులిత పుణ్యుడైన బసవయ్యకునై ప్రణమిల్లు చిత్తమా" అని వుంది. చతుర్థీ ప్రత్యయాలు "కై" "కొఱకు" అని వుండగా బసవయ్యకు "నై" అన్నప్రయోగం గమనించతగ్గదే. అయితే పూర్వం చతుర్థీ ప్రత్యయం "ఐ" అనేదానికే కొఱకు అన్న అర్థం అనిన్నీ, షష్ఠ్యర్థమందున్న "కిన్" అనే ప్రత్యయానికి యీ "ఐ" చేరిస్తే కిన్ + ఐ=కినై ఆయిందని త్రిపురాంతకోదాహరణ పీఠికలో శ్రీ నిడదవోలువారు సమర్థించేరు. అసలు "కొఱ" అనేది స్వతంత్ర పదమనిన్నీ, దానికి షష్ఠ్యంతమైన "కు" చేరిస్తే "కొఱకు" అయిందనిన్నీ కొన్నాళ్లకు యీ పదమంతా ప్రత్యయంకింద పరిణమించినదనిన్నీ వీరు యీ సందర్భంలో చెప్పేరు.

సంస్కృతాలంకారికులు, "యేనకేనాపి తాళేన గద్యం పద్య సమన్వితమ్ | జయేత్యుపక్రమం, మాలిన్యాది ప్రాసవిచిత్రితమ్ | తదుదాహరణం నామ విభక్త్యష్టాంగ సంయుతమ్," అని ఉదాహరణను నిర్వచించేరు. అయితే యీ లక్షణానికి లక్ష్యంగా యింతవరకు ఒక ఉదాహరణకూడా సంస్కృతంలో లభించలేదని పరిశోధకులు తెల్పుతున్నారు. పాల్కురికి సోమనాథుడు ప్రచారంకోసం సంస్కృతంలో వ్రాసిన ఉదాహరణ తెనుగులో రాసినదానికి తు. చ. తప్పని అనుకరణమే. కాళిదాసు రఘువంశములోను, విక్రమోర్వశీయంలోను ఉదాహరణలను పేర్కొనడంచేత, నే డలభ్యమయినప్పటికీ, సంస్కృతకవులుకూడా యీ విధమైన కావ్యాల్ని వ్రాసేవారని మనం ఊహించవచ్చు. శ్రీ నిడదవోలు వేంకటరావుగారు, వారు సంస్కరించిన త్రిపురాంతకోదాహరణ పీఠికలో, ఆంధ్రోదాహరణలు సంస్కృతోదాహరణల కంటె విలక్షణమైనవని వ్రాసేరు. కాని లక్ష్య వివరణాన్ని బట్టిచూస్తే రెండింటికి అంతభేదం లేదేమో అని తోస్తుంది. ఎనిమిది విభక్తులతో వున్న ఎనిమిదిపద్యాలు ప్రాసతోసహా రెండు భాషలలోను కనపడుతున్నాయి. సంస్కృతంలో రగడలనే గద్యగా వ్రాసేవారనిన్నీ అనుప్రాస దగ్గరకి పాదాన్ని విరిచి వ్రాస్తే అది మన రగడగా మారిపోతుందనీ నిదర్శన పూర్వకంగా శ్రీ వేంకటరావుగారే వ్రాసేరు. సార్వవిభక్తియుతమైన పద్యం (శ్లోకం) సంస్కృతంలో ఉండేదా లేదా అని మాత్రం సందేహం. ఇంతకూ సంస్కృతంలో అసలు దీని గురించి లక్ష్యగ్రంథాలే దొరకలేదు గనుక యింతకంటె విపులంగా సంస్కృతోదాహరణలను గురించి చర్చ చెయ్యడానికే అవకాశం లేదు.

పై విషయాన్ని మనవి చెయ్యడానికి కారణం మనకు నేడు తెలుగులో లభించిన ఉదాహరణలు. దేశి కవితకు అలంకారభూతాలయినా, వాటికి కూడా కొంత సంస్కృతవాసనవుందని వుటంకించడానికి మాత్రమే. ఎప్పుడైతే మార్గకవితకు ఆశ్రయమైన వృత్తాల్ని యీ రచనలలో ప్రయోగించేరో అప్పుడే సంస్కృత సంపర్కం కలిగింది. ఉదాహరణలకు ఆదిపురుషుడైన సోమనాథుడే వృత్తాలలోను, రగడలోనుకూడా విరివిగా సంస్కృతపదజాలాన్ని వాడేడు. బసవోదాహరణలో యీకవి, "దండితేంద్రియ ప్రచండ తరళవిషమ గుణసమాజసంగమప్రసాద భోగసార సౌఖ్యశరధిమగ్న లింగసంగతానుభావలీల శరధినావిలగ్న అతుల సకల భువన పావనావతార పుణ్యమూర్తి" అని వ్రాసేడు. ఛందస్సు దేశీయమైనప్పటికీ, భాష కేవలం సంస్కృతమే. అసలు సంస్కృతంలోకూడా ఉంటేనేగాని యీ ఉదాహరణలకు యథార్థమైన స్థానం కలుగదేమోనని కాబోలు సోమనాథుడు సంస్కృతంలో కూడా ఉదాహరణ వ్రాసేడు.

మాననీయులు పూజ్యపాదులు అయిన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు బసవోదాహరణాన్ని పరిశోధించి ప్రచురించేరు. చతుర్థీ విభక్తి కళికలో మాత్రం ఆఖరు రెండు పాదాలులేవు. అవి శ్రీ శాస్త్రిగారికి లభించలేదు గాబోలు. సంబోధనలో వ్రాసిన చంపకంలోకూడా ఆఖరుపాదం లుప్తమయింది. ఈ పద్యంలో,

"ఎసగలలాటవహ్ని గుసుమేషు దహించిన
కాల రుద్రమున్, గసిమసిజేసి దక్షుని మఖంబు హరించిన

వీరభద్ర యి, వ్వసుమతిబుట్టి భక్త జనవశ్యుడవై నకృపా సముద్ర యో"అన్నంతవరకేవుంది. బసవోదాహరణలో ఆఖరు పద్యం-

ఉ॥ (ప్రథమ)—నీవు దయాపయోనిధివి
(ద్వితీయ) నిన్ను నుతించిన గల్గు భక్తి నీ
(తృతీయ) చేవర వీరశైవ రతిచేకుఱు
(చతుర్థి) నీకయి యిత్తు గబ్బముల్.
(పంచమి) నీ వలనన్ గృతార్థతజ.
(షష్ఠి) నించును, నీకు నమస్కరింతునా
(సప్తమి) భావమునందు నుండిననుం.

బాయకు మీ బసవయ్య వేడదన్" అని వుంది. శ్రీ ప్రభాకర శాస్త్రిగారు శలవిచ్చినట్టు యీ పద్యంలో షష్టి విభక్తి వరకు నీవల్ల, నీచే, నీకు, అని ప్రయోగించి కవి, సప్తమిలో మాత్రం "నాభావము నందునుండి" అని వ్రాయడం శోచనీయమే. త్రిపురాంతకోదాహరణలోను, వేంకటేశ్వరోదాహరణలోను కూడా ఎనిమిది విభక్తులలోకూడా ఎవరిని ఉద్దేశించి ఉదాహరణవ్రాస్తే వారికి అనుగుణమైన ప్రత్యయాల్నే ఆయాకవులు చేర్చేరు. బసవోదాహరణలో యీ విషయంలో స్వల్పమైన వైలక్షణ్యం కనపడినా భావం లేశమైనా చెడలేదు. మొత్తంమీద సింహావలోకనంచేసి చూచినట్లయితే యీఉదాహరణ సాంద్రమైన భక్తిభావ సంపదతో, గురు గంభీరమైన పద్యసంచయంతో శోభిస్తున్నది. దీనిని పరిశోధించి మొట్టమొదట ఆంధ్రలోకానికి అందజేసిన శ్రీపండిత వేటూరి ప్రభాకరశాస్త్రి వర్యులు మనకు వందనీయులు.

తరువాత వెలిసింది త్రిపురాంతకోదాహరణం. కాలక్రమేణ యిది రెండోదైనా, రచనా కౌశలంలో మాత్రం యిది అగ్రస్థానం వహిస్తుందని విమర్శకులంతా ఏకగ్రీవంగా ఒప్పుకున్నారు. దీనిమూలప్రతి తంజావూరుసరస్వతీగ్రంథభాండాగా రం లో వుంది. కవినామం గ్రంథంలో లేకపోవడం చేత, దీనిని రచించినవాడు "గుండయ" కవి అయివుంటాడని గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారు, "సీమనరాజు"గాని "పరమానందతీర్థులు"గాని అయి వుంటారని తంజావూర సరస్వతీ గ్రంథభాండాగార ఆంధ్రవివరణ కర్తలు భ్రమపడ్డారు. కాని యీ ఉదాహరణ గూర్చి కూలంకషమైన కృషిచేసి, ప్రశంసనీయమైన విపులపీఠికను వ్రాసి యీ గ్రంథరాజాన్ని పరిశోధించిన మామిత్రులు శ్రీ నిడదవోలు వేంకటరావు పంతులుగారు, యీ గ్రంథం రావిపాటి త్రిపురాంతకుడు వ్రాసేడనీ, అతని వాడుక పేరు తిప్పన్న అనీ నిర్ధారణ చేసేరు. సీమనరాజు ఎనిమిదో శతాబ్దికి పూర్వం వుండే శైవభక్తుడనిన్నీ, అతనికి చేరమరాజనే నామాంతరంకూడా వుందని వీరు వివరించేరు. గుండయకూడా కవిచేత ప్రశంసింపబడిన శివభక్తులలో ఒకడనీ, ఆనందతీర్థమనేది గ్రంథస్థవిషయమనీ కూడా శ్రీ వేంకటరావుగారు వివరించేరు. పదహారో శతాబ్దిలోవున్న పెదపాటి జగన్నాథకవి త్రిపురాంతకోదాహరణ కర్త త్రిపురాంతకుడని ముచ్చటించేడు. తరువాత, అప్పకవి, వేంకటపతి మొదలైన లాక్షణికులు కూడా రావిపాటి త్రిపురాంతకుని కర్తృత్వాన్నే అంగీకరించేరు. ఈ కవి పదునాలుగోశతాబ్దిలో జీవించేడు. మహాకవి అయిన శ్రీనాథుని పొగడ్తకు పాత్రుడైనాడు. ఈ ఉదాహరణే కాకుండా రావిపాటి తిప్పన్న అంబికాశతకము, చంద్రతారావళి, సంస్కృతంలో ప్రేమాభిరామం మొదలైన గ్రంథాల్ని రచించేడు.

శ్రీనాథుడు, "నన్నయభట్టు తిక్కకవి నాయకుడన్న హుళక్కి భాస్కరుం డన్నను, జిమ్మపూడి యమరాధిపుడన్నను సత్కవీశ్వరుల్ । నెన్నుదుటంగ రాంజలులు నింతురు "జే" యని రావిపాటి తిప్పన్నయు నంతవాడ" అని మెచ్చుకున్నాడు. కాబట్టి యీ కవి కావ్యకళా వైదుష్యాన్ని గురించి వేరే వివరించ నక్కరలేదు. ఉదాహరణ కావ్యాల్లో త్రిపురాంతకోదాహరణ మేలుబంతి అని ప్రాజ్ఞులందరూ మెచ్చుకున్నారు. ఈ గ్రంథంలో శివలీలలన్నీ మనోహరంగా వర్ణితమయినాయి. కేవల వీరశైవ సంప్రదాయ ప్రబోధంకంటె, శ్రీ వేంకటరావుగారు చెప్పినట్లు, శివాద్వైతానికే యీ కవి ప్రాధాన్యాన్ని యిచ్చేడు.

సాంఖ్య తొండడు, బల్లహుడు, కన్నప్ప, సేనమరాజు మొదలైన భక్తుల గాథలను కవి యీ ఉదాహరణలో మనోహరంగా చిత్రించేడు.

ఉ॥ (వ్రాలినటించు ము క్తివర ।
వర్ణిని పర్యోదకొంగు చాద్పునం
గ్రాలు నిజాంకపుంబడగ ।
గన్నులజాచిన జాలు, నిమ్నగా
స్ఖాలిత మాళిచేత, బుర ।
భంజనుచేత, గుమారపర్వతం
బేలెడు రాజుచేత, ఫలి ।
యించు జనావళి కోరు కోరుకుల్

ము క్తి కాంతపైట చెరగులాగా వుండే దేవాలయ పతాకాన్ని దర్శించినంతమాత్రం చేతనే "కుమారపర్వతం బేలెడురాజు" సర్వుల కోర్కెలను ఫలింపజేస్తాడని కవి తన కావ్యకళా నైపుణ్యాన్ని కల్పనాచాతుర్యాన్నీ యిక్కడ చక్కగా వ్యక్తీకరించేడు.

ఇతను "కళిక"లో అనేకమైన శివలీలలనుగాని గాథలనుగాని వివరించి, ఉత్కళికలో సాధారణంగా ఏదో ఒకగాథను మాత్రమే వెలువరిస్తాడు. మచ్చుకు ఒకటి మనవిచేస్తాను. తృతీయావిభ క్తి కళికలో

"అంబరాది తత్వములకు నవలయైన ఈనిచేత,
బల్లహుని వధూటికాసపడిన దుండగీనిచేత,
నల్లయలకరేలురాజునను సంగడీనిచేత" అని అనేక విషయాలుచెప్పి, ఉత్కళికలో మాత్రం

"ఇలరథంబు లీలనొప్ప
నలువ, నిగమహరుల రొప్ప,
బొసగబాపనారిబట్టి,
పసిడికొండ నెక్కబెట్టి
దొడగి నేలగూల బురము
లేసియున్న జోదుచేత

అని ఒక్క త్రిపురాసుర సంహారాన్ని మాత్రమే వర్ణించేడు. ఈ విధంగానే గుండయ అనే భక్తుని చరిత్రను చతుర్థీ ఉత్కళికలోను, వీరభద్ర విజయాన్ని పంచమీ ఉత్కళికలోను తిప్పన్న ముచ్చటించేడు. ద్వాదశ జ్యోతిర్లింగాలలోను ఒకటై, చిరకాలంనుంచి మహాక్షేత్రమని ప్రసిద్ధిచెందిన శ్రీశైలానికి తూర్పువాకిలిగావున్న త్రిపురాంతకంలో జనించి, ఆదేవుని నుతించి, తరించిన మహాకవి యీ రావిపాటి తిప్పన్న.

తిరుపతి క్షేత్రంలో సంకీర్తనాచార్యులుగా అమితమైన కీర్తిని గడించుకున్న తాళ్ళపాక పెద తిరుమలాచార్యులవారు వేంకటేశ్వరోదాహరణను రచించేరు. వీరు అన్నమాచార్యుల కుమారులు. ఈ ఉదాహరణ 16 వ శతాబ్దిలో 1530 సంవత్సరప్రాంతంలో రచింపబడివుండాలని పండితులు ఊహిస్తున్నారు. వీరి వంశంలో సరస్వతి విలాసవిహారం చేసిందని చెప్పవచ్చును. పెద తిరుమలాచారిగారు కి తండ్రిగారైన అన్నమాచార్యులవారు, పెద తిరుమలాచారిగారి కుమారులు చిన తిరుమలాచార్యులవారు సంగీత సాహిత్యాలలో అమితమైన కృషిచేసి శారదను ఆరాధించేరు. వేంకటేశ్వరోదాహరణ కర్తలైన పెద తిరుమలాచార్యులుగారు, వివిధతాళాలలోను, వివిధ రాగాలలోను వైరాగ్య వచనమాలికా గీతాలు కూడా వ్రాయడంచేత కవిగారికి సంగీత సాహిత్యాల్లో గల ప్రతిభ చక్కగా వ్యక్తమవుతోంది. ఈ కవిగారి కుమారులు సంస్కృత, ప్రాకృత, శూరసేన, మాగధ, పైశాచ, ప్రాచీ, అవంతి, నాగరభాషల్లో అష్టభాషాదండకాన్ని వ్రాసి విద్వాంసుల మన్ననలకు పాత్రులయినారు.

వేంకటేశ్వరోదాహరణలో సార్వవిభక్తిక పద్యం పూర్తి అయిన తరువాత, యీకవి "ఆరవితారకంబుగ నుదాహరణంబు రచించె భక్తివి । స్తారతదాళ్ళపాకపురశాసను డన్నయ తిమ్మనార్యుడిం । పారగ జక్రనందక గదాంబుజధారికి శ్రీవధూమనో । హారికి వేంకటాచల విహారి శౌరికి నంకితంబుగాన్" అని షష్ఠ్యంతాలతో కూడిన అంకితాంక పద్యం రచించేడు. బసవోదాహరణలోను, త్రిపురాంతకోదాహరణలోను, శివప్రశస్తి గ్రంథమంతటా భాసించినా, యీ విధమైన అంకితాంక పద్యం వారి రచనలలో కనపడదు. వృత్తాలలో వేంకటేశ్వర ప్రభావాన్ని, రగడలలో రామ

కృష్ణాద్యవతారాలకు సంబంధించిన లీలా విశేషాల్ని యీ కవియెంతో మనోహరంగా చిత్రించేడు. పంచమీ విభక్తికి సంబంధించిన ఉత్కళికలో,

"తెలుగుతెలుగనిబండి విటిగియొలుగగ జెండి
(శకటాసుర సంహారం)
యుద్దిమద్దుల వ్రాల్చి (మద్దిమానురూపంతోనున్న రాక్షసునివధ)
గ్రుద్దియెద్దులగూల్చి (వృషభాసురవధ)
ఘాతబూతన దీర్చి
చేతనేతులుగూర్చి
యున్నవెన్నవివలన
మున్నతోన్నతువలన."

అని కృష్ణుని బాలక్రిడల్ని పాడుకోడానికి యోగ్యంగా యెంతో సొంపుగా వివరించేరు యీ పెదతిరుమలాచార్యులవారు.

ఈ విధంగానే మరికొందరు కవులు వ్రాసిన కృష్ణోదాహరణ హనుమదుదాహరణ మొదలైనవికూడా వున్నాయి. కాని ప్రసిద్ధమైనవి, ప్రాచీనమైనవి బసవోదాహరణ, త్రిపురాంతకోదాహరణ, వేంకటేశ్వరోదాహరణ మాత్రమే.

విభక్త్యంతాల విశిష్టత ఉదాహరణ గ్రంథాల్లోనే కాకుండా, మరొక విధంగా కూడా మనకు వ్యక్తమవుతున్నది. సంబోధనతో ఆశ్వాసాన్ని ప్రారంభించడం, గ్రంథ ప్రారంభానికి ముందు కృతిపతిప్రశంసలతో కూడిన షష్ఠ్యంతా లుండడం ప్రబంధపాఠకులందరికి తెలిసిన విషయమే. నిర్వచనోత్తర రామాయణం మొదలైన కొన్ని గ్రంథాలలో ఆశ్వాసం యేవిభక్తితో అంతమవుతుందో కొత్త ఆశ్వాసంకూడా అదేవిభక్తితో ప్రారంభమవుతుంది. యక్షగానాలలోను ద్విపద కావ్యాలలోను ద్వితీయా విభక్తితోనే ఆశ్వాసాంతం అవుతున్నది. ఈ మధ్యనే మా మిత్రులు ఉభయభాషా ప్రవీణ, సాహిత్యవిద్యాప్రవీణ, కవితావిశారద పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు ఆంధ్రీకరించినధ్వన్యాలోకాన్ని శారదకు కృతిస్తూ, షష్ఠ్యంతాలకు బదులుగా ఎనిమిదివిభక్తులతోను ఎనిమిది పద్యాలు వ్రాసి శారదను నుతించేరు.

విభక్తులకు సంబంధించిన యీ చిన్న వాఙ్మయశాఖను ఉద్ధరించిన వారు శ్రీ రామకృష్ణ కవిగారు, ప్రభాకరశాస్త్రిగారు, వేంకటరావుగారు మొదలైనవారు. కొందరు ఆలంకారికులు అభిప్రాయపడినట్టు ఉదాహరణలు క్షుద్రకావ్యములలో చేర్పదగ్గవి కావనిన్నీ, భాషా వికాసానికి సంగీత సాహిత్యసమ్మేళనకు, దేశమార్గ కవితా సమన్వయానికి కావలసిన అనేక విషయాలు యీ ఉదాహరణలలో యిమిడివున్నాయని మామిత్రులు శ్రీ వేంకటరావుగారు త్రిపురాంతకోదాహరణ పీఠికలో వివరించేరు. ఈ శాఖను అన్వేషించే జిజ్ఞాసువులకు ఆ పీఠికే ప్రథమ సోపానం. వీరు ప్రధానమైన ఉదాహరణలన్నీ ఒక సంపుటంలో చేర్చి సమగ్రమైన పాఠభేదాలతోను విపులమైనవ్యాఖ్యతోను వాటిని ప్రచురించి యీ శాఖను పెంపొందించవలసినదని నా విన్నపము.

కథానిక:

# వీణ

## = శ్రీ తెన్నేటి సూరి =

౧

"రాగసుధారసా"...

......స్వరరాగసుధా.

ఆ మధురరాగం...ఆవీణ మెట్లమీద...పైస్థాయిల నుంచి క్రిందిస్థాయిలకు, బరువులెత్తుతున్న మాధుర్యాలతో,...ఆగి ఆగి...నెమ్మది నెమ్మదిగా... దిగుతోంది—లేడి చూలాలు కొండవాగుజాలు వెంట దిగే అలససౌందర్యంతో—

రాచవుసిరి చివుళ్లలాంటి ఆ మునివ్రేళ్లు ఆ వీణమెట్లను చకచకా చక్కిలిగింతలుబెట్టి కిలకిలలాడించివేస్తున్నయ్—

ఆముంజేతుల బంగారుగాజుల మంజుశింజితాలు పసిబిడ్డకులుకు నవ్వుల పలరింపులకు పులకరించుకొన్న బిడ్డతల్లిముద్దుల లలితనినాదాలలాగు ఎడతెగని వరుసగా తాళగతులలోవినిపిస్తున్నై-స్వర్గసుఖానికిసోపానాలై.

ఒడిలో ఆవీణ యిటూ అటూ - కొంచెం కొంచెం...ఊగిసలాడుతూ, పసిబిడ్డలా ముద్దులు గుడుస్తోంది.

కళ్యాణి, పంచపాళీలో కూర్చుని, 'రాగంధారసా" అనే మధురగీతిని వాయించుతోంది.

ఆ మధురస్వనాలు గాలితీగెలతో కలిసి ఆ పంచపాళీ ముందు వున్న పూల మొక్కలలోకి వ్యాపిస్తున్నై. ఆ పూల మొక్కలు—గుత్తులు గుత్తులుగా విచ్చులుకొన్న పూలు కొప్పుకొనలలో చెరువుకుని, బారులు ( నిశ్శబ్దంగా కూర్చుని వింటున్నయ్. చిరుగాలికో, లేక ఈ గానం విని ఆనందించో, కొంచెం కొంచెంగా తలలు వంకిస్తున్నాయి కాని—చప్పట్లుగొట్టి, ఈలలు వేసి, "భేష్! భేష్!" అంటూ కొంపలంటుకున్నట్టుగా బొబ్బలు పెడుతూ, గందరగోళంగా అభినందించటం లేదు.

గంధర్వస్త్రీలు ఈ మధురగానం వినాలని ప్రియుల తీపి కౌగిలింతలలో నుంచి, అప్పటికప్పుడు, కికురించి తప్పించుకు వచ్చి కూర్చున్నట్టుగా వున్నయ్, ఆ పూల మొక్కలు—లేకపోతే ఇతర సమయాల్లో అంతంతకై సేతలు దేనికి ?

గగనపథంవెంట పోతున్న చంద్రుడు ఈ గానం చెవులబడి, కాలుకదపలేక నిలబడిపోయినట్టున్నాడు. వెండివెన్నెలలు ఒలికొలికి పోతున్నయ్,ఆతోటంతా—

సర్వసంగపరిత్యాగిగా ఆయన్ను ప్రజలు ఎంత మెచ్చుకుంటున్నా, గౌతమదేవుడు, ఈ గానకళావిరతిలో మునిగి తన్మయుడు కాకుండా వుండలేకపోయాడు. అది వారి శక్తికికూడా మించినపనిగా పరిణమించింది. ఆ పూలమొక్కల మధ్య, ఒక తెల్లరాతి పలక పరిచివున్న వేదికమీద కూర్చుని, శరీరమంతా చెవులు చేసుకుని వింటున్నారు. అరమోడ్చిన ఆకను రెప్పలపైనా, ప్రపంచశాంతి ప్రదాలైన ఆ పెదవుల మీదా, ఈ గానంవల్ల కలిగిన మహదానందం, జిలిబిలిగా, జిలిబిలిగా, చిందులాడుతోంది. ఈ గానం వింటూ, అలా పదేపదే, అచలంగా వుండిపోవటంవల్ల

కౌబోలు, ఆయనదేహం ఒక పాలరాతి ప్రతిమగా మారిపోయింది.

వెండివెన్నెలల్లు ఒలికిపోతున్నయ్—

గౌతమదేవులు కూర్చునివున్న ఆ స్ఫటికపుపలక ఒక చిన్ని జలాశయంలా కనుపించుతోంది...ఆమధుర గానానికి, ఆ స్ఫటికం, ఒడలు జలదరించుకుని, నిలువునా నీరై పూరుకుంది.

### "రాగసుధారసా"

కళ్యాణి హృదయం ఉద్రిక్తమౌతోంది. ఆమె సృష్టించుకుంటున్న ఆ మధురనినదాలు ఆమెనే వివశ పరుస్తున్నయ్ — ప్రసవితమైన పచ్చిబాలింత తన కడుపుపంటను పొత్తిళ్లలో చూచుకుని, గర్వంతో, పరవశత్వాన్ని పొందినట్లు—కళ్యాణి ఉద్రిక్తౌతోంది. ఆ ఉద్వేగంలో, ఆమెహృదయం ఆవీణ మెట్లమీద అనంతంగా మాధురీ సౌందర్యాలను ఒలికొలికి పోతోంది, మునివ్రేళ్ల గమనాలతో స్వర్గసోపానాలుగా మారుతున్నయ్, ఆవీణమెట్లు—

ఆందోళిరాగం, ఆవీణ మెట్లమీద ఒకలతకూనగా ప్రభవించింది...మోసులెత్తి చివురులు దొడిగి, క్షణక్షణం చకచకా, విస్తృతమై, విచ్చులకొని,...ఆలంబనాలతో అవసరం లేకుండానే...తీగెలు తీగెలుగా...అనలనలుగా ... జాగిజాగి ... సాగిసాగి ... తూగితూగి, పరుగులు పెడుతూ...ఆపంచపాళీనీ, ఆ పూలతోటను, ఆ పరిసరాలను, ఈ రోదసినంతా వ్యాపించి పోతోంది — అత్యద్భుత దివ్యసౌందర్యాలను గుబుల్కొని గుత్తులు గుత్తులుగా పుష్పించి పోతూ—ఆ కుసుమగుళుచ్ఛాల సౌరభ్య సౌందర్యాలతో, రోదసి గుబాళించి విస్తుపోతోంది.

ఇలాంటి కుసుమవిసరాలు దేవలోకంలో కూడావున్నా యన్నట్టు మన మెప్పుడూ విన్న మాటగాదు. 'వాడని, పరువం చెడని; రూపసౌరభాలుగల పారిజాతంలాంటి పువ్వులేవో కొన్ని వున్నాయంటూ వచ్చారు గాని, ఇలా వీటికి మల్లే... కర్ణపేశలాలైన మధుర రుతాలనుకూడా కలిగివున్న పువ్వులసంగతి మన మెప్పుడు విన్నాం?—

ఆపంచపాళీలో, కళ్యాణికి కొంచెం చేరువలోనే, ఆమె తండ్రి చంద్రశేఖరరావుగారు, పేము కుర్చీలో కన్నులు మూసుకుని కూర్చుని, యీ విపరీతమైన సౌందర్యలతను దర్శిస్తున్నారు...ఆదివ్య కుసుమాల సౌరభాన్ని చెవులతోనే ఆఘ్రాణించుతున్నారు. ఆకుసుమవిసరాలనుంచి స్రవించి ఆయన శ్రవోగోళాలలో ఒలికిన అమృతబిందువుల జాలులు ఆయన రక్తఝురులలో ముర్మ్రరించుతూ హృదయానికి వ్యాపించి బరువు లెత్తిపోతున్నయ్...ఆతీపి బరువులను ఇక తను మోయలే ననుకున్నాడు...

"తల్లీ!"...అని పలకరించాడు...నెమ్మదిగా.

"ఆఁ!..." స్వర్గంనుంచి లాజవాబు.

"కొంచెంసేపు...ఆపుతావూ?..."

బిక్క మొగం పెట్టి ... "ఇప్పుడు — ఆపలేను నాన్నా..." అన్నది, దీనంగా—

"సరే...వాయించుకో...ఆవెన్నెలలోకి పోయి దూరంగా కూర్చుని వింటాను—"

పంచపాళీ మెట్లు దిగుతున్నాడు...నిశ్శబ్దంగా.. ఆయనబట్ట తలమీద వెన్నెల తీగెలుపడి, జిగేల్ జిగేల్ మంటున్నయ్...ఆయన తొడుక్కున్న చలువ చేసిన పొందూరు ఖద్దరు లాల్చీ పాముకూసంలా మిల మిల లాడిపోయింది. ఆ వెన్నెల వెలుగులలో—పూల మొక్కల మధ్యగా నడుస్తూ, గౌతమ దేవులు అధిష్ఠించివున్న ఆ వేదికమీదికి చేరుకుని ముంజేతిమీద శిరస్సునానించి కొంచెంగా జాలిగిలబడి పడుకున్నాడు—

ఆ రాగలతను దర్శించకుండా వుండాలని, ఇంత దూరం శ్రమపడివచ్చింది, ఈ రసిక హృదయం—లాభం? తల్లికొంగు కొనపట్టుకుని వెనకాతలే పాదాలు తొక్కుతూ, పరుగులు తీసుకుంటూ వచ్చిన పసిబిడ్డలా...కిలకిల లాడుకుంటూ ... అనలుహస్తాలుగా సాచి...ఆయన్ను చేరుకుంది ఆ రాగలత...ఉక్కి

బిక్కిరిగా, ఆయన్ను, బిగ్గ, కౌగలించుకుని, పకపక లాడింది.

ఆ ఆలింగన సుఖావాప్తితో ఆయన నిమీలిత నేత్రుడై... మ్రాన్పడిన చిత్తరువులా—

## ౨

టాంగ్-టాంగ్-టాంగ్-టాంగ్-టాంగ్...

దూరాన వున్న, పాగబారిన చింత చెట్టుక్రింద నుంచి వినుపించుతున్నయ్ - దెబ్బమీదదెబ్బ- విసుగెత్తేలా; విరతిలేని విశ్వకార్మికుని సమ్మెటపెట్లు అనంతకాల గర్భంలోకి ప్రతిధ్వనించుతున్నయ్...

"జడ-జడ-జడ-జడ-జడ..."

ఎడతెగని లోహపుగొలుసులుగా...ధ్వనించుతోంది...కృష్ణరావు హృదయంలోకి-ఆ టైప్ మెషిన్- మానవునికి జడత్వాన్ని నిరంతం ఉద్బోధిస్తోంది - ఉక్కుశబ్దాలతో-ఆ టైప్ మెషిన్-

జానెడు ముందుకు జరగటం—మళ్లా జానెడు వెనక్కు లాగి వేయబడటం - స్వేచ్ఛావిహీనతచేత ఎదుగూబొదుగూ లేకుండాపోయిన మానవసంస్కృతి యొక్క దౌర్భాగ్యస్థితి ప్రతిపాదించుతోంది- ఆ టైప్ మెషిన్ క్యారియర్-

తనకు బానిసగా వుండాలని యీ పిశాచ యంత్రాన్ని సృష్టించాడు, మానవుడు. అది తిరగబడి మానవుణ్ణే బానిసను చేసి పారేసి, తన ముందు కూలేసుకుని ఎముకలు కొరుక్కుతింటోంది అహోరాత్రులూ—రక్కసిలా. దానిముందు కూర్చుని పనిచేస్తున్నాడు కృష్ణరావు. అతనికీ అతని మానవత్వానికీ మధ్య పర్వతాలల్లే అడ్డంనుంచున్నయ్-ఆ గదిగోడలు.

ఈ బ్యాంకి ఉద్యోగంలో అతను చేరి ఒక మాసంరోజులు మాత్రమే అయింది. కాని యీముప్పై రోజుల బానిసత్వం అతనికి ముప్పై యుగాల నరకమనిపించింది. జీవితంలో అతనికి అదివరకు అనుభవానికిరాని, భయంకరమైన సత్యాలు అనేకం రుద్రమూర్తులులా ప్రత్యక్షమై, అతణ్ణి కల్లోల పరుస్తున్నయ్. సహజంగా ధీశాలిగావటంచేత వాటిని జయించాలని, శాయశక్తులా తిప్పలుబడుతున్నాడు. ఆవ్యర్థప్రయత్నం అతనికి ముచ్చెమటలు పట్టిస్తోంది.

తన జీవితంలోకి సుఖ సౌందర్యాలను తెచ్చుకోవాలని అతని ఆశ. తన రక్తమాంసాలను మానవత్వాన్నీ హరించి ఒరులు సుఖసౌఖ్యాలను అనుభవించటానికే యీ నిర్మాణమంతా పన్నబడి వుందని అతనికి తెలియకపోవటమే అతని అజ్ఞానం—

అతను బీ.కామ్. ప్యాసైనాడు—షార్టుహ్యాండూ టైపురైటింగూ కూడా తరువాత పూర్తిజేశాడు. గుమాస్తా గిరీ ఖాళీలేకపోవటంచేత టైపిస్టు ఉద్యోగం ఇచ్చారు. మొదట్లో చిన్న ఉద్యోగమే అయినా తను పెద్ద పరీక్ష ప్యాసైవున్నాడు గనుక క్రమేణా పైకి పోవచ్చుననుకున్నాడు—ధర్మాన్ని మోచేత్తో వెనక్కునెట్టి అధర్మం ముందుకు తోసుకుపోతున్న ఈరోజుల్లో ఇది పిచ్చిఊహనాలి. అసలు తనకు ఈ పెద్ద డిగ్రీ ఉండటంచేతనే పెద్ద పెద్దప్రమాదాలు బండలుగా బండలుగా, కొండలమీదనుంచి దొర్లి అతని తలమీద పడుతున్నయ్. ఆ బ్యాంకులో ప్రతికన్నూ అతన్ని చూసి అనవసరంగా జేవురించుతోంది — ఈపాడు డిగ్రీమూలంగా ప్రతిపన్నూ పరుషవిషాలనే క్రక్కుతోంది.

"బీ—కామ్—" ఈ రెండు అక్షరాలూ స్ఫురించగానే ఆ బ్యాంకులో పనిచేస్తున్న వాళ్లందరికీ చిరాకెత్తుకొస్తుంది. —వాళ్లంతా పాతప్రైమరీ సర్టిఫికెట్లు పుచ్చుకుని లాక్రమించి కూర్చుంటే, ఇవ్వాళ తనొక బీకామ్‌ను అంటూ బయలుదేరితే ఎలా యేడుస్తుంది!.

అసలు యితనికి ఉద్యోగం యివ్వటానికే వల్లగాదని సెక్రటరీ డైరెక్టర్లమీటింగులో దెబ్బలాడాడు. "కృష్ణరావుకు పాపం డిగ్రీ అయితేమాత్రం పెద్దదే వుందికాని, దస్తూరీమాత్రం కుక్కలు — నక్కలు దేకినట్టుంటుంది, అన్నాడు. టైపిస్టు ఉద్యోగానికి

దస్తూరితో నిమిత్తమేమిటని, యీ సలహా త్రోసివేసి, కృష్ణారావుకు ఉద్యోగం యిచ్చారు, డైరెక్టర్లు.

సెక్రటరీకి తలవంపులైంది. ఈఘటన తమ పై అధికారిని అలా డైరెక్టర్లు నిర్లక్ష్యం చెయ్యటం అతని అనుచరవర్గానికీ అలానే అనిపించింది. కృష్ణరావును బ్యాంకిలోనుంచి తరిమివేయ లేకపోతే తన తెలివెందుకు తగులెట్టనా? అనుకున్నాడు. యెక్కౌంటెంటు డవాలీ బంట్రోతు దగ్గరనుంచి దస్తు పరాఫ్ దేశీలూ యుద్ధసన్నద్ధులయ్యారు. కృష్ణరావును బ్యాంకిలోనుంచి తరిమితీరాలి. దీనికి కావలసినయౌగంధరాయణమంతా నడుస్తోంది. రెండుమార్గాలు— కృష్ణరావు అసమర్థుడని నిరూపించి సాగనంపించటం మొదటిపంథా; కసుక్కు కసుక్కున, ములుకులుగా గుచ్చుకుని, పైకి రక్తాలు చిమ్మకపోయినా, హృదయాన్నంతా పచ్చిపుండుచేసివేసే, విషాక్తాలైన, సూటీపోటీ కుళ్లుమాటలు విసిరి, తనంతటతను, అతనే బయటికి వెళ్లిపోయే ప ల్పించటం రెండవపద్ధతి.

* *

'ట్రయ్ య్ య్ య్ య్!... ట్రయ్ య్ య్ య్ య్!...' మంటూ కంచుగొంతు బ్రద్దలు గొట్టుకుంటోంది, ఆ టేబుల్ బెల్;..."లేచిరావేం?"... అని మళ్లా మళ్లా గొంతు చించుకుని బొబ్బలు పెడుతోంది—అధికార కంఠంతో—కృష్ణరావు కదలబోయాడు—"ప్రాణంలేని ఆ కంచుముక్కకు నీవు బానిసై కంగారుపడి కాళ్లు తొక్కుకుంటా నేమిటి? ...వెళ్లకు! కూర్చో!" అన్నది అతనిహృదయం.

కూర్చున్నాడు—

"నీకేమన్నా పిచ్చెత్తిందా? వెళ్లకపోతే నీ ఉద్యోగం వూడుతుంది. నీ పై అధికారి పిలుస్తున్నాడు—పో! వెళ్లు" అన్నది మనస్సు—

హృదయం — ఎక్కౌంటెంటు పిలిస్తేమాత్రం నువ్వెందుకు వెళ్లాలి? అతనికి నీ వెందుకు బానిసవై పడివుండాలి? అతను నీకంటే యేమన్నా పెద్దచదువు చదువుకున్నాడనా?...నీ కంటే పెద్ద తెలివి తేటలున్నాయనా?

మనస్సు—లాభంలేదు—చెడతావు—నీహృదయాని కిక్కడ తావులేదు.

"ట్రయ్య్య్య్య్" మంటూ మళ్లా గొంతు చించుకుంటోంది—

ఎక్కౌంటెంటు గదిలోకి కృష్ణరావు పాదాలు నెమ్మదిగా నడిచినై...

ఎక్కౌంటు—ఏమయ్యా!- యేం-చెముడా?

కృష్ణరావు—మెషిన్‌లో కాయితం తీసి అవతల బెట్టి వస్తున్నాను సర్!

ఎక్కౌం—హూఁ—(ఒక ఎలుగొడ్డుమూలుగు- ఒక కాయితం ముక్క తీసి బల్లమీద విసిరికొట్టి) దీనికి కాపీ యేదీ తగులెట్టి!

కృష్ణా—కాపీ కావాలని అనుకోలేదండీ...

ఎక్కౌం—బి.కామ్.ప్యాసయ్యాననే పెకుక్క దప్ప, పనిపాట లేమన్నా తెలిసేడిస్తేనా!

కృష్ణా—కొత్తవాణ్ణవటంచేత తెలియలేదు. క్షమించండి. కాపీ కావాలని యెవ్వరూ నాకు చెప్పారుకారు.

ఎక్కౌం—స్టుపిడి టీ...

"చిత్తం"—అనలేదు కృష్ణరావు...అతని హృదయం మెదడులోకి వెచ్చని రక్తాన్ని చిమ్ముతోంది క్రిందినుంచి.

ప్రక్కనున్న వరండాలో సిగరెట్టు దమ్ముగొడుతున్న సెక్రటరీ కులుక్కుంటూ లోపలికి వచ్చి—"మనవాణ్ణి యివ్వాళ మందలించకండి. మాంచి హుషారుగా వున్నాడు ఇవ్వాళ" అన్నాడు-కృష్ణరావు భుజంమీద చెయ్యివేసి తట్టుతూ.

ఎక్కౌం—ఏమండీ కథా?—

సెక్రటరీ—మీకు తెలియదా యేమిటి? మన వాడి భార్య ఇవ్వాళ సాయంత్రం ఆరు గంటలకు రేడియోలో పాడుతుంది—

ఎకౌంటెంటు—ఎమిటీ ?... ఆవిడ రేడియోలో పాడేటంత బాగాపాడుతుందా యేమిటి? — నాకు తెలియదండీ.

సెక్రటరీ—ఆవిడ పెద్ద పెద్ద కచేరీలుకూడా చేస్తుందండీ. చాలా బ్రహ్మాండంగా పాడుతుందీ... అసలు మీకు తెలియకపోవటమేమిటండీ...'వసంత కోకిల శ్రీమతి కళ్యాణి—అంటారు అవిణ్ణు—చాలా పెద్ద గాయకురాలు లెండి; సునాయాసంగా నెలకు అయిదారు వందలు సంపాదించి అవతల పారవేయ గలదు.

ఎకౌంటెంటు—అరె! కళ్యాణి నీ భార్యాటయ్యా! చెప్పావు కాదేం. ఇంకేం...అదృష్టవంతుడివి.

కృష్ణ—నా యీ బ్యాంకి జానిసత్వంలో ఆవిడ ప్రసక్తి తేవటం అనవసరం. మీ రాధోరణి మానాలని కోరుతున్నాను.

ఎకౌంటెంటు—[తలతిక్కగా] బ్యాంకి వ్యవహార మేనయ్యా! నేను మాట్లాడుతున్నదీనూ...ఇట్టా చేతా వాతాగాని పనులుచేసి మాప్రాణాలు కొరక్కపోతే... శ్రుతితంబురాపుచ్చుకుని ఆవిడ వెనక కొంగట్టుకు తిరుగుతే యీ మాత్రం కాలక్షేపం నీకు జరక్క పోయిందా ? అని.

"పటప్ !".

ఎకౌంటెంటు గూబ కదిలిపోయింది ఆ గూబ కాయతో—

## 3

"నా చిట్టితల్లికి ముఖ్‌మల్ గౌను కుట్టించు కురా నాన్నా ! ఆ సిల్కుది బాగుల్లేదు, గరుగ్గావుంది" అన్నది, కళ్యాణి.

"చిట్టితల్లి పుట్టనీ — కుట్టించుకురానూ ... అయినా నీ కూతుర్ని మార్వారీ పద్ధతిని గౌనువేసి పెంచుతావా యేమిటి ?"

పగలబడి నవ్వుతూ—"సరేసరే, నే నిప్పుడు నీకు మనమరాల్నెక్కడ కనేది.?...(నవ్వుతూ) బలే బలే ! ఈ మాట బాగానేవుంది...నేనొక చిట్టిపాపా యిని కనటం...అదేమో...'క్యాఁ క్యాఁ క్యాఁ' అంటూరాగాలెట్టడం...నువ్వుదాన్ని బుజానవేసుకుని 'ఇచ్చిచ్చిచ్' అంటూ సముదాయించటం...ఇదంతా బాగానేవుంది..." చకన కంఠంమార్చి, కొంచెం కోపాన్ని అభినయిస్తూ "ఏమిటినాన్నా, మరీనూ "ఇల్లాంటిమాటలు" — మూతి ముడుస్తుంది—వాలు జడ చివరబట్టుకుని చివాల్న భుజంమీదుగా ముందుకు ఎగరవేసి జారలాగుతూ—

"నువ్వన్నమాటేగాని?"

అయ్య బాబోయ్ ! నే నిప్పుడు పిల్లల్ని కంటానన్నానా?"

"చిట్టి పాపకు గౌనుకావాలన లేదూ?—"

"అయ్యో వెర్రిబాగుల తండ్రీ! చిట్టి తల్లంటే నీకు అర్థం కాలేదన్నమాట..."

చకచకాపోయి తివాసీమీద పెట్టివున్న వీణను ఆప్యాయంగా కావిలించుకుని ఒక చిన్నముద్దు పెడు తుంది దానికి.

"వీణసంగతా?...మనమరాల్నికంటావేమో... కొత్త బుగ్గగిల్లి యేడిపించుదామని గంపెడాశబడ్డాను, వట్టిదేనా ?"

"ఎప్పుడు కుట్టించుకువస్తావూ ?"

"ఇదుగో...వెడుతున్నాను"

"మరే! నాన్నోయ్! ఇక్కడ దంతపు నగిషీ కొత్త వూడిపోయింది నాన్నా"

"సరే బండి తీసుకువచ్చి బజారుకు తీసుకువెళ్లి బాగు చేయించుకు వస్తాను."

ఎందుకూ...పనివాణ్ణో ఇక్కడకువచ్చి బాగు చెయ్యమనరాదూ ?"

"అతను చాలా పెద్దపనివాడు. ఈకొత్తభాగ్యా నికి ఇంటికి రమ్మంటం యేమంత బాగుంటుంది ?

"పోనీ అక్కర్లేదు లెండి. అలానే సరిపెట్టు కుంటాను"

"అదేమిటే!"

'నా చిట్టితల్లి నాదగ్గరలేకపోతే నాకు తోచదు బాబూ"

"ఎంతసేపమ్మా. అరగంట భాగ్యం.

"అహహా! అరగంటకాదు గదా. అరనిమిష మైనా వల్లగాదు బాబూ. నాకు అదేమిటో చికాకుగా వుంటుంది. నా కసలక్కుర్లేదు.

"సరే పోనీలే అతన్నే తీసుకువస్తాను"

## ౪

రాణా ప్రతాప్ కోరమీసం చిమ్మెటకొరికింది. మొఖాన గంటుపెట్టుకుని చికాకుగా కూర్చున్నా డాయన. ఇది కృష్ణరావు గమనించనే లేదు. ఆ పటం మీద ఈ ప్రక్కనుంచి ఆ ప్రక్కకు "కళ్యాణి తంబురా"-అన్న అక్షరాలు జ్వాలాతోరణం లా భగ భగా మండిపోతున్నట్టు కన్పించుతున్నయ్ అతనికి-రక్తారుణజ్వాలలుగా—

అతని పురుషకారాన్నే అవమానించటం ఆ వాక్యం. బ్యాంకిలోనుంచి పొమ్మనవచ్చు. కళ్యాణీ వెంట తంబురాపుచ్చుకు తిరగమని కూయటానికి వాడి కేమిటి అధికారం?...అతని గుండెల్లో గంధకధృతి ఒలికినట్లైంది.

ఆమాటల్లో యేమంత తప్పువుందనీ ?... తన భార్య సరస్వతిలా కూర్చుని, వీణ వాయించుతూ ప్రజా గౌరవాన్ని చూరగొంటుంటే...తను తంబురా శ్రుతి మీటుతూ వెనక కూర్చుని ఆమె గౌరవంలో భాగం పంచుకోటం...అది...అవమానకరమేనా?... అల్లాంటి మహద్భాగ్యం తమ జీవితాలకు లేకపోయిం దని ఎన్ని యువకహృదయాలు కించపడటంలేదు. వాళ్లంతా లేకిమనుష్యులనేనా ఇతని అభిప్రాయం?

అది అవమానశల్యంగాకపోతే, ఎకౌంటెంటు ఆ వాక్యాన్ని అలాశూలంలా తన హృదయంలో కస్సునదిగవేసి అంత బాధ ఎలా కలిగించాడు.?—

ఎకౌంటెంటు మాటలు అర్థంలేని పిచ్చిమాట లేమో ?

అర్థంలేకపోవటమేమిటి ? ... అర్థంలేకపోతే తన్నామాటలు ఎందుకంత కలవరపరుస్తాయి. తను మాత్రం ఎందుకంత తొందరపడవలసివస్తుంది ?—

పాపం...ఎకౌంటెంటుమీద, తను, కుర్ర తనంగా, చెయ్యిచేసుకుని, అనవసరంగా ఆయన్ను అవమానించాడేమో ?

చట్ ! తొందరపడటమేమిటి ?— కళ్యాణి వెనక తంబురామోస్తూ బ్రతకమని తన్ను వాడు ఎంత పలగాకితనంగా కూశాడు ?...కాలసర్పంలా ముని పంట కాటువేశాడు...కాటులో విషంలేదని హృద యానికి నచ్చ చెప్పుకుని శాంతంగా బ్రతకాలనిచూస్తే మాత్రం ప్రయోజనమేమిటి ?...ఒకచెంప ఆ విషానల జ్వాలలు ఆపాదమస్తకం ఎగబాకి మంటలు బుట్టించి, తన్ని భస్మీకరించి వేస్తుంటే ?—తన రక్తనాళాల్లో హాలాహలం భుగభుగలుగా పొంగులు రేసుతుంటే ?

మనస్సును కొంచెం శాంతిపరుచుకోటం యెం దుకైనా మంచిదేమో ?...

శాంతి ! శాంతి !—అర్థంలేని పిచ్చిమాటలు... వాణ్ణి యింతింతింత ముక్కలుగా చిత్రవధచేసి వేస్తే మటుకు తన హృదయానికి శాంతి గలుగుతుందా ?—

కుపితమానవహృదయం, ఆకాశాన్ని అంటిపెరి గిన ప్రమాదకరమైన అగ్నిపర్వతం—శిఖరాన శిఖిరేఖ జేవురించనేరాదు...జేవురించితే ?...

అవును జేవురించగూడదు ... అసలు అగ్ని కుండాలుగా యీ మాటలు ఇలా ఎందుకు తయారైనై? ఎక్కడిదీకీల.

'కళ్యాణి వెనకతంబురా'—తనకేం ఖర్మం... తను చిన్నప్పటినుంచీ ఎంత కష్టపడి చదువుకున్నా డూ ? ఎంత ప్రతిభ సంపాదించాడు. ఇదంతా వ్యర్థ మేనా ?...పోనీ వ్యర్థమైతేమాత్రం తనకేంలోటు... రెక్కలకష్టంచేసి బ్రతకవలసిన అవసరంకూడా తనకు

లేదే ?...కాస్తో కూస్తోతండ్రి తనకు ఆస్తి ఇచ్చి వెళ్లాడు. తన జరుగుబాటుకేంలోటు...ఏమిటా వెధవ కూసిన పిచ్చికూతలకు అర్థం ?

"కళ్యాణి" — కళ్యాణి మా పెత్తాడేమిటి ? 'కళ్యాణి'...యీ అక్షరాల్ని జ్వాలారేఖలుగా గుప్పున తన హృదయంలోకివూది ఒక్కసారి అలా ఎలా దహించివేశాడు. ఈ అక్షరాల్లోనుంచి ఇంత అగ్ని ఎలా పుట్టించాడు?...

కళ్యాణి తనభార్య...తన్ను ఎంతో ప్రేమించు తుంది. తన్ను ఎంతో గౌరవించుతుంది; కళ్యాణి హృదయం తనలీలావసథం...వెలుగులమేడ. అతను బాహ్య ప్రపంచాన్నంతా విస్మరించి...సుఖంగా కన్నుమూసే హంసతూలికల పట్టుపరుపులూ, సుఖ తల్పం, ఆవెలుగులమేడలో వెన్నెల తెరలచాటునేగా వున్నయ్—ఇది తనకు అవమానకరంగా ఎత్తి చూప దగిన విషయంకాదే?...అసలు...తనూ, కళ్యాణీ హృదయాలు పెనవేసుకుని మీన మిధునంలా యీదు లాడుతున్న ఆ మధురవాహిని లోతులు అర్థం చేసు కోగలగటానికి, వాడి కేంతాహతువుంది?...

మరి...'తంబురా' ఛీ ఛీ కళ్యా తన్ని తంబురా యెందుకు మొయ్యమంటుంది ?

ఒకవేళ మొయ్యమంటే ?

మొయ్యమంటే మొయ్యనంటాడూ!...యేమం దిందులో...ఏమిటా లేకి వెధవకుంటికూతలకు అర్థం మరి?...

మోస్తేగాని, వీల్లేదని పట్టుబడుతుం దేమో?...

ఎలా పట్టుపడుతుంది ?...కళ్యాణి తన భార్య తన్నలాశాసించటానికి కళ్యాణికి తనమీద యేమిటి అధికారం?...కళ్యాణి తన భార్య...తన కనుసన్నల్లో మెలుగుతూ తన అధికారంలో పడి వుండవలసినది... కళ్యాణి పెంకెతనం తనముందేంసాగుతుంది ?

అలా, వుండనంటుం దేమో ?—

ఉండనంటుందీ!...ఉండనంటే తను తిండి పెట్టక మాడ్చి వేస్తాడు గాని ఊరుకుంటాడా...తను ఎవరు?...భర్త.

ఓహో!...ఇది లాభంలేదు అలా తను చెయ్య కళ్యాణి అందరు స్త్రీలకు మల్లే కాదు... కి తిండిపెట్టకుండా మాడ్చి చంపటం...తన చేతిలో వున్న పనిగాదు...కూటికీ గుడ్డకూ కళ్యాణి తనమీద ఆధారపడిలేదు...ఈ విషయం త నెప్పుడూ ఇంత లోతుగా ఆలోచించలేదు...అవును తనకూ కళ్యాణికీ మధ్య ఇది ఒక భయంకరమైన అఖాతమే. ఇది తను ఇంతవరకూ అర్థంచేసుకో లేకపోయాడు... ఎక్కడెంటుంటు యీ విషయాన్ని తనకంటే ముందు ఇంత సున్నితంగా చొచ్చుకుపోయి ఎలా అర్థం చేసుకోగలిగాడో?...ఏమో ననుకున్నాడు గాని వాడి తెలివితేటలు తనకు తలకుమించినవిగానే వున్నయ్.

కూటికీ గుడ్డకూ కళ్యాణికి తన ఆసరా అక్క ర్లేదు. తన కాళ్లమీద తను నిల్చోగలదు. కావలిస్తే తనవంటి వాళ్లకు పదికి ఇంత తిండి పారవేయగలదు గూడా—అదేగా- 'సునాయాసంగా అయిదారు వందలు సంపాదించి అవతల పారవేయగలదు' అంటూ కళ్యాణి ప్రక్కన తన అసమర్థతను ఎత్తిచూపుతూ దెప్పిపొడిచాడు సెక్రటరీ—

అవును; కళ్యాణి తన చెప్పు చేతల్లో వుండ వలసిన అవసరం యేమిటి?...

ఏమిటీ!...తన భార్యకు తన మాట వినవలసిన అవసరమే లేదూ?...ఎంత తలవంపు...ఇది అతని పురుషహృదయం భరించలేదు...ఇది తను సహించడు ...ఈ విషమపరిస్థితిని ... వెంటనే ... నిర్మూలించు తాడు...కళ్యాణి తన్ని లెక్కచేయకుండా నిర్లక్ష్యం చేసే దుస్థితి అది భయానకం...జీమూతాలు జడలు విర బోసుకుని గంగళివాలాడేకాళరాత్రివంటి మృత్యువు కంటే అది భీభత్సం...ఉక్కు కోరల బ్రహ్మరాక్షసి, ఎరకోసం, నరకద్వారంలా నోరు తెరుచుకుని, చీకటి మబ్బుల పొదలమాటున నక్కి, పొంచి కని

పెట్టుకు కూర్చుంది...పొరపాటున ఆదారిని అటు వస్తే...తనజీవిత సర్వస్వాన్నీ...దడాల్న పట్టి మ్రింగి వేయాలని తను జీవితంలో ఎంతో అశ్రద్ధగా నిద్దర మత్తుతో నడుస్తున్నాడు...ఇది గమనించుకోకుండా!

అతనిక ఊరుకోడు...ముందుగానే తొందర పడతాడు...తన ఆత్మగౌరవాన్ని కాపాడుకోటానికి అవసరపడితే తన ప్రాణాన్ని పణంగాబెట్టి పోరాడ తాడు ఈ విషమసంఘ పరిస్థితులతో.

గొఱ్ఱెపోతుపోయి కొండను ఢీకొంటే!... కళ్యాణి ముందు తనెంత; కళ్యాణి ఒక పెద్ద బంగారు కొండ...ఆకాశాన్ని అంటి పెరిగిన మేరుపర్వతం; తనూ?—గొల్లవాడు ఉన్నికూడా కత్తిరించుకుపోయి ఆ పర్వత చరియల్లో పూరిమేయాలిసిన ఒక చిన్న గొఱ్ఱెపిల్ల!...తన ఆడదానిప్రక్క తను ఒకగొఱ్ఱెపిల్ల... గడ్డిపోచ—

కాక మరేమిటి?...ముప్పైరూపాయిల ముండ మోపి కూలికి ప్రపంచం తన్ని అడ్డమైన పిచ్చికూతలూ కూసింది. కళ్యాణిని అలా మాట్లాడటానికి ఎవడికి దమ్ములున్నయ్...అసలు కళ్యాణి అలా ఒకసారి వీణ పట్టుకుంటే చాలు,...ప్రపంచానికి పిచ్చెత్తిపోయి, బంగారు రాసులు పాదాల దగ్గిర గుమ్మరించి "దయ వుంచి స్వీకరించండి" అంటూ బ్రతిమిలాడుతుంది.

తను కళ్యాణిని అదుపుచేస్తానంటే అసలు దిక్కులన్నీ పరిహసించి నవ్వుతాయట్లేవుంది.

నవ్వుతే నవ్వనీ...తను అదుపుచేసి తీరతాడు ...కళ్యాణి తనభార్య...దాన్ని తన యిష్టంవచ్చి నట్టు శాసించుతాడు...ఇందులో ఒకడికి జోక్య మేమిటి?—కళ్యాణి తన ఆడది. ఎవడికోసం పడి వుంటుంది—

పడివుండనంటే?—

పడివుండనంటే...

తను మగబిడ్డ యేదుండగాన్ని చెయ్యలేడు.

౫

"గగనానికి ఇలకూ, బహు
దూరం బనినాడో..."

"హ్హూ"—అన్న దీననిశ్వాసం...

"హ్హూ"—అంటూ అనుకంపించినై...ఆవీణ తంత్రులు. పాపం ఆ వీణతీగలు కళ్యాణి హృదయ స్పందన శాసనాలను అతిక్రమించి ఎప్పుడూ నడుచుకో లేదు...అతఃపూర్వం; యీ దీననిశ్వాసాన్ని అను కంపించటంలో...ఒక ధ్వనికి మారు మరొకటిగా... గజిబిజిపడ్డయ్. ఆ రాగస్వరూపమే మారిపోయింది. సిగ్గుపడ్డ కళ్యాణి తలెత్తి తండ్రివంక చూచింది... ఆయన అదోలాదిగులుగా—కళ్యాణికి భయంవేసింది ... తడబడుతున్న పాదాలు తండ్రిదగ్గిరికి చేరు కున్నాయి...

"ఏమిటి నాన్నా?"...

వెన్నముద్దతో సహా దొంగకృష్ణుడు యశోదకు దొరికిపోయాడు.

"ఎబ్బే ... ఏముంది ... ఏమీలేదే"—అంటు సర్దుకోబోయాడు. ఆయన నేత్రాలు కన్నీటి పొర జాలులో చేపపిల్లలులా మిలమిలా మెరిసిపోయినయ్...

"అమ్మ దొంగా!...అదేం..."

"ఏదీ...నేను ఏడవందే?"—సూత్రం తెగిన ముత్యాలపేరులు ... కనుకొలకులవెంట జోటజోటా కన్నీరు.

"నాకూడా... యేడుపొస్తోందినాన్నా"— నా ముఖంలో ఆ విడ ముఖంచూసుకుని అమ్మనిమరిచి పోయానని గొప్పలు చెప్పావ్; అన్నీ వట్టిమాట లేనా? "

"అమ్మకోసంకాదు నాయనా!...కళ్లు బాగా వేడిజేసినట్టున్నై...దానికోసం నేను దుఃఖపడవలసిం దేముంది? [చిరునవ్వు బలవంతాన తెచ్చిపెట్టుకుని] అసలు ఆ యిల్లాలు మానవదేహంతోనే బ్రతికవలసి వుంటే...ఆ అమాయిక హృదయం బరువులెత్తే

ఈ మాధుర్యాలను భరించగలిగేదేనా...అది మొదట్నుంచీ నాకంటే ఎలాగైనా తెలివితేటలు గల మనిషి...అందుకనే ముందుగా జాగ్రత్తపడి...ముఖం తప్పేసి...స్వర్గధామానికంటూ వెళ్లిపోయింది...అది నాకంటే ఎలాగైనా జాగ్రత్తగల మనిషి మొదట్నుంచీ. అసలూ...ఆవిడకోసం నేను పరితపించి లాభ మేమిటి? ..తెలివిగలవాళ్లు పరీక్షలో కృతార్థులై త్వరత్వరగా పైతరగతిలోకి వెళ్లిపోతారు. నాబోటి బండబ్బాయిలు తప్పిపోయి చదివినతరగతే తిరిగి చదువుతూ తంటాలు పడుతూ వుంటారు...ఈ మానవత్వంలో పవిత్రతకు ఒక అవధివుంది...దాన్ని అధిగమించితే ఇక్కడ వుండటానికి వీల్లేదు. గౌతమదేవుణ్ణి గర్భాన ధరించుకున్న మహాపుణ్యానికి...వస్తేనే గాని వీల్లేదని, దెబ్బలాడి మాయాదేవిని పుష్పవిమానంలో ఎక్కించుకుని, బలవంతాన లాక్కుపోలేదూ—దేవతలూ—యీమానవలోకంనుంచీ?—మీ అమ్మ అంతే—దివ్యగాంధర్వాన్ని ప్రసవించుకున్న మధుర హృదయానికి...మానవత్వంలో నాప్రక్కన ఇక్కడ తావు కావాలని కోరటానికి నేనేం పిచ్చివాణ్ణనుకున్నావా?"—ఏదో ప్రపంచంలో నుంచి లా, చిరునవ్వు నవ్వుతాడు.

"అవున్లే—నన్ను గొప్పదాన్నని ఉబ్బేసి అసలు విషయం మరిపించాలని చూస్తున్నావ్, అలా వీల్లేదు—చెప్పివెయ్యాలిసిందే."

"అమ్మకోసంగాదు సరా?...మొదటే చెప్పాను గా అది ఒక పిచ్చిమాటనీ...అదొక తెలివితక్కువ ...అనవసరంగా కలవరపడ్డాను...ఏమీలేదు తల్లీ..."

"ఏమిటినాన్నా!"—అని మూతిముడిచి, భుజం మీద పడుకుని మారాం జేస్తుంది.

అయోమయంగా "నీ పక్కకింద పెట్టాను...చూళ్లేదా ఇంకా...అతను ఉత్తరం వ్రాశాడు...ఎల్లుండి వచ్చి తీసుకువెడతానని"

"చూశానునాన్నా...ఏం?"

"పిచ్చిమాటని మొదటే చెప్పానుగా...నీసంగీతం వినకుండా బ్రతకలేనని యేమిటో...భయం వేసింది...తెలివి తక్కువగాక మరేమిటి."

ఓహో...అదా" — పోనీ మరొకనెలవుండీ పంపుతానని వ్రాయలేక పోయారూ?"

"అలా అతనికి అడ్డుచెప్పటానికి నాకేమిటి అధికారం? ఎప్పుడైనా వున్నదేనాయె...అయినా హృదయం రెక్కలు విచ్చుకుని అతణ్ణి చేరుకోవాలని బలాటపడటం అది నేను ఇంకా గమనించలేదనే?"—తండ్రి తన్ని యెప్పుడో పట్టివేశాడని సిగ్గుపడ్డది, కళ్యాణి; చెక్కిళ్లు ఎర్రబడ్డయ్.

"పోనీ...నాన్నా! ఇక్కడ యేముంది? ఒంటరిగా ఇక్కడ వుండకపోతే, ఈ యిల్లు అద్దెకిచ్చేసి నీవుకూడా నాతో వచ్చేసి వుండిపోతే బాగుండదూ?"

"అలా నేను చేయలేను నాయనా!"

"పోనీ...ఆయన్నే ఇక్కడ వుండమంటే?"

"ఛీ! తప్పు!" చరాల్న కత్తిరించినట్టుగా, మందలించాడు.

"మీ రిద్దరూ సుఖంగా వుంటే నాకదిచాలు. అంతకంటే అతన్ని నేను మరేమీ యాచించను...మరేం ఫరవాలేదు...నెమ్మదిగా అలవాటు చేసుకోగలనులే...ఈ విషయం నీవు బెంగగా ఆలోచించకు...సంతోషంగా వుండు...బిక్క ముఖంతో అతనికి నువ్వు కనిపించటం అది నాకు ఇష్టంలేదు...ప్రయాణానికి కావలసిన యేర్పాట్లు చూస్తున్నాను.

"శ్రుతి తంబురా ఒకటి పెద్దది కొనుక్కురా నాన్నా...కొంచెం మంచిదిగా చూసి."

౬

ఉగాది—

"క్షమించాలి—వసంతకోకిల శ్రీమతి కళ్యాణి గారి వీణావాదనం ఉగాదికానుకగా అర్పించుకుంటా మని లోగడ ప్రకటించాం. వారి అనారోగ్య కారణంగా అలా చేయలేకపోయాం. ఇప్పుడు మాస్టేషన్ విద్వాంసులు ఒకరు వీణ వాయించుతారు—

అంటూ చిన్నకుమార్తెణ చెప్పుతున్నారు రేడియో స్టేషన్ నుంచి...

సొంతసెట్టులేని ఒకపేదరసికుడు, పార్కులో కూర్చుని ఈమాటవిని నిరుత్సాహపడి కాళ్లీడ్చుకుంటూ ఇంటికి చేరుకుంటున్నాడు... య్యో పాపం! ఆ తల్లికి జబ్బేమిటో ?..." అనుకుంటూ.

* * *

"చాలా చీకటిగా వుంది కళ్యాణీ! పిరాడటం లేదు......వద్దువద్దు...చిమ్నీ అలా హెచ్చించకు...ఇప్పటికే అది కొరివిదయ్యంలా మండుతోంది...దాని వంకచూస్తే గుండెలు కొడిగట్టి పోతున్నట్టుగా వున్నయ్...సాంతం ఆర్పివెయ్యి... అది కొడిగట్టి మండినకొద్దీ జడలు విరబోసుకుని చీకటి పిశాచాలు గదంతాతెందనాలు త్రొక్కుతున్నయ్...

గదంతా అంధతమసం...ఆకాశంలో నన్నా యేమైనా కొంచెం వెలుగుందేమో?...కిటికీపై రెక్కల్లో ఒకటి తెరిచాడు—కారుమబ్బుల కాళరాత్రి... జీమూతాలు పరుగులు తోలుతున్నయ్, ఆకాశమంతా ...ఆకాశంవంకచూసి హడిలిపోయిన కాకికూన కళవళిస్తూ, తల్లి కాకిరెక్కలోదూరి, తల్లిని లేపుతోంది ...దొడ్లో బాదం చెట్టుమీద.

"ప్చ్!...ఈ చీకట్లో ఇక బ్రతకలేను"...నిరుత్సాహంగా కిటికీ రెక్కమూస్తాడు...

"హూ..." అన్న దీననిశ్వాసం;—చీకటి దేవత గదిలో మెసిలినట్టైంది. కళ్యాణి మునివ్రేళ్లు నిస్పృహదేవత నిశ్వాసాలులా...ప్రాణంలేని గాలి తీగెలులా అతని భుజాన్ని తాకినై.

"కళ్యాణీ! పాపం నువ్వువచ్చి రెండుమాసాలయినట్టుంది."

"హాఁ"—

"మీనాన్న దగ్గ పంపనా? వుండివట్టువుగాని"

"అపచారం?..."

"అబ్బా! అదేంమాట...గుండెల్ని అలా మెరుపు కత్తిలో సర్రేన...కోసుకుపోయిందే?... అపచారమనిగాదు. నువ్వు చాలా జబ్బుగావున్నావ్— మీనాన్నమీద బెంగగా వుందేమోనని—"

"నేనేం పసిదాన్నా?...గంపెడాశలు ఒడిగంటి రాజనాలులా మూటగట్టుకుని మీ పాదాల దగ్గరకు చేరుకున్నాను. మీరాకకు యుగయుగాలుగా ఎడతెగని చీకటి రాత్రులెన్నో ఎదురుదారులు చూచాను. నన్ను తరిమి వెయ్యాలని చూడకండి... మళ్లా ఒంటరిదాన్ని చెయ్యకం ఒంటరిగా బ్రతికే తాహతు ఇప్పుడు నాకులేదు. నేను చాలా అలసిపోయాను...నాకు చిన్నమెత్తు ప్రాణమైనా లేకుండా పోయింది. నా కాళ్లు గుడ్డపేలికలల్లే గాలిలో తేలిపోతున్నై...కాలూది నిల్చోలేకుండా వున్నాను. ఇప్పుడు నా చెయ్యి జారవిడువకండి...నిల్చోలేను... మీ తొడమీద పడుకుని...ప్రాణం విడుచుకోనివ్వండి"—

కళ్యాణిని తొడమీదికి తీసుకుని, రేగిపోయిన జుట్టు సరిచేస్తూ—

"నీవు నా ప్రక్కన నిల్చివుంటే నా హృదయంలో వెండివెన్నెలలు వెల్లివిరిసిపోయేవి కళ్యాణీ!... కాని...ఇప్పుడు...నా ఆనందచంద్రుడు మసకమసక వేసి పోయాడు...కారుమబ్బులచాటున. ప్రాణరహితమైన నిస్పృహదేవత చీకటిక్రీనీడలా అయోమయంగా నీవు నా జీవితంలో మెసులుతూ వుంటే...నాకంతా ...చీకటి చీకటిగా...కారుమబ్బుల కాళరాత్రిలా కీచుమంటూ...జిమ్ముమని దుఃఖం ముసురులు వేసి ముంచుకువస్తోంది:

"ఔను ప్రభూ! నేను దినదినం చీకటిచీకటిగా చివికి అంధకారపు ఆత్మలా అయోమయమైపోతున్నాననే యేడుస్తున్నాను. నాహృదయంలోకి తొంగిచూస్తే దీపాలు ఊది వేసిన నర్తనశాలలా అంధకారం ఆవలిస్తూ భయంకరంగా వుంది. నిస్పృహదేవత దుఃఖగీతిలో

# సోమరితనముగా నుండుటకు ఇది సమయముకాదు

**స్త్రీల సహాయక దళములో** (ఇండియా) ఉద్యోగములకు ప్రస్తుతము అనేకవేలమంది స్త్రీలు అవసరము. ఈ ఉద్యోగములలో పని అత్యంత ఉత్సాహకరముగా నుండును, మంచి జీతము రాగలదు. వయస్సు 17 సం.లకు 50 సంవత్సరములకు మధ్యవుండి, ఇంగ్లీషును ధారాళముగామాట్లాడుట, వ్రాయుట తెలిసినవారు మాత్రమే దరఖాస్తు చేయవలెను.

**సౌకర్యములుగల వసతి గృహములు:** డబ్ల్యు. ఏ. సి. (ఐ) లోని జనరల్ సర్వీసులో చేరువారు సౌకర్యములుగల వసతిగృహములలో నుంచబడుదురు. ఈ దళములోనివారే అగు బాధ్యులైన స్త్రీలు వాటిని పరిశీలించుచుందురు.

**విజయము:** బేషరతుగా శత్రువులు లొంగిపోవుటకు ఈ యుద్ధములో తమపాత్రను నిర్వహించునట్టి భారత స్త్రీలు విజయము వచ్చిన పిమ్మట శాంతి సౌఖ్యములను అనుభవించుటలో ఎక్కువ అధికారము కలిగియుందురు.

**మున్ముందు ఉద్యోగము:** వాణిజ్యములోను, పరిశ్రమలలోను ఇండియా త్వరితగతిని అభివృద్ధిచెందుచున్నది. శాంతి యేర్పడిన తరువాత సివిల్ ఉద్యోగములకు అనేకమంది సుశిక్షితులు (స్త్రీలు, పురుషులు) అవసరమగుట నిశ్చయము. డబ్ల్యు ఏ. సి. (ఐ) లో యివ్వబడు శిక్షణ, ఈ దళములో పనిచేయుకాలమున కలుగు అనుభవములవలన, యుద్ధానంతర జీవితములో అనేకమంది స్త్రీలు మంచి అర్హతలు, ఆఫీసు నిర్వహణదక్షత కలిగియుందురు.

**దరఖాస్తుచేయుట ఎట్లు:** ఈ ఉద్యోగములో చేరు షరతులు మొదలగునవి నిర్మొగమాటముగా డబ్ల్యు.ఏ.సి.(ఐ) లోని ఏ. టి. ఆర్. ఓ. ల నుంచి పొందవచ్చును. వారుకూడా ఈ దళములోనివారే. మీరు కోరిన, డబ్ల్యు. ఏ. సి. (ఐ) గురించిన ఏ సమాచారమునయిననూ వారు సంతోషముగా తెల్పుదురు.




ఏ. టి. ఆర్. ఓ. డబ్ల్యు ఏ. సి. (ఐ) అడ్రసులు.

**బొంబాయి:** ఏ ఎఫ్.ఐ. బిల్డింగు. హాస్పిటల్ లేన్. దోభీతలావ్. **కలకత్తా:** c/o డి.టి ఆర్.ఓ. 28, థియేటర్‌రోడ్. **లక్నో:** c/o టి ఆర్ ఓ. ఈస్టర్న్, హజరత్‌గంజ్. **పాట్నా:** c/o డి.టి.ఆర్.ఓ.ఎగ్జిబిషన్‌రోడ్డు **రావల్పిండి:** గ్విన్ థామస్ రోడ్డు. **బెంగుళూరు** (కాంటొన్‌మెంటు): కబ్బన్‌రోడ్డు **లాహోరు:** 22, డేవిస్ రోడ్డు. **పూనా:** స్టాన్‌టన్‌రోడ్డు. **మద్రాస్:** 3/18. మౌంటురోడ్డు. లేదా. మీకు దగ్గరలోవున్న డబ్ల్యు ఏ సి (ఐ) స్టాటిక్ కమాండరుకు దరఖాస్తు పెట్టుడు.

# స్త్రీల సహాయక దళము (ఇండియా) లో చేరుడు

AAA·1593·A·TG

కడలేని అక్షరాల కంకాళంగా కాలి కావురు వేసి పోయాను. నిశ్శబ్దశోకగీతినై ప్రపంచావధులదాకా విషాదాన్ని చలిగుబుళ్లలా మోసులెత్తిస్తున్నాను... అభాగ్యరాల్ని—నాపుట్టుక భారతమహిళా లోకానికే అవమానకరం. భర్తజీవితానికి కావలసిన వెలుగునివ్వలేని స్త్రీత్వం ఎంత నీచం...ఇది నాతండ్రికి తెలిస్తే...నన్ను కన్నందుకు ఎంత అవమానపడి అటమటించి యేడుస్తాడు...అయ్యో."

"భయపడకు కళ్యాణీ!... నీ హృదయంలో నాకింకా ఆశాకిరణాలు కనుపించుతూనే వున్నై. ...వాటి సహాయంతో...వెన్నెల బయలులోకి దారేమన్నా దొరుకుతుందేమో వెతుక్కుంటాను."

"లాభంలేదు ప్రభూ! దీపకళికను ఆర్పుకుని చీకటిగా వుందని బాధపడుతూ, అంధకారంలో తడుముకుని ఆయాసపడి లాభమేమిటి?"

"ఏమిటి కళ్యాణీ!... ఈ చీకటి కంతటికీ బాధ్యుణ్ణి నేననేనా?"

"మీ పాదాలు అంటుకోనీయండి...నేను బ్రతకాలని ఆశించుతున్నాను...కాపాడరూ?..."

"నాకు అర్థంగావటం లేదు కళ్యాణీ!...నేను నిన్ను చంపుకోవాలని చూస్తున్నానంటావా?...నేనిక్కడ నీకేం తక్కువజేస్తున్నాను?...పోనీ అంతే అను...నన్ను అలా నిందించటంలో నీకు శాంతి లేశమేదైనా లభించితే పోనీ అలాగే అను...నేనేమీ అనుకోనై..."

"నా హృదయజ్యోతిని ఆర్పుకుని మీరు చీకటిలో బాధపడకండి...మన జీవితాలు అంధకారమయం చెయ్యకండి. నా జ్యోతిని నాలో వెలుగనియ్యండి. వెలుగుజిలుగుల లీలావసథాన్ని తమకు మళ్లా కట్టుకుంటాను...అనుగ్రహించండి."

"తిన్నగా చెప్పు కళ్యాణీ... నన్నిప్పుడేం చెయ్యమంటావూ?...నీ కోసం నేనే త్యాగం చెయ్యటానికి వెనకాడతాననీ?..."

౬

"సంగీతం కళ్యాణి హృదయానికి ప్రాణజ్యోతి —వెలుగనియ్యండి...కళ్యాణిని బ్రతుకనియ్యండి... మీ జీవితానికి వెలుగుగీతికల వెన్నెల హారతులు అర్పించుకోవాలని యుగయుగాలుగా ఆశతో కనిపెట్టుకు కూర్చున్నాను. ఆశీర్వదించండి—నా హృదయజ్యోతి మీద శాసించిన ఆంక్షను తొలగించండి...జీవితాశ దాహంలా ఆర్చుకు పోతోంది...బ్రతికించండి."

"కళ్యాణీ!"—కఠోరంగా శబ్దించినై—ఆ డాబాతనాబీలు—

జీమూతాలు డొక్కలో మెసిలికల్లోల పెడుతుంటే...ఆకాశానికి పిచ్చెత్తిపోయింది...ఫెళఫెళా ...ఫెళఫెళా ... పిడుగులురిమి భూమాతను భయపెట్టింది.

"ప్రాణంలేని క్రీనీడ బ్రతుకు ఇక నేను బ్రతకలేను ప్రభూ?"—

"కళ్యాణీ! ఇది పెంకెతనం...భర్తకు ఎదురు తిరగాలని చూస్తున్నావ్ — నీతంబురా నేను మొయ్యను."—

౭

శాపగ్రస్తుడై మూగవోయిన నారదుడు ముగ్ధహంసగా మారి, ముక్కు హృదయంలో గుచ్చేసుకుని, అరమోడ్చిన కళ్లతో, ఆకాశగంగలో ఆ వేదనతో ... అటమటించి పోతున్నాడు. తల్లి హృదయం తరుక్కుపోయింది...కరుణవాహినిగా పాదాలు కదిలివచ్చినై. నీటి పొరజాలుమీదుగా నడచి వెళ్లి కలహంసను కరస్పర్శతో కొత్త అనునయించింది. శాపవిమోచనాన్ని పొంది నారదుడు తల్లి పాదాలకు నమస్కరించాడు, మహతిమీద మధురాతిమధురంగా ఒక రాగమాలికను వాయించి తల్లి కంఠంలో కత్తెరదండగా వేస్తున్నాడు—

చలువచేసిన తెల్లదుప్పటిపరిచి పాలవెల్లిలా వుంది, ఆ పందిరిమంచం. మంచం నడాన మోకాళ్ల మీద తలవేలవేసుకుని శోకమూర్తిలా దిగులుగా కూర్చుంది, కళ్యాణి.

అకస్మాత్తుగా ఒక్క మెరపు మెరిసినట్లైంది కళ్యాణి హృదయంలో. గప్పున ఒక చుక్క గగన మండలంనుంచి రాలిపడి రప్పుమని వెలిగిపోయిన అమావాస రాత్రిలా ఒక్కసారి తేజోమయమైపోయింది. ఆశాజ్యోతులన్నీ అంటుకున్నయ్.

" అవునవును...అవునవును "...అంటూ దబదబా పక్కదిగి చరచరా సావట్లోకి నడిచింది:.. పాలవెల్లి మధ్యనుంచి ప్రవహించిన అమృతవాహినిలా-

"ఎక్కడికీ బయలుదేరారూ?"విదియచంద్రుడు ఒక్క ప్రాణంతో ఆ పెదవులమీద చిరునవ్వుచిలికాడు.

"మతి భ్రమణంకూడా కలిగిందల్లేవుంది అనుకున్నాడు..."ఏమిటి కళ్యాణీ!" అంటూ కంగారుగా దగ్గరకు వచ్చాడు.

"తలంటిపోస్తాను-పోయించుకోరూ?"

ఏమి చెయ్యాలో తోచలే దతనికి...డాక్టర్‌ను పిలవాలా?...ముందు తండ్రికి టెలిగ్రామిస్తే...కలవర పడుతున్నాడు.

"ఇవ్వాళే నా పెళ్లైనరోజు—పండుగ చేసుకుంటాను"

"అవును ఆమాట నిజమే...కళ్యాణికి ఈస్థితిలో ఇది ఎలా జ్ఞాపకం వచ్చిందీ"...అని ఆశ్చర్య పడుతున్నాడు "అయినా పెళ్లిరోజు పండగ చేసుకోటం...ఎక్కడా విన్లేదే" అనుకున్నాడు మళ్లా.

"ఏమిటి మాట్లాడరేం?"

"నిజంగానా?"

"నిజం, నిజం, రండి రండి" అంటూ కులుక్కుంటూవచ్చి, రెండుచేతులూ పట్టుకుని స్నానాల గది దగ్గిరికి తీసుకువెడుతోంది-మతిచెడి యేదో ప్రపంచంలోకి పోయినట్టుగా...అతని కిదంతా అయోమయంగా వుంది.

*    *    *    *

ఆ సాయంత్రం—

ఆతను క్లబ్బుకు వెళ్లబోతున్నాడు—సంపంగి నూనె రాచి పక్కపాపటి తిన్నగా తీసి, వంకెలు వంకెలుగా వచ్చేటట్టు క్రాఫ్ జాగ్రత్తగా దువ్వింది. "ముద్దులుమూటగట్టే ఇలాంటి ఉంగరాలజుట్టు నాకు వుంటేనా!...ఎన్ని ఎన్ని పిన్నులు బెట్టి తంటాలు బడ్డా...వ్చ్ లాభంలేందే" అని మురిసింది. కనుబొమ్మల మధ్య చాదు చుక్కతీర్చి దిద్ది చెక్కిళ్లు పుచ్చుకుని వారగా సౌందర్యం చూసింది. "పెళ్లి కొడుక్కు బుగ్గన చుక్కబెట్టేనా?...పాపం క్లబ్బులో వాళ్ళంతా వేళాకోళంచేస్తా రని మీకు బిడియమేమో...సరే ఇంటికి తిరిగి వచ్చిన తరవాత ఆ అలంకారం...అప్పుడు మటుకు తప్పించుకోటానికి చూడగూడదు"—

"సరే! అలానేలే! నీ ముచ్చట నేనుమటుకు ఎందుకు కాదనాలి"—

పెళ్లినాడు తన తండ్రిబెట్టిన శాలంకండువా తీసి అతనిపైన కప్పింది.

"ఎబ్బెట్టుగా వుంటుందేమో...పోని ఇది వేసుకోకపోతేనేం కళ్యాణీ!"

"అలా వీల్లేదు...ప్రతీదానికీ మీ అధికారమే" ఉత్తరీయం కంగులు ముడిగా ముడిచి కడుతుంది.

"క్లబ్బునుంచి త్వరగా వచ్చెయ్యాలి...నే నీలోగా సింగారించుకుని సిద్ధంగా కూర్చుంటాను"—

ఇవ్వన్నీ మంచిచేష్టలో—పిచ్చో అతనికి అర్థం కాలేదు. ఆలోచించుకుంటూ బయటకువెళ్లాడు.

*    *    *    *

కళ్యాణి పెళ్లికూతురు సింగారం పూర్తిఅయింది. ...కాళ్లకు పారాణి, బుగ్గనిచుక్కతో సహా—పెళ్లినాటి బనారసు చీర — కీల్జడా, కటిపైన ముద్దులు మూటగడుతూ చివర జడకుచ్చులూ, నిలువుటద్దం ముందునుంచుని నుదుట కళ్యాణం బొట్టు దిద్దుకుంది-రేఖలుగా, అద్దంలో అందం చూసుకుని ముసిముసి నవ్వుల్లో మునిగిపోయింది.

కళవళపడుతున్న హృదయంతో క్లబ్బునుంచి ఇంటికి వచ్చేస్తున్నాడు—చకచకా. వీణా నినాదాలు ఘోరుకొలిగిపోతున్నయ్ ఆవీధంతా. కళ్యాణి మధురకంఠం వెలార్చే గాంగనిర్ఘరులతో కలసి ఆవీణ పరుగులు తీస్తోంది యమునా వాహినిలా.

అవమానంతో అతనిముఖం నెత్తురుముద్దలా జేవురించి భీభత్సమైపోయింది.

ఆఁ! ఏమిటే తిరుగుబాటు!" దబదబా మెట్లెక్కి—సావిట్లోకి వెళ్లాడు.

* * *

గానమధువీచికల
కలహంసవై—విరతి.
కన్నుమూయరసామి!
కళవళింపగనేల?...||గా||
ఉయ్యాల జొంపాల
ఊతునానాసామి!
వెయ్యార్యరు గీతికల
విరిసిపోదునులేర...||గా||
ముత్యాలశాలలో,
ముగుదమానసములో,
విరజాజి దీపికలు
వెలిగించితినిరార...||గా||

సోనలు సోనలుగా, తీపితేనెల మధురనినదాలు వానలుగా వర్షించుతున్నయ్ — ఆ గృహమంతా, బంగారుపువ్వుల్లా సప్తస్వరాలూ జల్లులు జల్లులుగా, తడిసి ముప్పందుమై తడబడిపోతోంది కృష్ణరావు హృదయం.

అగ్నిరేఖను ఆర్పివేయాలని తూనీగబారులు తుటారాలాడుతున్నయ్ — రెపరెపలాడుతూ ఇంకా రెక్కలు గాల్చాలని చూస్తోంది ఆ!

ఆ వీణానినాదాలకు ప్రతికంపనాన్ని పొందినయ్ అతని హృదయతంత్రులు...కంపించి, కంపించి కల్లోలంగా కదలిపోతున్నయ్—ఆపినా ఆగక. అతనికి హృదయమే వున్నట్టు తోచలేదు. అతని హృదయమే ఒక విపంచిగా మారిపోయింది.

పరులవీణలనైతే పాషాణపాకంగా పట్టుబట్టి "పార వేస్తావా? చస్తావా?" అని బలవంతాన ప్రాణం తీసెయ్యొచ్చు... తన హృదయమే తనకో వీణై కూర్చుంటే?—

వీణతంత్రులైదూ అయిను సెలయేళ్లైనయ్. అతని హృదయంలో...కలకలా క్రమస్వనాలు గా, మూర్ఛ్మరించుతూ — స్థాయినుంచి స్థాయికి లేడిపిల్లలులా చెంగుచెంగునదూకుతూ—గతుమీదగతు గమకం మీద గమకం పరుగులు దీసుకుంటూ ప్రవాహాలై పోతున్నయ్- -అతని హృదయతంత్రులు.

ఎక్కడో...శతసహస్రార్బుదయోజనపరి దీర్ఘమైన యేదో అజ్ఞాతంలో...చీకటి చింతల చిక్కతోపులలోనుంచి గుడ్డి కొక్కిరాయి కళవళించినట్టు... "కళ్యాణి తంబురామోస్తావా యేమిటి?...ఎంత అవమానకరం...ఎకౌంటెంటు ఏమన్నాడూ!" అంటూ మూగగొంతుతో మూలగబోయింది అతని మనస్సు.

ప్రజాహృదయంలో వెల్లువలై వెల్లి విరిసిన ఆ గంగా నిర్ఝరుల మధుఘోషల కల్లోలాలలో ఈ అపస్మారపుపక్షి గోణగటం ఎవరికి వినుపించుతుంది?

అతని హృదయనిర్ఝరులు గగనంకషకల్లోలంగా కెరటాలు ఎగరవేసుకుంటూ పాటలుబాడుతూ ప్రవాహాలైనయ్.

"ఉయ్యాల జొంపాల
ఊతునానాసామి?
వెయ్యార్యరు గీతికల
విరిసిపోదును లేర
ఉయ్యాల...జొంపాల—"

ఆకాశం అవతలి కొసనుంచి యివతలి కొసదాకా ఊపిరాడకుండా—ఊపుమీద ఊపు...ఊగిపోయింది అతని హృదయం...హాయిలో అరమూసిన

కన్నులు అలాఅలా కొంచెం విప్పిచూసేసరికి. కళ్యాణి గది గడపముందు నిలుచున్నాడు—

"ముత్యాలశాలలో
ముగుదమానసములో
విరజాజి దీపికలు
వెలిగించితినిరార—"ము"

ఓరగా మూసివున్న తలుపులు ఒత్తిగిలించాడు. ఆనందతారల దివ్యదీపావళిగావుంది అగది. "ఆ! ఎవ రాత్రేజోమయి." గాలికొదమలా నిశ్శబ్దంగా అడుగులు లోపలకి వేశాడు.

రాగరస సమాధిలో మునిగి రాజహంసిలా వుంది కళ్యాణి—ఆ ముఖంలో ప్రపంచాతీతమైన ఏదో ఒక దివ్యజ్యోతి—భర్త లోపలికివచ్చిన సంగతే గమనించలేదు కళ్యాణి. భర్త కళ్యాణిని పలుకరించనూ లేదు.

చాదు భరణిలోనుంచి కొంచెం చాదు తీసి బుగ్గన చుక్క బెట్టుకున్నాడు. మూలనున్న తంబురా తీసుకుని కళ్యాణి వెనకకుపోయి నిశ్శబ్దంగా కూర్చుని శ్రుతి వేస్తున్నాడు.—

"ఆసి మీ యిల్లంతా బంగారమైపోను. మొగుడూ పెళ్లాం సంగీతాలలో మునిగి తేలుతున్నాం, మేం రాం పొన్నుంచేపోమా?...పిల్లకు జబ్బుగా వుందని రేడియోలో చెప్పిస్తే పెద్దప్రాణం నేనేం గావాలనీ?...నిత్యకళ్యాణాలా యేమిటి బుగ్గల్ని ఆ చుక్కబొట్లేమిటి?" అంటూ గది సమ్ముంలో నిల్చున్నాడు ణి తంౖడ్రు.



# నాట్యకళ

❀

## = శ్రీ తాండవకృష్ణ =

లలితకళ లన్నిటిలోను అత్యుత్తమస్థాన మలంకరించిన నాట్యకళ సర్వ నాగరక అనాగరక ప్రపంచమున కనుపడుచున్నది. అంతదూర మెందుకు? మన నిత్యజీవితమున మన పాపాయి తన సంతోషమును వెలిబుచ్చునపుడు తప్పటడుగులతో తాండవకృష్ణుని మాదిరి తాండవ మాడుట మనము చూచుటలేదా? గోవత్సము సాయంసమయమందు తన మాతృదేవతను సందర్శించగనే తోక నెత్తుకొని, మెలికలు మెలికలు తిరుగుచు, మానవుడు పట్టలేని నాట్యభంగిమములను ప్రదర్శించుచు, నిజమాతృస్తన్యమును పొందుటకు సంతోషాతిరేకమున వెడలుట మనము చూచుటలేదా? ఇంత యేల! ప్రత్యూషపవనాంకురముల స్పర్శమాత్రమున వృక్షములు కొమ్మ లనెడి తమ బాహువులచేత నాట్యభంగిమములను ప్రదర్శించుట లేదా? అనగా సంతోషసమయమున సర్వజంతుజాలము ఒక్క గంతు వేసి తమయం దంతర్భూతమై యున్న సంతోషాతిరేకమును వెల్లడించుచున్నవి. ఇట్లే అనాగరకజాతు లందును ఏదో యొకవిధమైన తాళములకు, తప్పెటలకు అనుగుణ మగు నాట్యమును మనము చూచుచునే యున్నారము. అనగా, నాట్య మన మానవుని ఆంతరంగిక భావోద్రేకములు పొంగి, పొరలి, అంగ, ప్రత్యంగ గమన విన్యాసభంగిమా వైఖరులుగా పరిణమించు వ్యక్తివిలాసమే యని నిర్వచించవచ్చును.

నాట్యమనునది ఒకవిధమగు భాష. అది నేత్రములు, ముఖము, కరచరణాద్యవయవములకు సంబంధించినది. మానవుని భావోద్రేకములు అంగవిన్యాస వైఖరులచే వ్యక్తీకరింపబడిన నాట్య మంటిమి. అయ్యవి వాగ్రూప మైనచో కవిత్వము; రూపకల్పన మైనచో చిత్రలేఖనము; మధురమై హృదయవీణా తంతులను మీటగల్గినచో సంగీతము అగును.

నాట్యము లలితకళ లన్నిటియందును ఉత్తమ స్థాన మలంకరించిన దని చెప్పితిని. ఇందు శిల్పము, సంగీతము, చిత్రలేఖనము, సర్వము సమ్మిళితములై యున్నవి. లలితకళలు మానవునియందలి సుందరమైన ప్రకృతిని పెంపొందించి ఉత్తమోత్తమమైన స్థానమునకు గొనిపోగలవు. గానకళ మనుజుని రసవీధిని విహరింపజేసి క్షుద్రభావములను మరచిపోవునట్లు చేయును. సంగీతమునకు జాతి, మత, వర్ణవివక్షతలు లేవు. ఇట్లే వాఙ్మయవీథులందుగూడ క్షుద్రనియమములు లేవు. వాల్మీకి, కాళిదాసుల నామములు సర్వజాతి, మత, వర్ణములకు చెందిన వాఙ్మయప్రియు లెల్లరకును సదా ఆరాధ్యములైనవి. షేక్స్పియర్, షెరిడన్ మొదలగు కవీశ్వరులు సర్వ దేశ, కాలములయందును అభినందింపదగినవారు. అందులకే గాబోలు, జర్మన్ కవీంద్రుడగు గోథేమహాశయుడు కాళిదాసు రచించిన "శాకుంతలము"ను చదివి, బ్రహ్మానందభరితుడై నాట్యమొనరించినాడు. అట్లే నాట్యము మానవుని ప్రాపంచిక సంకటముల నుత్తరించి అతీతభావలోకములందు ద్రిప్పజాలిన దనిన సత్యదూరము కానేరదు.

సత్యమైన కళకు జాతి, మతవివక్షత గాని, భాషాబంధము గాని లేదని సుందరకళాస్వరూప మెరింగిన వేత్త లందరకును సువిదితమే! అందువలననే, ప్రాచీన మగు నటరాజ శిల్పమును జూచి సుందరకళా



వేత్తలగు విదేశీయులు సహితము అత్యాశ్చర్యానంద ములను వెలడించిరి.

ఇంగ్లండుదేశమున సుప్రసిద్ధశిల్పకళావేత్తయగు 'ఎప్ష్టీన్' (Epstein) అనునాతడు నటరాజ విగ్రహ మును గూర్చి ఇట్లు వర్ణించియున్నాడు :

**"Siva dances, Creating the World and destroying it. His larger hythms Conjure up vast a Cons of time, and His movements have a relentless and magical power of incarntation"**

శివతాండవమును గూర్చి మన గ్రంథము లేమి రచించినవో పరిశీలింతము : "పార్వతి అపరంజి సింహాసనాలంకృతయై, తన్మయావస్థతో బరికించు చుండగా, జ్ఞానదేవత యగు సరస్వతి వీణ మీటు చుండ, స్వర్గాధిపతి యగు నింద్రుడు వేణు వూదు చుండ, సృష్టికారుడగు బ్రహ్మ తాళము వేయుచుండ, విష్ణువుమృదంగము వాయించుచుండ, ఇంకను గంధ ర్వులు, అమరులు, అప్సరసలు, ముల్లోకములందలి దివ్యగాయనులు సామాజికులుగా పరికించుచుండ శివుడు కైలాసపర్వతాగ్రమున ప్రదోషసమయములందు తాండవ మొనర్చుచుండును" అని 'ప్రదోషస్తోత్రమున' వివరింపబడియున్నది.

ఇంతేగాక, కవీంద్రుడగు రవీంద్రుడు శివ తాండవమును గూర్చి ఈ విధముగా గాన మొనరించి యున్నాడు :

"In thy dance, divine dancer, freedom finds
its images and dreams their forms
Its Cadence weaves the threads of things
and unwinds them for ages;
Charms the Atom's rebellion into beauty
Gives rhythms to the Symphony of Stars;
Thrills life with pain
And charms up existence into surging joys
and sorrows."

ఇంకను సోదరి 'నివేదిత' అను అమెరికా దేశరాస్థులు

"Myths of the Hindus and the Buddhists" అను గ్రంథమున శివతాండవమునుగురించి ఈ విధ ముగా వ్రాసినది :

"The dance of Siva itself repressents the activity of Siva as the source of all movement within the Universe, and especially his five acts, Creation, Preservation, Destruction, Embodiment and Release. It. Purpose is to release the souls of men from illusion. It is frequently emphasised that the place of dance, the sacred shrine of Tillai or Chidambaram, is in reality, within the heart; the human soul attains release when vision is beheld within itself"

శివతాండవమునకు కారణము "కోయిల పురాణము (తమిళము)లో నీ విధముగా వర్ణింపబడి యున్నది:

"తారకవనములో మీమాంసపద్ధతి ననుసరించెడి కొందరు ఋషులు నివసించుచుండిరి. శివుడు వారినెదిరించుటకు వెడలెనట. అంత వారు మంత్రములతోను, మంత్రసృష్టమైన అగ్నిచేతను అతనిని దగ్ధమొనరింప జూచిరి. అపుడాయగ్నినుండి ఒక వ్యాఘ్రము, ఒక సర్పము, ఒక మఱుగుజ్జుమనుజుడును ఉద్భవించిరట. అంత శివుడు వ్యాఘ్రమును జంపి దాని చర్మమును ధరించెను; సర్పమును మాలగా స్వీకరించెను; మఱుగుజ్జును పాదాఘాతముచే మడియింపజేసెను."

"The essential significance of Sivas' Dance is three.fold. First, it is the image of His rhythmic activity as the source of all movements within the cosmos, which is represented by the Arch; secondly the purpose of the dance is to release the Countless souls of men from the snare of illusion. Thirdly, the place of dance. Chidambaram, the centre of the Universe, is within the Heart......The Conception of Siva's Dance is a synthesis of science, Religion and Art."

అని ఆనందకుమారస్వామి వర్ణించియున్నాడు.

కావున నాట్య మనునది హిందూదేశమున ప్రాచీనమై మతసాంబంధికముగ వర్ధిల్లినది. హిందూ మతమున శివుడు నటరాజుగా వర్ణింపబడినాడు. అట్లే శ్రీకృష్ణుడు బృందావనవిహారియై రాసక్రీడానాట్య మొనర్చినాడు. అంతేకాక కాళీయమర్దనసమయమున గూడ నాట్యమొనర్చినాడు. బృందావననాట్యము భక్తురాండ్రగు భామల నుద్ధరించుటకై యుండగా, కాళీయమర్దనతాండవము దుష్టసంహరణార్థమని కానవగుచున్నది.



విధముగ నాట్యము హిందువుల దృష్టిలో కళాత్మకము, మతసాంబంధికము, విజ్ఞానదాయకము. ఈ మూడింటి సంప్రుపేకరణమే నాట్యముగ మన దేశమున వర్ధిల్లినట్లు మన పురాణగ్రంథముల మూలమున దెలియుచున్నది.

ఇంతేకాక నారదుడు భరతశాస్త్రమును గురించి; "ఉత్తమం భరతశాస్త్రంచ భుక్తిముక్తి ఫలప్రదమ్" అనియును, "జ్ఞానవైరాగ్య సద్బోధకారణం మోక్షదాయకమ్" అని రావణుడును, "నృత్యగీతాద్యభినయై రాజానందైవతంగురుమ్" "తోషయేద్భారత శాస్త్ర భుక్తిముక్తి ఫలప్రదమ్" అని కోహలుడును వచించియున్నారు.

కాన భావ, రాగ, తాళసమ్మిశ్రితమైన భరతము ముక్తిప్రదాయి, మోక్షప్రదమునై సర్వజనారాధ్యమై వెలయుచున్న దనుట కేమియు సందియము లేదు.

నేటి ప్రపంచమున నీనాడు కళాప్రచారము, కళాద్వారమున విజ్ఞానప్రచారము, నాట్యోద్ధరణము అను ఉద్ఘోషలు వినబడుచున్నవి. ప్రపంచపునర్నిర్మాణము కళాద్వారమున జరుగవలె నని పత్రికలు, విజ్ఞాన

వేత్తలు చాటుచున్నారు. ప్రపంచమున సౌందర్య జ్ఞానము నశించి, అసుందరము, అసత్యము ఐనదానిని ప్రశంసించు అసహ్యభావ మొకటి వ్యాపించుచున్నది. కళాప్రచారము, కళాపునరుద్ధరణము, కళానిర్మాణములు మాత్రమే ఈ అసహ్యభావరోగమును బాపు దివ్యౌషధములు. అయిన, యుద్ధము, కల్లోలము, అసుందరత, అసహ్యభావము లను మహావ్యాధులచే పీడింపబడుచున్న యీ లోకమును కళయు, తత్ప్రచారమును ఎట్లుద్ధరింపవచ్చు నని ప్రశ్నింపవచ్చును.

కళకు మతభేదములు గాని, భాషావిభేదములు గాని యుండజాలవు. జాతివివక్షతలుగాని, స్త్రీపురుష విభేదములుగాని యుండజాలవు. వసంత ఋతువునందు కోకిల "కుహూ" రవమును విని యానందించుటకు భాషాభేద మడ్డువచ్చునా? "బిథోవెన్" (Bethoven) ఫిడేలు మీటునప్పుడు గానవేత్తలు ఆనందించుటకు ఆతని పాశ్చాత్యస్వరూప మేమి అడ్డువచ్చును?

అట్లే గానఝురి ఆంధ్రభాషాస్రవంతియైన నేమి, తమిళమైననేమి? కళావేత్త ఆనందపిపాసి; సౌందర్యద్రష్ట. అతఁడెప్పుడును ఎక్కడ సౌందర్యమున్నది అని వెదకుచుండెను. అతనికి భేదభావ మనునది పొడగట్టనేరదు. అందువలన కళాత్మతను అభివృద్ధిచేసికొనినచో, భాషావిభేదములుగాని, మతవిభేదములుగాని, దేశసరిహద్దులుగాని అడ్డురావు. కళాకారుని మతము, అతఁడేజాతివాడైనను, ఒక్కటియే. కళారాధనయే అతని మతము. కళయే అతని భాష. అందుచేత జీవితసమస్యలను, ప్రపంచసమస్యలను సులభాతిసులభముగ పరిష్కరించగలవాడు ఒక్క కళావేత్తయే.

నిజమైన కళాకారుని గూర్చి శ్రీమతి ఆనీబెసెంట్ అమ్మగారు రేమనిరో పరికింపుడు :

"కళాకారుడు సౌందర్యానికి పురోహితునివంటివాడు. ఆయన నేత్రద్వయము మనందరి నేత్రాలకంటె దివ్యసౌందర్యాన్ని ఎక్కువగా పర్యవేక్షించగలదు. ఆయనకు ప్రకృతిలో అంతర్హితమైన సౌందర్యాన్ని చూడగల శక్తి స్వతఃగా ఉన్నది. మన నేత్రాలకు అదృశ్యమైన ఆ సౌందర్యాన్ని చూపుటే కళాకారుని ధర్మము. ఆయన ప్రతిభవలననే ఆ సౌందర్యాన్ని మనము గ్రహించ గలము. వర్ణసౌందర్యగరిమ కళాకారునికి అర్థమయ్యేట్లుగా మనకు కాదు. సుశిక్షితమైన ఆయన వీనులకు శబ్దగరిమ వెంటనే తాకును. ప్రకృతిలో అంతర్భూతమైన ప్రతి సౌందర్యమును బహిర్గతముచేసి కళాకారుడు మానవజాతి కందీయవలెను. ఆయన ప్రతిరూపములోను ఆదర్శము కనిపెట్టగలడు. అపరిపూర్ణమైన దానిలో పరిపూర్ణత్వమును కనుగొనగలడు. పరిపూర్ణమైన సౌందర్యమును ప్రజలకు చూపుటే ఆయన పవిత్రమైన ధర్మము. ఆ సౌందర్య దర్శనమువలన వారి జీవితములను సుశిక్షితముల జేసికొనుటచే సుందరస్వరూపుడైన భగవానుని జీవిత ప్రతిబింబములుగ నవి వెలుగగలవు."

మన పూర్వులు ప్రపంచ మొక మహానాటకరంగ మనియు, ఆ నాటకరంగముమీద అనేకులు నాటకమాడుచున్నారనియు నిరూపించినారు. 'పరబ్రహ్మ'ను ఈ మాయాజగన్నాటకసూత్రధారు డని కూడ అనినారు. నిజముగా నాటకరంగముమీద నాటకములాగుననే మన జీవితనాటకమును మనము గ్రహింపగల్గి ఆ విధముగనే "ఆడి" వేయగల్గినచో, నాటకరంగముమీద నాటకములోని పాత్రలకు వారభినయించు సుఖ, దుఃఖములు వారికిగాని, చూచు సామాజికులకుగాని ఏ విధముగ ప్రతిబంధకములుగాక, ఇరువురకును ఆనందదాయకమై అనుభవయోగ్యములై రససిద్ధి చేకూరునప్పటికి ఆనందపర్యవసాయు లగుచున్నవో అట్లే అనేకములైన కష్టనులు, దుఃఖములు వాస్తవిక జీవితములోగూడ సుఖాంతములుగా మారిపోవును. అసలు రహస్య మేమన, జీవితమును అనుభవించుట యనిన జీవితనాటకమును 'ఆడివేయుట'యే. ఈ 'ఆడివేయుట' యొక్క అర్థమును బాగుగా గుర్తించవలెను. అనేకులు చీటికిమాటికి, అయినదానికి కానిదానికి

చీదరపడెదరు. ముఖము చిట్లించుకొనెదరు. వాస్తవిక నాట్యములో భంగిమములు [Poses] ఏ విధముగ నభ్యసించుదురో ఆ విధముగనే నిత్యజీవితమున కష్ట సుఖములు సంభవించినపుడుగూడ ఒక విధమైన భంగిమముల నభ్యసించుట నేర్చుకొనవలెను. ఇదియే జీవిత నాటకమును 'ఆడివేయుట' అనుదాని రహస్యము. జీవితనాట్యభంగిమముల నభ్యసించలేనివారు వాస్తవిక నాట్యభంగిమము లభ్యసించినచో, సుఖముగ, సులభముగ, ఆనందముగ జీవితముగడుపనలవడుట కవకాశము లున్నవి.

నాట్య మనునది అనాదిసిద్ధమైనదనియు, అపురూపమైనదనియు, అనన్యమైనదనియు పైన వివరించియున్నాను. మన పూర్వులు నాట్యకళోపాసకులు. "నాట్యవేద"మని నాట్యమునకు దివ్యత్వమునుగూడ ఆరోపించినారు. నాట్యానికి అధిదేవత నటరాజగు శివుడని మనము తెలిసికొనియున్నాము. శ్రీ మహావిష్ణువుని తాండవకృష్ణుని రూపములో ఆరాధించుచునే యున్నాము. పండుగలలోను, పర్వములలోను దేవతా కార్యములలోను, వినోద సమయములలోను విధిగా నాట్యమును మనవారు ఆరాధించెడివారు.

పైన చెప్పినవిధముగా నాట్యము మానవునిలో అంతర్భూతమైన సహజశక్తి. చూడుడు! మన పాపాయి సహజముగా సంతోషము వచ్చినపుడు గంతులువేయును; తందనాలు తొక్కును; తైతక్కలాడును. అది వానికి ఒకరు చెప్పినది గాదు. సహజముగా వానిలో నున్న శక్తి విజృంభించినది. కాని, పెద్దవారమగు మనము నిజముగా నాట్యముచేయవలసిన ఆవశ్యకతే గలుగునంత ఆనంద మనుభవించకను, లోకమునకు వెఱచియో, మోమోటపడియో, అది లోలోపలనే అణచివేసి, మన సహజ జ్ఞానమును అణగదొక్కివేయుదుము. ఈ సహజజ్ఞానమును మానవులలోనేకాదు, జంతువులలోకూడ మనము చూడగలము.

పైన చెప్పిన విధముగా తన తల్లిని చూడగనే ఆవుదూడ ఎన్నియో వంకరలు తిరుగుచు, మెలికలు మెలికలుగ సల్లలితముగ నాట్యముచేయుచు తోకనెత్తికొని పరుగెత్తివచ్చును. ఈ విధముగనే వృక్షములు కూడ పవనాలింగితములై కొమ్మలతో తలలూపుచు నాట్యముచేయును. విహంగవీథిని నక్షత్రజాలము మినుకుమినుకు మనుచు నాట్యముచేయకుండ ఒక్క నిముషమైనను ఊరుకొనజాలవు. ఈ విధముగా విశాల విశ్వమంతయు ఒక మహానాట్యముగ వెలసినది.





# విరహోత్కంఠిత



= శ్రీ వింజమూరి శివరామరావు =

మలుసంజ పడెనో లేదో -
చిలుకల నంపితిని, రావు; చెలి నంపితి, రా;
అలిగితివా ? పనితొందర
కలిగినదా ? ముగ్ధగోపికా మానహరా !

ఏనాడైనది చెప్ప మీయెడకు నీ వేతెంచి; నాగుండె యే
మో నీరాకలు కోరి కొట్టుకొను; నీవో - లేవాకో తీరికల్
రానేరావు; మనోహరా ! ప్రణయ లీలా స్వర్గసౌఖ్యమ్ము నీ
పై నాజీవితమందు కూర్చుటయు స్వప్నావస్థమైపోయెనా ?
తోచె నెలవంక, తెలికల్వ పూచినంత;
వీచె చిరుగాలి, నెరితావి వీచినంత;
వలపుతోడ తూగాడు నీతలపుతోడ
నీకొరకె వేచియుంటి - నీరాకకొరకె.

వ్రేతలపల్లెముద్దియల వెన్నలముద్దల దొంగిలింపగా
పోతివో ! లేతపచ్చికలు మూసిన దారుల నాల తోలగా
పోతివో ! పండువెన్నెలల పొంగుల పిల్లనగ్రోవి నూదగా
పోతివో ! హాయిగా యమున మున్గుచు తేలుచు నాడబోతివో

వికచనీలోత్పలములు, మల్లికలు, సార
సములు, నవరసాలము, లశోకములు - వాడి
యలుగులై నాయెడదమెల్ల కలగజేయు ;
కనుము నాప్రేమ; నన్నేలుకొనుము స్వామి !

# జ్యోతిర్వేదం

= శ్రీ గొబ్బూరు వేంకటానంద రాఘవరావు =

తాతా! తాతా! నిన్ను ఒక ప్రశ్న అడుగుతాను. చెబుతావా?

తాత—"ఏమిటమ్మా! ఆ ప్రశ్న? అడుగుమీ! చూతాము."

పిల్ల—"నాకు ఏమీ బోధపడలేదు. తాతా! ఈ భూమీ, ఈ ఆకాశమూ, ఈ సూర్యుడూ, చంద్రుడూ, నక్షత్రాలూ—ఈ కనబడేదంతా ఎక్కడ నుంచి వచ్చినదీ? ఎలాగ పుట్టుకొనివచ్చినదీ? కొసకి ఏమవుతుందీ? తెలియక అడుగుతున్నాను. చెప్పవూ?" అని ఆ పన్నెండేళ్ల బాలిక తన తాతను అడిగినది.

ముప్పదిసంవత్సరముల క్రిందటి ముచ్చట ఇది. ఆస్ట్రేలియాఖండములో జరిగినది. ఈ ప్రశ్న వేసిన బాలికకు తల్లీ, తండ్రీకూడా లేరు. తాత పెంచుచున్నాడు. మనుమరాలు తనవద్దకు వచ్చి ఈ ప్రశ్న అడిగినపుడు, "కుర్రభడవా! ఎందుకు నీకూ- ఈ యక్షప్రశ్నలూ" అని తాతకొట్టరాలేదు; కోపపడనూలేదు, "ఈ భోగట్టాలన్నీ నీ కెందుకు? చెప్పు" అని ఎదురుప్రశ్న వేయలేదు. "నీకు ఇప్పుడు చెప్పినా తెలియదు. పెద్దదానివైనాక నీకు తెలుస్తుందిలే" అని వాయిదా వేసి ప్రాప్తకాలజ్ఞునిలాగ ఆ ప్రశ్నకు అప్పుడే జవాబు చెప్పడం అనే గండం తప్పించుకోలేదు. ఆ తాత చాలామంచివాడు. కనుక నిజము చెప్పివేసినాడు.

"అమ్మా! నీవు అడిగిన ప్రశ్నకి నేను జవాబు చెప్పలేను. నాకూ తెలియదు. ఈ విషయం బాగా చదివినవారిని అడిగి తెలుసుకుందాము. అని సమాధానము చెప్పి, విజ్ఞానశాస్త్రము బాగుగా చదువుకొనిన వైజ్ఞానికుని దర్శనముచేసి ఈప్రశ్న వేసినాడు. ఈ ప్రశ్నకు జవాబుగా ఈ భూగోళపు పుట్టుక పూర్వోత్తరాలు చక్కగా తెలిపే ప్రపంచంపుట్టుక (Origin of the world) అనే పుస్తకమును ఇంగ్లీషులో వ్రాసి ప్రకటించినారు. పన్నెండు సంవత్సరముల బాలికకు కూడా బాగా అర్థమయ్యేటంత సులభశైలిలో ఆపుస్తకము రచింపబడినది.

ఈ విశ్వము ఎలాగు పుట్టుకొనివచ్చినదో ఆ వివరములు తెలిసికోవలెననే అభిలాష అనాదికాలము నుండి అనేకులకు కలిగియున్నది. అన్ని మతములవారును తమ పవిత్రగ్రంథములలో సృష్టిక్రమమును గూర్చి ఏదో ఒక విధముగా చర్చించియున్నారు. ఈ విషయము మతాభిమానులకు మాత్రమేకాక, విజ్ఞానవేత్తలకును, తత్త్వవేత్తలకును వేదాంతులకును కూడ ముఖ్యముగా తెలియతగినది. కనుకనే ఎందరో మహానుభావులు ఈ విషయమై ఎన్నెన్నో గ్రంథములు రచించినారు. సత్యమేదో తెలుసుకొని ప్రకటించుట అన్ని మతములకును అవశ్యమైన కర్తవ్యము. వైజ్ఞానికులకు ప్రకృతి సంబంధమైన సత్యాన్వేషణము, సత్యనిరూపణము అనునవే ముఖ్యకర్తవ్యములు.

అయినప్పటికీ అదియేమి కర్మమో తెలియదు కాని యూరపుఖండములో సుమారు ౧౫౦ సంవత్సరముల క్రిందటివరకు, క్రైస్తవమతాధిపతులు, ప్రకృతిపరిశోధకులును, సత్యాన్వేషణ పరులును అయిన వైజ్ఞానికులను మట్టుపెట్టి యమయాతనలపాలు చేయుచు వచ్చిరి. క్రైస్తవమతబోధనలకు వ్యతిరేకముగా ఆ

ఖండములో విజ్ఞాన విషయములను ప్రకటింప సాహసించినవారిపాట్లు చక్కలకు చక్కలకూడ లేకుండెను. సూర్యుడే భూమిచుట్టు తిరుగుచున్నాడని క్రైస్తవమతాధిపతులు బోధించిరి. అందుకు వ్యతిరేకముగా గయార్డినో బ్రూనో అను పేరుగల వైజ్ఞానికుడు భూమి సూర్యునిచుట్టు తిరుగుచున్నదని ప్రకటించెను. బ్రూనోబోధనలు క్రైస్తవమత విద్వేషకములనుకొని ఆ మతాధికారులు బ్రూనోను ఎనిమిది సంవత్సరములు చెఱసాలలోనుంచి యమబాధలపెట్టిరి. అయినను నిర్వికారధైర్యధుర్యుడై బ్రూనో తాను సత్యమని నమ్మిన దానిని మార్చుకొలేదు. అపుడు గత్యంతరములేక క్రైస్తవమతాధికారులు, రక్తపాతములేని దాక్షిణ్యభావముతో—జీడిగింజలను, కట్టెలను కాల్చినట్లు—బ్రూనోవైజ్ఞానికుని కాల్చివేసిరి. గెలిలియో మహానీయుడు దూరదర్శిని (Telescope)యంత్రమునిర్మించి ఖగోళ విశేషములను కనులార చూపుచు సూర్యుని చుట్టు భూమి తిరుగుచున్నదని నిరూపించినందుకు కారాగృహములో కొంతకాలము గడిపి తుదకు ధర్మరాజువలె అబద్ధమాడి చావు తప్పించుకొని, కన్నులు లొట్టపోగా పులినోటిలోని కండవలె బ్రతుకు జీవుడాయని బయటపడెను. కాలము ఎన్నడును ఒక్కరీతిని ఉండదు. కొన్నాళ్లు వెన్నెల; కొన్నాళ్లు చీకటి. క్రైస్తవ మతాధిపతుల అధికారములు నశించినవి. వైజ్ఞానికులు ఎప్పటికప్పుడు క్రొత్త సంగతులు కనిపెట్టుచు దినజీవనమునందా క్రొత్తసంగతులను వాడుకచేసి జీవనము సుఖతరముగా గడుపునట్లు చేయుచుండిరి. వైజ్ఞానికుల అవలంబించు పద్ధతులు వారి పరిశోధనా విధానములు, వారి పరిశోధనాక్రమములు, వారి తెలివితేటలు, వారియుక్తులు వారు పన్ని పనిచేయించుచున్న యంత్రములు లోనగునవి జనసామాన్యము యొక్క ఆమోదమును బడయబొచ్చెను. మరియును, మతాధికారులమని పేరుపెట్టుకొని, మత సంరక్షణ మిషతో క్రైస్తవ మతాధిపతులు అవలంబించిన అమానుష చర్యలు ప్రజలకు మిక్కిలి వెగటుగా తోచెను. వైజ్ఞానికుల బుద్ధి కుశలతచే సుఖముగా జీవనము చేయ మరిగిన జనసామాన్యము వారిపద్ధతులను మెచ్చుకొని వారిపక్షమవలంబించెను. కాగా క్రైస్తవ మతబోధకులపని "వెక్కిరించబోయి వెల్లి గిలపడినట్లు"యినది. మతాధికారులపై ప్రజలకు అగౌరవము, అనాదరము, హేళనబుద్ధి వృద్ధికాజొచ్చినవి. అంతటితోకూడ ఆగలేదు. మతమే బహిష్కరణమునకు లోనుగావలసి వచ్చిన దుర్దినములు వచ్చినవి. "దేవుడు లేడు - దయ్యములేదు, ఏమిమతము ? పాడుమతము ! పోపొమ్మ"ను నాస్తికుల సంఖ్య నానాటికి పెరుగుచున్నది. నాస్తికుల సంఖ్యకంటె (Agnostics) ఎగనాస్తికులసంఖ్య మితిమీరుచున్నది. ఈ ఎగనాస్తికులను వారు కేవలము నాస్తికులుకాదు "దేవుడు ఉంటే ఉండును. లేకపోతే లేకపోవును. ఆ గొడవ మనకేల ? వాని ఊసు మనకెందుకు? వానితో మనకేమిపని? దేవుడు ఉండిన యెడల వాని కర్మాన వానిని పడి ఉండ నిండు" అను మతములోనివారు. ఈ విధముగా క్రైస్తవమతమునకును నవీన విజ్ఞానమునకును మధ్యద్వేషము పెచ్చు పెరుగుచున్నది. ఇటీవల 1944 సంవత్సరములో ఇంగ్లండులో ప్రకటింపబడుచున్న ఒక మాసపత్రికలో ఒక క్రైస్తవ మతాభిమాని ఈ విషయమై వ్రాసిన వ్యాసములోని ముఖ్యాంశములు కొన్ని 1944 నవంబరు నెలలో వెలువడిన మాడరన్ రివ్యూలోనుండిఎత్తి వ్రాయబడినవి. ఆమతాభిమానుల గోల కొంత మనముకూడ వినుటవలన కొంత ప్రయోజనము కలదు. కావున దానినిక్కడ ఎత్తి వ్రాయుచున్నాను.

"పందొమ్మిదవ శతాబ్దమువరకును మతమునకును, విజ్ఞానమునకును మధ్య ప్రబలిన విరోధము మూలముగా వైజ్ఞానికుల అభిప్రాయములను మతాభిమానులు విని సహించలేకపోయిరి. బూటుజోడు తొడిగిన కాలుతో త్రొక్కిపెట్టినట్లు వారు వైజ్ఞానికులను మట్టిపెట్టుచు వచ్చిరి. కాలము మారినది. మొదటి కాలిబూటుజోడు ఇపుడు రెండవ కాలు తొడిగినది. వైజ్ఞానికులే ఇపుడు మతాభిమానులను త్రొక్కిపట్టి మల్లాడుచున్నారు. కథ అటునుండి ఇటు అడ్డము తిరిగినది. మతములే

ఇపుడు హింసాపాత్రము లైనవి. గెలిలియో డేకార్టి న్యూటను మొదలగు మహనీయులు నాస్తికమత వ్యాప్తికి ప్రపంచ మంతటను పునాదులు వేసి ప్రతిష్ఠ చేయుచున్నామని కలలో నైనను అనుకొనలేదు. అనుకోకపోయినను ఆపని జరిగినది. వారు బోధించిన విజ్ఞానము వ్యాపించిన కొలదీ మతవిషయములకు ఊహింప నలవికాని నష్టముతో చెరుపు కలిగినది. "అయ్యవారిని చేయబోయిన కోతియైన ద"ను సామ్యము నిజమైనది. సరి; అయినదేమో అయినది. ఇక నిప్పుడు మనము చేయవలసిన దేమనగా:—విజ్ఞానాభివృద్ధికి విసుగుకొనక విశాలదృష్టితో ఆ అభివృద్ధికి సుస్వాగత మిచ్చి మనలోనికి తెచ్చుకొనవలెను. వైజ్ఞానికులు నిరూపించుచున్న సత్యములను మతము పేరిట బోధింపబడు సత్యములతో చక్కగా సమన్వయించుకొని, మత విశ్వాసములు ఏమియు చెడకుండ సంరక్షించుకొనుచు, ఇంకను క్రొత్త పరిశోధనలకును క్రొత్త బోధనలకును పూర్తిగా సావకాశము లిచ్చుచు కార్యములు సాధించుకొనవలెను. మతోద్ధరణ విషయములో జరుగవలసిన అన్నికార్యముల కంటె ముఖ్యమైన కార్యమేమనగా, "ఇట్టి గోత్ర కలహమేలపుట్టె" అన్నట్లు సత్యమే ఆధారముగాగల మతమునకును, సత్యాన్వేషణ సత్యనిరూపణము లేమూలముగాగల విజ్ఞానమునకును మధ్య లేనిపోని కలతలు, విద్వేషములు ఎందుకు పుట్టిపెరిగినవో పరిశీలించి తెలుసుకొనవలెను. మనలో మత విజ్ఞానములకు సహకారము కుదిర్చి పెంపుచేసుకొనవలెను. వివేకముకలవారందరును మత విజ్ఞానముల పోరు మాన్పి పొందిక కుదుర్చుటకు పాటుపడవలెను. సత్యమూలములై అవినాభావసంబంధముగల మత విజ్ఞానములను ఏకముచేసి వివాహముకావించి ఒక యింట హాయిగా సుఖముగా జీవించునట్లు సామరస్యము కుదుర్చుటయే ఇప్పుడు లోకకల్యాణమునకు ముఖ్యసూత్రము.

మత విజ్ఞానములను గూర్చి జిజ్ఞాస చేసిన బిషప్ క్రెయిటన్ గారు ఈ విషయమై ఇట్లు చెప్పినారు:—

"మన ముందుగతియేమి? ఉత్తమగతి పొందుటకు మార్గమేది? అనే విషయములను గూర్చి తెలుపునదే మతము. అదే విషయములను గూర్చి ఎక్కువ తక్కువలు లేక విజ్ఞానముకూడ తెలుపును. వైజ్ఞానికులు భయభక్తులతో సర్వశక్తునిగూర్చి తెలుసుకొనుటకే—శాశ్వతుడు నిత్యుడునైన పరమేశ్వరుని గూర్చి తెలుసుకొనుటకే ప్రయత్నింతురు. పరమసత్యమును గూర్చి పరిశోధించుచు ఐహిక ఆర్థిక విషయవిశేషములను గూర్చి విముఖులై తమవలెనే బ్రహ్మజిజ్ఞాసువులైన మహనీయుల సఖ్య సానుభూతులను వైజ్ఞానికులు అపేక్షించుచున్నారు.

మన హిందూమతముయొక్క నిజస్వరూపమును మహాత్మాగాంధీగారు ఇట్లు చక్కగా నిర్వచించినారు :—

"శాశ్వతమైన సత్యమును నిర్దాక్షిణ్యముగా వెనుదగిలి పట్టుకొనినదే హిందూమతము. అయితే ఈనాడు ఈ హిందూమతము ఉలుకు పలుకులేక మందముగా పడియున్నది. కారణ మేమనగా ఈ సత్యాన్వేషణ పరత్వములో ఈమతము బహుదూరము పరువులెత్తి ఇపుడలసి సొలసి కూలబడిపోయినది. కాస్త బడలిక తీర్చుకొనిన పిమ్మట హిందూమతము మరలలేచి అపూర్వము మహోజ్జ్వలమునైన దివ్యతేజస్సుతో లోకమున వెలుగుచుండగలదు."

అని మహాత్ములవారు సెలవిచ్చినారు. హిందూమతము ఇంతకుపూర్వము శాశ్వతసత్యముల నెట్లు అన్వేషించినది? అన్వేషించి ఏమి తెలిసికొనినది? ఆ విషయముల నీనాటి విజ్ఞానము ఖండించుచున్నదా? ధ్రువపరుచుచున్నదా? ఇవన్నియు చర్చించి తెలిసికొనవలసి యున్నది. వేదమూలమైన హిందూమతమునకు సత్యమూలమైన నవీన విజ్ఞానమునకును పొత్తు కుదురునా? వేద, విజ్ఞానములకు సమన్వయము కుదురునా? లేదా కుదిరిన నెట్లు కుదిరినది? అను నీ మొదలగు ముఖ్యాంశములను సప్రమాణముగా చర్చించి తెలుసుకొనుటే ఈ జ్యోతిర్వేదమనుదానికి ఆశయమని విన్నవించుచు ఈ ప్రస్తావన ప్రకరణము ముగించుచున్నాను.

# అనుబంధము

## శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి

ఒక కావ్యంబున నొక్క పద్య మది యేదో వింటి నేనాఁడొ మా
మక చిత్తంబున హత్తె నయ్యది రసోన్మాదంబు కల్గించి త
త్సుకవీశుం డొకజాతి హీనుఁ డగుఁబో, జోడింతు నవ్వాని కు
త్సుకతన్ గేల్గవ జంక నెన్నఁటికి నాతో వాద మింకేటికిన్

అతఁ డెతఁడో యెఱుంగను సుధాంశుకళాధర జూటజూట సం
తత లుఠ దాపగా జవవిధా బహుధా పరిగీతగీః ప్రశో
భితగతి తోడఁ బారిపద వేదిక నెక్కి యుపన్యసించె న
య్యతనికి నబ్బురంపడినయాత్మ ముదమ్మునఁ జాఁగి మ్రొక్కితిన్

3

వాఁ డెవ్వండొ యెఱుంగ, నేనెవఁడనో వాఁడుం దలంపండు, నన్
జూడ న్వానికి జాలిపుట్టినదొ హ్యాచూచ్చాలా వ్యథాధూతుఁ, డో
ష్ఠోడం జేతుల నన్ను నెత్తికొని యేదో గంజిలో నింత యే
నాఁడో వేసిన యన్నముం గుడిపె నన్నా యేమి సంబంధమో ?

౪

ఎన్నో జాములనుండి వానికిని నాకే బంధమో యుండు, లే
కున్నం గల్గునె యిట్టు లెచ్చటను ? భావోద్యద్రసస్ఫూర్తి లా
కన్నుల్ రెండును నిద్రపోవపుర ! నాకై; నేను నా కన్నులం
గన్నారం గని యన్యము న్మఱచి యున్మాదిత్వముం జెందెదన్

౫

అమలినరూపమైన ప్రణయం బెడఁదం గలఁపంగవచ్చె నా
రమణికి నాకు నేతరతరంబుల సౌహృదమో; తదీయ వా
క్సుమధువు మత్తున న్మునిఁగి చూచితి స్వర్గము; నామెక్రొత్త పం
తముగల కౌఁగిలింతలకుఁ దాళఁగ లేనయితి న్నిజమ్ముగన్

# పేకమేడ

[ కథానిక ]

= శ్రీ బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు

సాయంత్రమయింది. అప్పన్న ఆలోచిస్తూ ఇంటికి నడుస్తున్నాడు. విశాలమైన తెల్లటి ఇసుక దిబ్బలు. తాచుపాములా ఏరు. ఏటి నీరులో తళతళ మెరిసే పడమటి అరుణకాంతులు... చల్లగాలికి ఎడ్లు గంతులు వేస్తూ పరుగిడుతున్నాయి. ఈ సౌందర్య దృశ్యం అప్పన్నకేమీ వింతగా లేదు. ఆనందంగా లేదు. ఆ సౌందర్యంగూర్చి ఎప్పుడూ ఆలోచించనే లేదు.

చీకటి పడింది. ఎడ్లని సాలలో కట్టేసి, ఎండుగడ్డి పడేసి, వాకిట్లో నులక మంచం మీద నడుం వాల్చేడు. ఆరోజు పేరయ్యను చూసిన దగ్గరనుంచి తనమతి పోతోంది. తన కళ్లముందు పుట్టిపెరిగిన పేరయ్య, ఎడ్లని పొలాన్ని కూడా అమ్ముకొని; ఇంటో గిన్నెలు తాకట్టు పెట్టుకొని బతికినవాడు — ఎలాగయ్యాడు! తన దగ్గిర ఒకటి రెండు సార్లు జొన్నగింజలు అడుక్కు పట్టుకెళ్లేడు! ఇప్పుడో! అబ్బో! ఎజ్జిసిల్కు లాల్చీ, సిల్కు పంచ, పట్టువాణీ,— చూసి పలకరిస్తే పలక్కుండా ముఖం తిప్పేశాడు. నాలుగు రాళ్లు చేతిలో పడితే అంతే. ఒకొక్కడి అదృష్టం. తనకి ఏభైఏళ్లు పైబడ్డాయి. ఎన్నాళ్లయి ప్రయత్నం చేస్తున్నాడు మంచి మిద్దెఇల్లు కట్టిద్దామని - వెధవ సొద! ఎప్పటికప్పుడే అలా అయిపోతోంది. పొలం సరిగ్గా పండదు. సరియైన నీటివసతి ఉంటేనా? కష్టాలు, సిస్తులు, బకాయిలు, సరిగ్గా తిండికేనా మిగలదు - ఇంక ఇల్లెలా కట్టించడం - ఇప్పుడున్న పూరిల్లు అప్పుడే నాలుగుసార్లు కాలింది. పోలెడు సంసారం, కాలింద - ఎప్పటికప్పుడే మిద్దిల్లు కట్టిద్దామంటే చేతిలో దమ్మిడీ లేదు. డబ్బు ఎలా సంపాదించాలో తెలీకుండా ఉంది. లాటరీలో సంపాదించినట్టు ఎంతలో ఆర్జించాడు పేరయ్యగాడు - వాడిపాటి జ్ఞానమైనా లేదు.

బాగా చీకటి పడింది. చల్లటిగాలి వేస్తోంది - లచ్చి మంచం పక్కగా నిలబడి కాళ్ల మీద తట్టి లేపింది. అప్పన్న త్రుళ్లిపడి లేచేడు.

"ఏటలా తొంగున్నావ్. కూడుతినవేటి ?"

అప్పన్న మాట్లాడకుండా లేచి, చూరు కిందనుంచి వొంగి గదిలోకెళ్లి గిన్నె ముందు గొంతికిళ్లా కూర్చున్నాడు. పిల్లలిద్దరూ వృషాల్లా ఉన్న నులక మంచంమీద నిశ్శబ్దంగా పడుకుని నిద్రపోతున్నారు. పెద్ద పిల్ల సూరి చెయ్యి పైడితల్లిగాడి జుత్తుమీద ఉంది. నిద్దట్లో కాలు వాడి కాళ్లమీద పడేసింది.

వాళ్ల వేపు అప్పన్న కొంచెంసేపు చూసేడు, లచ్చి దాకలో అన్నం, పులుసూ గిన్నెలో గుమ్మరించింది. లచ్చి భర్త ముఖంలోకి చూసింది.

"ఏటలాగున్నా వియ్యాల ?"

"ఏటీ నేదు."

"పులుసెలాగుం దేటి ?"

"రెయ్యి లెక్కడివి ?"

"పేరయ్య తల్లి దుకాణ పెట్టింది కాదా?"

"దొంగనంజాకొడుకు"

లచ్చి గతుక్కుమంది - భయంగా అప్పన్న ఎఱ్ఱటి కళ్లల్లోకి చూసింది.

"న్యాయంగాపోతే కూడు నేదే"

"ఏమైం దేటి"

"ఆడికి పొగ లెక్కింది. పలకరిత్తే ముఖం తిప్పేసినాడు."

లచ్చి దాకలో మిగిలిన పులుసంతా గుమ్మరించింది. లచ్చికట్టుకున్న చిరిగిన చీర లోంచి ఆమెనగీరం కనుపిస్తోంది. పిలలు గుడ్డలు లేకుండా నిద్రపోతున్నారు. ఆలోచిస్తూ ముద్ద నోట్లో పేసుకున్నాడు. తన దరిద్రంగూర్చి ఆలోచించడానికి కారణం పేరయ్యగాడి ఐశ్వర్యం - వాడు తనకంటె నీచస్థితిలో ఉండేవాడు. ఇప్పుడు పెద్దవాడయ్యేడు. అప్ప ఎప్పటికీ తను అలాగే ఉన్నాడు.

వొంటికింత వొయసొచ్చింది. మంచి ఇల్లు నేదు. గుడ్డనేదు. తిండినేదు-ఎందు కొచ్చిన బతుకు లచ్చి."

"చాల్లేద్దు. బగమంతు డెంతిస్తె అంతే సాలు - మొదటినాడినుంచి లేద్ది ఇప్పుడొస్తా దేటి. పెంకిటిల్లు కట్టేగలమా సరుకులు సేయించుకోగలమా"

"ఎందుకు సేయించుకొనేం - మొన్న మొన్నటిదాక అడుక్కుతిన్న పేరయ్య కట్టించినాడు పెంకిటిల్లు - బంగారం కడియం సేయించినాడు-సిలుకునాల్చి-మల్లుపంచ—"

"ఎవడికో ఒకడి కబ్బతాదిసిరి - ఆతల్లి మాలచ్మి, పతియింటి కొత్తాదేటి-మోతు బరి సీతన్న కేనేదు పెంకిటిల్లు—"

"సీతన్న కేటుంది. మోతుబరె తేసరా."

"నచ్చీ, ఈదినాల్లో ఎవసాయంలో నాబం లేదు. ఏపారం సేసి సంపాదించాల. పేరయ్యగాణ్ని చూడు."

"ఆడికబ్బింది సిరి. మొదట్లో గారె లమ్ముకొనేవాడు"

"అదికాదే. యుద్ధం రాగానే సింత పండుకొని దాసేసినాడు. బియ్యంకొని దాసేసినాడు. మంచిదర రాగానే అమ్మేసినాడు. పట్నంలో మార్వాడికాడ నూని నేర్చినాడీ ఏపారం - ఇప్పుడేటి మనిసికోద రమ్ముతాడు."

"అన్యాయం సేసి సంపాదించినసొమ్ము ఎంత కాలముంటది లే"

అప్పన్న కేమీ తోచలేదు. తనుకూడా వ్యాపారం చేసిఉంటే ఎంత బాగుణ్ణు - ఈ వ్యవసాయంలో కాసి ఉండదు. న్యాయానికి రోజులు కావివి.

"ఒకపొలం సెక్క అమ్మేసి మనం కూడ ఏపారం సేత్తే బాగుణ్ణు"

"ఏటో పొలం సెక్క అమ్ముకుంటే ఏటి నాబం అయినా మన కదికులవృత్తి కాదు. మన కెవసాయమే రాసినాడు దేవుడు — పెద్ద పరుగుల కెందుకు పోవాల."

"నచ్చి నీకు ఎవ్వారగ్యానం నేదే."

అప్పన్న చాలా తెలివైనవాడే — ఈ ఏడాది వేరుసెనగ అమ్మకంలో ఊళ్ళో వాళ్ళంతా పేరయ్యగాడి టోపీలో పడ్డారు. కాని తనమాత్రం, పెద్దవర ఇచ్చే మార్వాడికే అమ్మేడు. ఈ విషయం పేరయ్యగాడు మరచిపోలేడు.

అప్పన్న లేచి చెయ్యి కడుక్కున్నాడు. మళ్ళీ మంచంమీద నడుం వాల్చేడు. ఆకాశంలో చుక్కల్లా అప్పన్న బుర్రలో భావాలు మిలమిల మెరుస్తున్నాయి. పొలం అమ్ముకుంటే లాభం లేదు. యుద్ధపురోజుల్లో అందరూ పొలాలు కొంటూంటే తను అమ్మడం మంచి పనికాదు. కాని ఎలాగైనా వ్యాపారం చేస్తేగాని లాభం లేదు. ఎంతకాలం, ఈ పూరి ఇంట్లో ఉండడం? ఒక్కనాడైనా తను గాని పిల్లలుగాని కడుపునిండా ఇంత తినలేదు. తాగలేదు. తనకి పాగా గుడ్డైనా లేదు. ఎంతకాలం ఇలాగ? డబ్బు కావాలి! వ్యాపారానికి మదుపుండాలి! ఆ, జ్ఞాపకమొచ్చింది. వేరుసెనగమీద వచ్చిన ఏభై రూపాలూ ఉన్నాయి. పంట అమ్మి రెండు రోజులే అయింది. ఈ ఏభై రూపాయలూ పెట్టి చిన్న కిరాణి కొట్టుపెట్టాలి. లచ్చిగాని, పెద్ద పిల్లగాని దుకాణంమీద కూర్చోవచ్చు. దుకాణంమీద అనుపదం, నూనె పెడితే మంచి లాభం వస్తుంది. ఒక సంవత్సరం పాటు నడిచేక చూసుకోవాలి మజా. పేరయ్యగాడేం కట్టించాడు ఇల్లు — వాడింటి కెదురుగుండా డాబాయిల్లు కట్టించాలి.

చాలా రాత్రివరకూ నిద్దరపట్టలేదు. నిద్దర పట్టకపట్టింది. కలత నిద్రలో పేరయ్య పకపక నవ్వుతూ కనిపించేడు. నేరేడుకాయ లాంటి ముఖంలోంచి తెల్లటి పాసుకోర ల్లాంటి పళ్ళు — నుదుటిమీద [illegible] అంత పచ్చ-బూజులా జుత్తు — బానంతకడుపు — చిన్న పిల్లలు చూస్తే జడుసుకుంటారు — ఇంకా నవ్వుతున్నాడు. అప్పన్న వొళ్ళు మండింది.

"నోరు ముయ్యరా — అన్నేయంగా డబ్బు గుంజేసినావు. వేరుసెనగ ఎవ్వారం దగ్గర రైతోళ్ళ నెంత అన్నేయం సేసేవో ఎవరికి తెల్దు? చూడు నేసేత్తా ఏపారం. నువ్వేటి కట్టించినావిల్లు — నేకట్టిస్తా సూడు. నువ్వేటి కొన్నావు గేదల్ని — నే కొంటా సూడు. నీకంత పొగరా? నువ్వెలా బతికినావో ఎవరికీ తెల్దు?"

పేరయ్య పకపక నవ్వి వెళ్ళిపోయాడు.

బల్లమీద వొచ్చాయి ఆముదపు డబ్బాలు — నూనె డబ్బాలు. ఎంత పెద్ద వ్యాపారమయిందప్పుడే!

పెద్దమేడ. లచ్చి కూర్చుని పిల్లకి పాలిస్తోంది. ఏంభాగ్యం! ఎవరో దుకాణం పక్కనుంచి మాట్లాడుకుంటూ పోతున్నారు. కిటికిలోంచి

వినబడుతున్నాయి. 'అప్పన్న అన్యాయంచేసి ఆర్జించాడురా! ఎంతకాల ముంటుందిలే!' గుండెలు దడదడ కొట్టుకున్నాయి. కానీ నన్నెవరేం చెయ్యగలరు. డబ్బున్న వాడికి దెయ్యం కూడా లొంగుతుంది. ప్రపంచంలో కూనీలు కుట్రలు, కేసులు, తగాదాలు, ఎన్ని వచ్చినా ధనవంతుణ్ణి ఏం చెగపలేవు. అప్పన్న పకపక నవ్వేడు.

"పొద్దెక్కిపోయిం దియ్యాల - ఇంకా తొంగున్నా వేం."

"రాత్తిరి సరిగ్గా కునుకేనేదు."

"పొలం కెళ్లవా"

"ఎల్తా. ఎవ రావాకిట్లో"

"సర్కారు జనూను - సముద్దా రొచ్చి నాడట - రమ్మన్నారు కరణంబుగారు-"

అప్పన్న నిర్ఘాంతపోయాడు. తన ఎనభై రూపాయల పాతబకాయి జ్ఞాపకమొచ్చింది.

# స్వాగతము

## శ్రీ యక్కల వీరరాజు

హృదయపుష్పాన నీవు వర్షించియున్న
ప్రేమమధు విది పొంగిపొర్లెడిని దేవ!
భ్రమరమై వచ్చి, దివ్యసౌరభము లాని,
పాడ నొకపాట ప్రకృతి వైవశ్య మొంద!

వదనగగనాగ్రవీధి కాంక్షథములందు
హాస్యరేఖా వినోదము లాశ్రయించె;
నెమలివై వచ్చి, యీ రమణీయతఁ గని,
ఆడు మొక యాట మధురదృశ్య మ్మొసంగ!

మానసోన్నతహిమవన్నగాన నుండి
నవ్యనవసితభావజాహ్నవులు పాఱె;
హంసవై వచ్చి, తన్మృదులానిలోర్మి
నూఁగు మొకయూఁగు-అమరసాయుజ్యమంద!

కంఠవీణాస్వరాలు చక్కఁగ స్వనించి,
మధువు లూరించుచున్న యీ మధురవేళ
శ్రోతవై వచ్చి, తద్గానసుధల నాని,
కాంచు మొక నిద్ర తీయని కలలఁ దేల!

# మాయామచ్ఛీంద్ర



జగత్తంతా మిథ్య,

పరమేశ్వరుడొక్కడే సత్య

స్త్రీ పురుషులిద్దరూ, ఒకే ఆత్మయొక్క రెండు రూపాలు. యీ రహస్యం తెలిసి మనుష్యులు వర్తించటంలోనే శాంతివుంది.

అహంభావంతో లోకం అశాంతిపాలు గాకుండా "వేదసందేశం" వినిపించటమే యీ చిత్రం యొక్క పరమార్థం.

మాయలో జీవిస్తున్న భూతకోటి కిది సాధ్యమౌతుందా ?

మహేశ్వరాంశమైన, మచ్ఛీంద్రనాథుల ఆశ్రమంలో, గోరక్‌నాథ్, శృంగి మొదలైన శిష్యులంతా యోగసాధనంచేస్తూవుండేవాళ్లు. గోరక్‌కు స్త్రీలంటే పడదు. "స్త్రీమాయ మోసం. మోక్షానికవరోధం" అని, స్త్రీజాతినే తిరస్కరించేవాడు. క్రమంగా సంఘంలో-గృహజీవితాలలో - రాజకీయాల్లో యీ జాడ్యం వ్యాపించి, దేశమంతటా అశాంతి ప్రబలిపోయింది. భూలోకంలోని యీ కల్లోలం కైలాసంవరకూ ప్రాకింది. దయామయి పార్వతి, మహాదేవుని అనుజ్ఞతో కుమారస్వామితో సహా శాంతిస్థాపనకై భూలోకానికి దిగివచ్చింది.—ఒకనాడు మచ్ఛీంద్రుల ఆశ్రమప్రాంతం తుఫానుతో-పెద్దవర్షంతో నిలవనీడలేకుండా ప్రకృతి అంతా భీభత్సంగా యుంది.

ఒక దీనురాలు ఆ హోరుకు ఆగలేక, వణికిపోయే శిశువుతో ఆశ్రమంలోకి అడుగుపెట్టింది. గోరక్ జాలిలేకుండా గెంటివేశాడు. మచ్ఛీంద్రుడు సమాధినుంచి లేచి గోరక్‌ను మందలించాడు. "స్త్రీ మాతృదేవత-స్త్రీయే సృష్టికి కారణం" అని ఏమేమో బోధించాడు. గోరక్ వినలేదు. అతను చెప్పిందే సత్యమని సన్యాసులంతా భావిస్తున్నారు. గోరక్‌నాథ్‌కు జ్ఞానోదయం కాకపోతే సంసారాలు త్యజించి సన్యాసమే శరణ్యమని దేశం చెడిపొయ్యేట్టువుంది.



మచ్ఛీంద్రుడు నిశ్చలంగా గోరక్ వేపు చూశాడు. గోరక్‌కు ఏదో అగాధమైన స్వప్నచిత్రం కనిపిస్తోంది. ఆ స్వప్నంలో—

'కామరూపరాజ్యాన్ని, కిలోత్తల అనే ఒక రాణి ఏలుతోంది. ఆమె మగవాణ్ణి చూస్తేనే మండిపడుతుంది. మగవాడు స్త్రీని బానిసనుచేసి అణగద్రొక్కాడని ప్రతీకారం తీసుకోటానికి తాను వివాహం మానేసింది. తాను పెంచుకున్న రూపకు

కూడా మగవాసన తగలకూడదని గోడలలో జీవించ మన్నది.

ఒకనాటి రాణిదర్బారులో — రాజులంతా తమను ప్రేమించమని వ్రాసిన ఉత్తరాలు చదివి మండి పడుతుంది. అమాయికరాలైన భార్యను తన్నటానికి వెంటబడిన భర్త సాహసం చూచి నిర్బంధిస్తుంది. ఆస్థానమంత్రి తీవ్రంగా మందలిస్తే, పదభ్రష్టుని జేసి— రాజ్యంలోని మగవాళ్లందరినీ బహిష్కరిస్తుంది.

ఆడదాన్నెవరాపుతారు ?—తనరూపయే రహస్యంగా సుధీర్ అనే రాచవానికి ప్రేమ నర్పించుకుంది. అతనికీ బహిష్కారం లేదా?—

రూపనెల్లి ప్రాథేయపడితే చివరకు ఆలయంలో తలదాచుకోటానికి జన్మ నరకాన్ని శాసించింది...

మగవాళ్లంతా మణిపురం ఖాళీచేశారన్నవార్త ప్రక్క రాజ్యాలకు అంటుకుంది. కత్తి కట్టిన సూర్యకేతు, రాణీని ఆక్రమింతామని పెద్ద సన్నాహంతో దండెత్తివచ్చాడు. ఆయుద్ధం సాగితేమాత్రం, మణిపురంలో స్త్రీలుండరు. సర్వనాశనమైపోతుంది. అప్పుడు మచ్ఛీంద్రుడు ప్రత్యక్షమై ఇంద్రజాలంచేసి ఆ గండం తప్పించాడు—...

రాణి, కృతజ్ఞత చూపించకుండా వుండలేక పోయింది. అంతా అనుకున్నారు స్వాములవారు రాణి వలలో పడ్డాడు అని. లేదు- రాణీకి మాతృదశ వస్తే గాని "స్త్రీ పురుషులు ఇద్దరుకాదు ద్వేషించుకోటానికి, ఆత్మ ఒక్కటే" అన్న జ్ఞానం వచ్చేట్టులేదని స్వామి, రాణీ ఆతిథ్యం అంగీకరించాడు...

ఆ ఆతిథ్యం సంసారానికి సారధ్యమైంది. (ఎలా అయిందో?) రూప యీ అవకాశం తీసుకుని సుధీర్‌ను పెండ్లాడుతానన్నది... రాణి అంగీకరించ లేదు. సంభాషణ ముదిరింది. రాణి రూపను విసిరి కొట్టింది.

యువరాణీకే పట్టింది. మనకిక మోక్షం లేదని స్త్రీలు—దేశబహిష్కృతులైన పురుషులు అల్లాడి పోతున్నారు.



రాణికి పిల్లవాడు పుట్టాడు...మనసుకరిగింది... స్వామి రాణీకిబోధించి పురుషులమీది ఆంక్ష తొలగించాడు. పిల్లవానికి ఐదేళ్లు వచ్చినై యిక్కడ...

ఇహ అక్కడ ; సమాధిలో గురువు కనపడక, శృంగి గోరక్ నాథ్‌లు, దేశమంతా తిరుగుతున్నారు. గురువులేకపోతే గోరక్ బ్రతుకలేడు...మాటల సందర్భంలో గోరక్ వస్తున్నాడనీ, అవసరమైతే తనను తీసుకుని వెళ్లేంత సమర్థత వుందనీ స్వామి రాణీతో చెప్పాడు. రాణి కంపించిపోయింది. గోరక్ అనే సన్యాసివస్తే తలనరికివేయండని వెంటనే సైనికులకు శాసనంచేసింది.

ఎలా వచ్చాడో జన్మదినోత్సవపు నాట్యంలో గోరక్ ఆడవేషంతో తయారైనాడు...బయల్దేర మన్నాడు గురువును...లేకపోతే చచ్చిపోతానన్నాడు. "వస్తానుగాని-తొందరపడకు-ఆలతా మంటపంలో వుండు" అని శాంతపరిచాడు శిష్యుణ్ణి

యీ లోపల, నర్తకి కళింగ గోరక్‌ను ప్రేమించటం—విఫలంకావటం—దాని చెల్లెలు మాలవాళ్ళో శృంగి భ్రంగిపోవటం జరిగింది...

రాణి మనోవ్యాధిపడింది. మచ్ఛీంద్రుడు ఓదార్చి, తాను ఆమెలోనే వున్నానని ప్రత్యక్షంగా చూపించాడు..."కాని, దేవీ! దేహాలు అనిత్యమైనవి. మోక్షం కావాలంటే యీ వాంఛ వదలుకోవలెను" అని వైరాగ్యంబోధించాడు...

స్వామి బయలుదేరే రోజువచ్చింది. అంతా మహేశ్వరాలయానికి బయలుదేరారు. "పిల్లవాడి చేతులు మలినంగా వున్నాయి. గోరక్! శుభ్రం చేసుకునిరా" అని మచ్ఛీంద్రుడు చెప్పాడు. గురువు వ్యామోహం చూసి గోరక్‌కు కోపం వచ్చింది

అమాంతం పిల్లవాడిని నీళ్ళల్లో బండకు వేసి కొట్టి ఎంపవేశి వచ్చాడు. రాణి ఆమాట అర్థం కాలేదు. పిల్లవాని దగ్గరకు పరిగెత్తింది. తీసుకొని వచ్చింది...



మచ్ఛీంద్రుని బిడ్డకు, మరణమా? అని ధైర్యం రాణీకి...

'మనకు బిడ్డతో ఋణం తీరిపోయిందని' స్వామి కూడా దుఃఖిస్తాడు...బ్రతికించే శక్తివుంది—కాని, గోరక్ అహంభావాన్ని పరీక్షించాలని ఊరుకున్నాడు.

నా గురువును నాతో పంపించి వేస్తే పిల్లవాణ్ణి బ్రతికిస్తా నంటాడు గోరక్. ఏంచేస్తుంది...అంగీకరించింది రాణి...గోరక్ శక్తంతా ధారపోశాడు...బ్రతకలేదు...తన సిద్ధు లంతరించినవేమని గురువును ప్రార్థించాడు...స్వామి అశక్తు డిలాగు మాట్లాడలేదు.

గోరక్ పశ్చాత్తాపంతో తనను చంపి దుఃఖం పోగొట్టుకోమని రాణిని కోర్తాడు...కొడుకే లేనప్పుడు రాణీకివన్నీ ఎందుకు...దుఃఖం అపారమైపోయింది... పిల్లవాడిలో స్వామి వుంటా నని చెప్పినమాట జ్ఞాపకం వచ్చింది...

"ప్రభూ! లేవండి" అని ఏడ్చింది రాణి. లేవలేదు..."కుమారా! మీ తండ్రి ఆజ్ఞ సుమా" అని బ్రతిమాలింది...లేవలేదు..."నా పాతివ్రత్యం నిరూపించటానికైనా లేవరా తండ్రీ" అని ఆక్రోశించిందా మాత.

రాణీకి అహంకారం పోయింది. నిరాశ్రరాలైంది. మచ్ఛీంద్రు డనుగ్రహించాడు. పిల్లవాడు లేచాడు. రూపవివాహమైంది. కామరూప రాజ్యమంతా సతీపతుల ఆనందోత్సాహాలతో వెల్లివిరిసి పోతూంది. మచ్ఛీంద్రులకు బ్రహ్మాండమైన సన్మానంతో వీడ్కోలిచ్చారు.

త్రోవలో - గురువుశక్తినే శంకించేంత అహంకారం వచ్చింది గోరక్ నాథ్‌కు...గురువు మాయమైనాడు. గోరక్ సరాసరి తిరిగి రాణిదగ్గరకు వచ్చాడు. శత్రురాజులు రాణీని బంధింపబోయి, చేతగాక సాష్టాంగపడుతున్నారు. ఆమె ఆనందంగా యోగినివలె నిలుచునుంది..."అమ్మా! గురుదేవు లెచ్చట—?" అని ప్రశ్నించాడు గోరక్...ఆమెకు విశ్వమంతటా కనిపిస్తున్నారు- నాడు...

"నాయనా! అహం అనేది నశిస్తే విశ్వమంతటా ఒకటే ఆత్మ. దానికి స్త్రీపురుష భేదం లేదు. అదే పరమాత్మ...అదే మోక్షం" అని బోధిస్తుంది...

గోరక్ కండ్లు తెరిచాడు. కల కరిగిపోయింది. వెనుకటివలె ఆ తుపానులో ఎదురుగా నిలచివుంది ఆ స్త్రీ అలాగే "అమ్మా! దయచేయ"మని కోరాడు గోరక్. "మహేశ్వరీ!–ధన్యులం" అని ప్రణమిల్లాడు మచ్ఛీంద్రుడు...ఆమె పార్వతి...ఆ శిసువు కుమారస్వామి—

పార్వతి కైలాసానికిపోయి మీ కుమారుడు, మచ్ఛీంద్రుడు శాంతి నెలకొల్పాడని మహాదేవునికి విన్నవించింది...

"దేవీ! అంతామాయ– మచ్ఛీంద్రుడూ మాయే...స్త్రీపురుషాత్మకమైన పరమాత్మ ఒక్కడే సత్యం"...అని అర్థనారీశ్వరుడు దరహాసంచేశాడు.—

# శాకుంతలమున దుష్యంతుడు



= శ్రీ మొదలి వెంకటరామయ్య =

నాటకస్థమగు నొకానొక పాత్రమునందు వ్యక్తీకరింపబడిన చేష్టలును, మనః ప్రవృత్తియు. నా పాత్రచిత్రణరీతిని- యథార్థమో ఆదర్శ ప్రాయమో—నిరూపించుట కాధారభూతములగును. శృంగారరసప్రధానములగు దృశ్యకావ్యములయందు నాయకుడు జనపతి యయ్యును కామదాసుడు కాకతప్పదు. కామము సర్వజన సామాన్యము. మోక్షోపలబ్ధికి తరింపవలసిన తృతీయ పురుషార్థము. దానికి వ్యక్తిగత విభేదములు కానరావు. రాజాధిరాజునందును సామాన్య మానవునియందును కామమొక్కరీతిగనే భాసించును. ప్రార్థితార్థసిద్ధికొరకిరువురును సమానముగనే ప్రయత్నింతురు.

స్త్రీ యను పదార్థమున కాకర్షణశక్తి సహజము. అట్టి యాకర్షణమునకు జితేంద్రియులగు యోగిపుంగవులకు తక్కిన మానవులెల్లరును లోబడవలసినదే! నాటకమునందలి నాయకుడు కామమునకు లోబడినంత మాత్రమున నతని ధీరోదాత్తతకు భంగమువాటిల్లునను నభిప్రాయము సమీచీనముగాదు. ప్రకృతికనుగుణముగా నా పాత్రము చిత్రింపబడినదని భావించుటయే సమంజసము. అట్టి యథార్థచిత్రణమే మనోహరముగనుండి, పాఠకునియొక్కయు సామాజికుల యొక్కయు విశ్వాసమును బడయగలదు.

ప్రస్తుతోద్దిష్ట శాకుంతలమున దుష్యంత పాత్రమును యథార్థముగ చిత్రించుటయందు కవి యెంతవరకు కృతకృత్యుడైనాడను విషయమిచట విమృష్టము. "బలవ దపి శిక్షితానా మాత్మ న్యప్రత్యయమ్ చేతః" అను మానవ సహజమగు మనస్సంకోచముతోనే తన కావ్యమును ప్రారంభించినాడు కాళిదాసు.

వాంఛా రహితమై మృగయాసక్తమైన చిత్తముతో శాంతమగు కణ్వాశ్రమ సమీపమున ప్రవేశించినాడు దుష్యంతుడు. సహజమగు వేటయందలి తమకము దానికి దోహదము ముందు పరుగిడు మృగమునందు నిలుపబడిన నిశ్చల లక్ష్యము—యీ రెండు నాతని తన్మయుని గావించినవి. రథ గమనమునుగూడ గ్రహించు స్థితిలో లేడు. "కష్టమనుపతత ఏవ మే ప్రయత్న ప్రేక్షణీయస్సంవృత్తోయం మృగః" అని సవిస్మయుడై సారథిని ప్రశ్నించి "ఆయుష్మన్! ఉత్ఖాతి నీభూమి రితి మయారశ్మి సంయమనా ద్రథస్య మందీకృతో వేగః" అను సమాధానమును పొందువరకును రథముయొక్క మందగమనము గ్రహింపని దుష్యంతుని మానసిక ప్రవృత్తి విచిత్రముగా మారిపోయినది.

దుష్యంతపాత్రము నాలుగు పరిస్థితులయందు చిత్రితమైనది. ప్రథమాది తృతీయాంకావసానమువరకును అనురాగము. చతుర్థ పంచమాంకములయందు విస్మృతి. షష్ఠాంకమున విరక్తి. సప్తమాంకమున పునస్సమాగమ సుఖానుభూతి.

ఆశ్రమప్రవేశ సమయమున కలిగిన శుభనిమిత్తమూలమున నిర్మలమైన యాతని మనస్సున "ఆశ" యుదయించినది. పుణ్యాశ్రమ పదముగాన తనయాశకచట తావుండదనుకొనియు "అథవా భవితవ్యానాం ద్వారాణిభవన్తి సర్వత్ర" యని ఆశను విడువజాలకపోయెను. ఉపరోధము లెన్ని గలిగినను ఆశయనునది మానవునియందు సజీవమై యుండును. ఆశయము సంపూర్ణముగ భగ్నమైననేగాని యది నశింపదు. ఈ "ఆశ"యే యీ పాత్రమునకు కొనవఱకును ప్రాణప్రదము. తాపస కన్యకాదర్శనమున దుష్యంతుడనిన"

అహో! మధుర మాసాందర్శనమ్" అను మాటలచే నీయాశాబీజమునకంకురముద్భవించినది. అభిముఖముగానడచియాముగ్ధకన్యకలయవ్యాజసౌందర్యము నీక్షింప మనస్సు తొందరించుచున్నను పరపురుషదర్శనము నలజ్జితలై వెను దిరిగిపోయినచో తనకు చక్షుఃప్రీతి కలుగదను భయమున సాహసింపలేకపోయెను. వెంటనే కాముకతయాతని పాదపసన్నిధికి చేర్చినది. సుందర స్త్రీలను కాముకులు రహస్యముగ వీక్షించిసంతసించుట సామాన్యమే గదా! ఆ సమయమున తన రాజత్వమును విస్మరించి సామాన్యకాముకుడైనాడు దుష్యంతుడు. ఆతన్మయతయందు "అసాధుదర్శిబిలు తత్రభవాన్కాశ్యపః య ఇమా మాశ్రమధర్మేనియుక్తే" యని కులపతిని సైతము నిందించినాడు. పాదపాంతరితుడై విశ్వస్తయగు శకుంతలను నిర్నిమేష చక్షువులతో జూచుచునే యప్రయత్నముగ "ఇయమధికమనోజ్ఞా వల్కలేనాపితన్వీ, కిమివహిమధురాణామ్ మండనమ్ నా కృతీనామ్" అని యామె నిసర్గసౌందర్యము నుపాసింప నారంభించెను.

"యథావనజ్యోత్స్నాఽనురూపేణ పాదపేన సంగతా, అపినామ ఏవ మహమపి ఆత్మనోఽనురూపం వరం లభేయేతి" యను ప్రియంవదావాక్యముల మూలమున నాతనిలోనియాశాంకురము ప్రవృద్ధమైనది. తత్ఫలితముగ "అసంశయమ్ క్షత్ర పరిగ్రహక్షమా" యని నిశ్చయించుకొనినాడు. దర్శన మాత్రముననే యామెను ఆత్మీయగా భావించుట యాతనియందలి దౌర్బల్యము గదా! కావుననే యామె వదనమును స్పృశించు మధుకరము నుద్దేశించి "వయం తత్త్వాన్వేషాన్మధుకర! హతాస్త్వంఖలుకృతీ" యని కామిజన సహజమగు నసూయను వెల్లడించెను.

తనను, తాను, ప్రత్యక్షీకరించుకొనుటకు తరుణమునకై వేచియున్న దుష్యంతునకు "కే అవాం పరిత్రాతుం? దుష్యంత మాక్రంద! రాజరక్షితాని తపోవనాని నామ" అను పరిహాసగర్భిత సఖీజన వాక్యము లాలంబనమైనవి. ఆ వాక్యముల పురస్కరించుకొని, వారియెదుట బడెను గాని "కతమ ణారాజర్షి వంశోఽలంక్రియతే! కతమోవావిరహ పర్యుత్సుకజనః కృతోదేశః" యను, పృచ్ఛ" కథమిదానీ మాత్మానం నివేదయామి? కథంవా ఆత్మాపహారం కరోమి? "అను తర్కములు కలిగించినను యుక్తిచే యః పౌరవేణరాజ్ఞా ధర్మాధికారే నియుక్తః, సోఽహమవిఘ్నక్రియోపలంభాయ ధర్మారణ్యమిద మాయాతః" యని తనరాజభావమును వ్యక్తావ్యక్తముగ తెలుపుకొనెను. కాముకతయాతని స్వరూపమును కప్పిపుచ్చినది. ఒకవేళ తనరాజత్వము బయటబడినచో వారిని నేత్ర పర్వముగ జూచు నవకాశము లభింపదను భయమొకవంక పీడించుచున్నది.

"యద్యత్రాఽద్యతాతః సన్నిహితోభవేత్?" అను నర్మగర్భితవాక్యము "ఆశ"ను రెచ్చగొట్టినది. శకుంతలా జన్మవృత్తాంత మరయుట కనియే పురికొల్పినది. ఆమెయప్సరస్సంభవయని తెలియగనే మరికొంత ముందుకు సాగినాడు. తదనంతర ప్రశ్న "తనకామె లభించునా?" యనునది. ఆ సందియమును గూడ తొలగించుకొనుమని యాశ పురికొల్పినది.

"వైఖానసం మనయా వ్రత మాప్రదానా
ద్వ్యాపారరోధి మదనస్య నిషేవితవ్యమ్
అత్యంత మేవ మదిరేక్షణవల్లభాభి
రాహో ను వత్స్యతి సమం హరిణాంగనాభిః"

యని ప్రశ్నించినాడు. అగాథమైన ప్రశ్న! అసలు వివాహము చేయుదురా? లేదా? వివాహమే చేయుచో నాగరికుని కిత్తురా? ఆశ్రమవాసికా?

"గురోః పున రస్యా అనురూపవరప్రదానే సంకల్పః" అను సమాధాన మతనికి కర్ణపేయమైనది. తనకంటె యనురూపవరు డెచ్చట లభించునని యువ్విళ్లూరి "భవ హృదయ సాభిలాషమ్" అని హృదయమున నుత్సాహము గల్పించుకొనినాడు. అలీకక్రోధమును ప్రదర్శించి ప్రస్థితయైన శకుంతలను అడ్డగింప ప్రయత్నించుచునంతలో తన పరిస్థితి స్మరణకురాగా "అహో

చేష్టాప్రతిరూపికా కామిజనమనోవృత్తిః” అని తన సాహసమునకు నొచ్చుకొనెను.

మృగయాసక్తమై తదితర వాంఛారహితమైన నిర్మలహృదయముతో నాశ్రమమును ప్రవేశించిన దుష్యంతునకు ముగ్ధతాపస కన్యకల యవ్యాజ సౌందర్యముతోడను వారి నర్మగర్భిత స్వేచ్ఛాలాపముల తోడను గూడిన రమణీయ వాతావరణమును కల్పించి యాతని మనః ప్రవృత్తియొక్క క్రమపరిణామమును చక్కగ చిత్రించినాడు కవి. అతని హృదయమున నిక్షేపింపబడిన యాశాబీజము క్రమ విస్తృతిని పొందినది. శకుంతల యాత్మీయ యను భావము గలుగగనే దుష్యంతుడు తన రాజసమును విస్మరించి సామాన్య కాముకుడయ్యెను. కావుననే తాపస కన్యకలనియు, పుణ్యాశ్రమమనియు తలంపకయే అపరిచితలగు నాముగ్ధల యెదుట—

“స్రస్తాంసా వతిమాత్రలోతతలౌ
బాహూ ఘటోత్క్షేపణాత్ ।
అద్యాపి స్తనవేపథుం జనయతి
శ్వాసః ప్రమాణాధికః
బద్ధం కర్ణశిరీషరోధివదనే
ఘర్మాంభసాం జాలకం
బంధే స్రంసిని చైకహస్తయమితాః
పర్యాకులా మూర్ధజాః”

అని యనుచిత రీతిని శకుంతలను వర్ణించెను. ఆతని యందలి కాముకత మిన్నుముట్టినది. వృక్షసేచనమున శకుంతల ఋణపడినదనుమాటల నాతడు సహింపలేక తన యంగుళీయకము నొసగి యామెను ఋణవిముక్తను జేయుటకుగూడ సాహసించెను. తద్ద్వారా తన రాజత్వము నెఱుకపరచుకొనెను. “కథమాత్మానం నివేదయామి?” అను సందిగ్ధావస్థలో జిక్కియున్న దుష్యంతున కీ యుపాయమును స్ఫురింపజేసిన కవి యభినంద్యుడు.

వనగజ వృత్తాంత మాతని యభిలాషమున కడ్డువచ్చినది. “ఆశ” తాత్కాలికముగ మరుగుపరుపబడినది. “మందౌత్సుక్యోఽస్మి నగరగమనం ప్రతి” యనునంతటి దుర్బలత యాతనిలో ప్రవేశించినది. తపోవనమును వదలుటకు మనసొప్పలేదు.

ఏకాంత ప్రదేశమున కూర్చుండి—

“స్నిగ్ధం వీక్షిత మన్యతోఽపినయనే
యత్ప్రేరయంత్యాతయా
యాతం యచ్చ నితంబయోర్గురు
తయా మందం విలాసాదివ
మాగా ఇత్యుపరుద్ధయా యదపిసా
సాసూయ ముక్తాసఖీ.

సర్వం తత్కిలమత్పరాయణమ్” అని యామె చేష్టలన్నియు తనయం దనురాగమును సూచించునవే యని తన కనుగుణముగ నన్వయించుకొని తన వెఱ్ఱి యూహలను తలచుకొనుచు—

“ఏవ మాత్మాభిప్రాయ సంభావి తేష్టజనచిత్తవృత్తిః ప్రార్థయితా జనో విడంబ్యతే” యని తన్ను తాను పరిహసించుకొని—

“అహో! కామీస్వతాంపశ్యతి” యని నిట్టూర్పు విడచెను.

వేటయందలి యుత్సాహము దుష్యంతునకు నశించినది. “మమాఽపి కాశ్యపసుతా మనుస్మృత్య మృగయావిక్లబం చేతః” అను నతని పలుకులే యిందుకు నిదర్శనములు. కడకు తన నిరుత్సాహమునకు విదూషకుని కారణభూతునిగా నొనర్చి “మన్దోత్సాహః కృతోఽస్మి మృగయాపవాదినా మాఠవ్యేన” యని తాను తప్పించుకొనుటలోని చాకచక్యమును గమనింపుడు! నిజమునకు విదూషకుడు నిమిత్తమాత్రుడు. నిజవృత్తాంతమును కప్పిపుచ్చుట కాతనియందలి భయమే కారణము.

“చపలోఽయంవటుః; కదాచిదస్మత్ప్రార్థనామన్తః పురేభ్యః కథయేత్” అను దుష్యంత వాక్యము లాతని భయమును విస్పష్టపరచుచున్నవి.

వసుమతీదేవి యనిన దుష్యంతునికి తగని భయము. పష్ఠాంకమున శకుంతలాచిత్రమును దర్శించు

సమయమున వసుమతీదేవి రాకను వినగనే దుష్యంతుడు భయాక్రాంతు డయ్యెను. ఆ రహస్య మామెకు తెలిసిన దుష్యంతుని కేమి కష్టమును కలిగించునో! సవతియనిన స్త్రీల కసూయ సహజముగదా! చిత్రఫలకరక్షణమున కుపాయముతోచక కర్తవ్యతా విమూఢుడైన దుష్యంతుని వద్దనుండి దానిని గ్రహించి "యదిభవా నన్తఃపుర కాలకూటాన్ముచ్యతే, తతోమాం మేఘప్రతిచ్ఛన్దే ప్రాసాదేశబ్దయ" యని పరుగిడిన విదూషకుని జూచినచో దుష్యంతుని భయాక్రాంత హృదయ మర్థమగును. వసుమతీదేవి మరలిపోయినదని ప్రతీహారి చెప్పగా దుష్యంతుని మనస్సు కుదుటబడినది. అతని యన్తఃపురమున నొక "కాలకూటము"ను సృష్టించుటలో నాతని చిత్తవృత్తిని ప్రదర్శించుటయే కవి యభిమతము. అంతవరకు చిత్రఫలక గతమగు శకుంతలా రూపమునందు లగ్నమై బాహ్యప్రపంచమును విస్మరించియున్న యాతని హృదయమున వసుమతీ దేవ్యాగమన వార్త ఒక్కమారుగ తుపానును చెలరేపినది.

"చపలుడగు విదూషకుడు, జరిగిన వృత్తాంతమును యథాతథముగా నాయన్తః పురకాలకూటమున కందించినచో నెంతటి యుపద్రవము కలుగునో!"యని యాలోచించియే దుష్యంతుడు విదూషకుని లాలించి "వయస్య! ఋషిగౌరవా దాశ్రమంగచ్ఛామి. నఖిలు సత్యమేవ తాపసకన్యకాయామ్ శకుంతలా యామ్ మమాభిలాషః

క్వవయం; క్వపరోక్షమన్మథో
మృగశాబైస్సమ మేధితో జనః
పరిహాస విజల్పితం సఖే పర
మార్థేన న గృహ్యతామ్ వచః."

అని కాముక జనోచితమగు నసత్యమును పలికి శకుంతలా వృత్తాంతమును విస్మరింపజేసినాడు. ఈ యసత్యమే యీ పాత్రమునకు మానుష భావమును కల్పించుచున్నది.

దుష్యంతునకు విదూషకు డొక యాంతరంగిక కార్యదర్శి. తన రహస్యములను హృద్గత భావములను విదూషకునితో చెప్పుకొని యాతని సహాయము నపేక్షించుట దుష్యంతున కలవాటు. పంచమాంకమున హంసపదికయొక్క గీతమును వినగనే దుష్యంతుడు మందస్మితముతో "సకృత్కృత ప్రణయోఽయంజనః; తదస్యా దేవీం వసుమతీ మంతరేణ మహదుపాలంభనంగతోఽస్మి. సఖే! మాఠవ్య! మద్వచనాదుచ్యతాం హంసపదికా నిపుణ ముపాలబ్ధోఽస్మీతి" యని విదూషకునితో ననిన మాటలే యా ఆంతరంగికతను నిరూపించుచున్నవి.

శకుంతలకు తనయందు అనురాగమున్నట్లు విదూషకునితో చెప్పి "చింతయతావత్కేనాపదేశేన పునరాశ్రమపదం గచ్ఛామః" అని యతని సలహో నడుగగా—

నహి లఘు పరిత్రాయతా మేనాంభవాన్;
మాకస్యాపి తపస్విన ఇఙ్గుదీ తైలచిక్కణశీర్ష స్య హస్తే పతిష్యతి"

"ననుఖిలు దృష్టమాత్రస్య తవాంకమారోహతి?" "తే నహి గృహీతపాథేయోభవ! కృతంత్వయోఽపవనంతపోవనమితిప్రేక్షే" అని విదూషకుడనిన పరిహాస వాక్యములు దుష్యంతున కుత్సాహజనకములైనవి. మోదకఖాదనరతుడును, చపలుడునగు వటువుతనను పరిహసించుచుండెనని దుష్యంతుడు క్రుద్ధుడయ్యెనా? లేదు! ప్రియావిషయిక రహస్యముల దెలుపుకొని యాంతరంగిక స్నేహితుని పరిహాస వాక్యముల విని సంతసించుట కాముక లక్షణము.

పునరాశ్రమప్రవేశమున కుపాయము నన్వేషించు దుష్యంతునకు ఋషికుమారుల యాహ్వానమనుకూలించినది. కాని "పానకములోని పుడక"వలె కరభకుడు దేవ్యాజ్ఞను వినిపించినాడు. దుష్యంతుని మనస్సు వికలమైనది.

"ఇతస్తపస్వికార్యమ్' ఇతోగురు జనాఽజ్ఞా ద్వయమప్యనతిక్రమణీయం. కిమత్ర ప్రతివిధేయమ్" అని

ద్వైధీభావమును పొందిన దాతని హృదయము. విదూషక సహితముగ పరివారమునంతయు రాజధాని కంపి నాయకుని యొంటరిగ నాశ్రమమును చేర్చుట కరభక వృత్తాంతమువలని ప్రయోజనమని స్థూలదృష్టికి గోచరించును.

"ప్రథమమ్ శకుంతలాదర్శనే కుతూహలమ్ సపరివాహమాసీత్; ఇదానీ రాక్షస వృత్తాంతేనబిన్దురపినావశేషితః" అని రాక్షస వృత్తాంతమున విదూషకుడు భయభ్రాంతుడయ్యెను. వసుమతీదేవిరాక విన గనే పరుగిడి దాగుకొనిన విదూషకుడు రాక్షస వృత్తాంతమునకు జడియుట యాశ్చర్యమా? ఈ మిష తోడనే యాతని సపరివారునిగ రాజధానికి జేర్ప నవకాశముండగా కరభక వృత్తాంతమును సృష్టించుటలో గల ప్రయోజనమేమి? కవి వృథా సృష్టి గావించునా? లేదు. దానివలన నొక మహత్తరమైన ప్రయోజనము గలదు.

దుష్యంతుని చిత్తవృత్తికి కరభక ప్రవేశమొక యగ్నిపరీక్ష. వివృత మదనయుగాక సంవృత మదనయుగాక సందేహకారిణియై, అనాఘ్రాత పుష్పమై తన యవ్యాజసౌందర్యము చేనాశ్రమమునంతయు కాంతిమంతముగ జేయు శకుంతలయొక్క రూప మాతని శరీరమునందలి ప్రత్యణువునందును ప్రతిబింబించుచున్నది. ఆ సౌందర్యము ననుభవించుట కాతని హృదయ మారాటపడుచుండెను. అందుల కనువైన యవకాశమును ఋషి కుమారులు కల్పించినారు. అట్టి యమూల్యావకాశమును జారవిడిచిన యిక శకుంతలను చూచుట దుర్లభము. ఆమె యొకానొక "ఇంగుదీ తైల చిక్కణశీర్షః"గు తపస్విచే జిక్కినచో తనకు పరస్త్రీయగును. కాలవిలంబనమును సహింపక యాశ్రమమునకు బయలుదేరనున్న దుష్యంతునకు కరభకుడుచిత్తసంక్షోభమును కలిగించెను. కామికిసహజముగు ఉపాయాన్వేషణతత్పరత యాతనిలో ప్రవేశించినది. గురుజనాజ్ఞనైన యుల్లంఘింపగలడు గాని శకుంతలాదర్శనమును వదలజాలడు. ఇష్టి విఘ్ననివారణ మప్రధానముగను శకుంతలాదర్శనము ప్రధానముగను నాతనిలో భాసించినది. ఆకర్షణమునకు లోనైన యాతనికి ఉపాయము వెంటనే స్ఫురించినది—

"సఖే! త్వమంబయా పుత్ర ఇతి ప్రతిగృహీతః; అతోభవానితః ప్రతినివృత్యమాంతపస్వి కార్యవ్యగ్రమానసమావేద్య తత్ర భవతీనాం పుత్రకృత్యమనుష్ఠాతుమర్హతి" అను నుపాయముచే తప్పించుకొనినాడు. ఈ యుపాయముచే "గురుజనాజ్ఞాపాలనము" "శకుంతలాదర్శనావకాశము" సపరివారవిదూషక ప్రస్థానము" అను మూడుకార్యము లొకేసమయమున సాధింపబడినవి. పంచమాంకమున దుష్యంతునికి శకుంతలయందు గాన్పించిన "ప్రత్యుత్పన్నమతి"యనునది, యీ ఘట్టమున నాతనియందే మనకు కాన్పించుచున్నది.

గురుజనాజ్ఞను తప్పించుకొనుట కుపాయమన్వేషించినాడు గాని ఋషికుమారాహ్వానమును తప్పించుకొని గురుజనాజ్ఞాపాలనమున కుపాయ మరయ ప్రయత్నింపలేదు. కారణ మాశ్రమ మందలి యాకర్షణమే! మనస్సు దుర్బలమైపోయినది. అది యేవంకకు లాగిన నావంక కాతని పాదములు ప్రసరించినవి. ఉపాయ మప్రయత్నముగ స్ఫురించినది. కావున కరభకవృత్తాంత మాతని మనోదౌర్బల్యమును ప్రదర్శించుటలేదా? అందులకే కవి దాని నుద్దేశించి సృష్టించినాడు.

"జానే తపసోవీర్యం సాబాలా
పరవతీతి మే విదితమ్
న చ నిమ్నాదివ సలిలమ్
నివర్తతే మే తతో హృదయమ్."

అనునది విరహాకాతరుడైన దుష్యంతునివాక్కు. తపోధనుడగు కణ్వుని దుహితయే గాకున్నచో శకుంతల విషయమున విదూషకుడొసగిన "తేనహి లఘు పరిత్రాయతా మేనాం భవాన్" అను సలహా ననుసరించియే యుండును దుష్యంతుడు. తపోధనులయందు సూక్ష్మమును దాహాత్మకమును నగు తేజము గలదని భయపడియే

యాతడు మిన్నకుండెను. అయినను తన ప్రయత్నము నుండి విరమించినాడా? లేదు. "ఆశ" పీడించుచునే యున్నదిగదా?

"కిం నుఖలు మే ప్రియాదర్శనా దృతే శరణ మన్యత్" అని తన ధీరతనుకోల్పోయి యామె నన్వేషింపబయలుదేరినాడు. దుష్యంతు నంతటి మహారాజునకు, ఉగ్రాతప వేళయందు ఏకాకియు, పాదచారియునై మాలినీతీరమున, మండుటిసుకయందు పాదములు బొబ్బలెక్క ప్రతిపొదయందును వెదకవలసినట్టి యవస్థ కల్పించినది కామమేగదా! ప్రజలనందరను తనదర్శనమునకు రప్పించుకొను శాసకుడొక తాపసకన్యకా సౌందర్యమును నురుల దగుల్కొని ఆమెకొఱకు గ్రీష్మ మధ్యాహ్న సమయమున వెదుకవలసిన దైన్యమునకు పాల్పడుట కాముకతయొక్క మాహాత్మ్యమే?

కడకు వేతస పరిక్షిప్తలతా మండపమున శకుంతలను దర్శించి యా తరుణమునుమించి పోనీయక ఎదుటబడి "ఆవయోః ప్రియసఖీత్వా ముద్దిశ్యేద మవస్థాంతరం భగవతా మదనే నారోపితా; తదర్హ స్యభ్యుపపత్త్యా జీవిత మస్యా అవలంబితుమ్" అని ప్రియంవద యనుటయే తడవుగ "సర్వథాఽనుగృహీతోఽస్మి" యని మాటకుమాట కలిపి—

"పరిగ్రహబహుత్వేపి
ద్వే ప్రతిష్ఠే కులస్య మే,
సముద్రరశనాచోర్వీ
సఖీచ యువయో రియమ్."

అను వాగ్దానమును గూడ చేసినాడు. దీనినిబట్టి యాతని యాతురతను గ్రహింపవచ్చును.

"ననుస రాజర్షి రస్యాం స్నిగ్ధదృష్ట్యా సూచితాభిలాషః ఇమానిదివసాని ప్రజాగరకృశో లక్ష్యతే" యని ప్రియంవద యనినపుడే దుష్యంతుడు తన శరీరమును చూచుకొని "సత్య మిత్థం భూత ఏ వాస్మి" అని తాను కృశించిపోవుటను తెలిసికొనినాడు. అట్టి మైమఱపుగల్గిన దాతనికి.

"అంకేనిధాయకరభోరు! యథాసుఖం తే
సం వాహయామి చరణా వుత పద్మతామ్రా"

అను నవి దుష్యంతుని నోటినుండి వెలువడవలసిన మాటలేనా? తన వివేకమును, రాజభావమును మరచి అపరిచితయగు సామాన్యబాలికకు పాదములొత్త సిద్ధమగుట గర్హ్యము గదా! "న మాన నీయే ష్వాత్మానమపరాధయిష్యామి" అని శకుంతలయే యాతనివారించినది. మదనసంతప్తయయ్యును ఆమె జూపిన యుక్తాయుక్తజ్ఞత దుష్యంతునకు లేకుండుట శోచనీయము.

గౌతమిరాక తెలియగనే మహాపరాధము చేసినవానివలె—మంచముక్రింద దూరు విటునిరీతిని—విటపాంతరితుడై లతలను పైన గప్పికొని దాగికొని శకుంతలా సహితయై యామె నిష్క్రమింపగనే బహిర్గతుడై శూన్యలతామండపమును, గాంచి యుష్ణనిశ్వాసమును విడిచి యతికష్టముతో నాచోటును వదలెను.

కణ్వునియసాన్నిధ్యమున శకుంతలను గాంధర్వ విధిని వివాహమాడుటకు బదులు కణ్వునే యడిగి బహిరంగముగ నామెను పొందుట కాతడు సాహసింపలేదు. కావుననే యిట్టి తనయొక్క రహస్య వ్యాపారమున కాతడు కోపించి శపించునేమో యని భయపడెను. రథాధిరూఢుడై రాజచిహ్నములతో ప్రథమాంకమున ప్రవేశించిన దుష్యంతుడు కణ్వాగమనమునకు పూర్వమే, ఏకాకియై, ముచ్చువలె యాశ్రమమును బాసి రాజధానికిఁ జేరవలసివచ్చినది.

దుర్వాసునిశాపము, అంగుళీయక వృత్తాంతము అనునవి కథా విస్తృతికొఱకును, శృంగార రసపుష్టి కొఱకును నాటకమున ననుసంధింపబడినవి. "లోకాపవాదభీతిచే బుద్ధిపూర్వకముగ భార్యా పరిత్యాగమొనరింప సాహసించె" నను కళంకము దుష్యంతునకు కలుగకుండుటకై పై రెండును కల్పింపబడె ననుట సమంజసముగాదు. మూలము ననుసరింపనినాడు కవి - నిరంకుశుడుగాన-యేమార్గమునైన త్రొక్కవచ్చును.

కవి దుష్యంతుని యాదర్శవ్యక్తిగనే ప్రదర్శింపదలచి యుండినచో నింత కథా విస్తృతి యనవసరము. అగ్నిశరణ ప్రవిష్టుడై—

"* దుష్యంతే నాహితం తేజో దధానాం భూతయే భువః అవేహి తనయాం బ్రహ్మన్నగ్నిగర్భాం శమీమివ." అను శరీరాధారము లేని ఛందోమయవాక్కును వినగలిగిన సిద్ధపురుషుడగు కణ్వుడే తన కుమార్తెను తోడ్కొనిపోయి, జరిగిన వృత్తాంతమును ప్రకటించి, ఆశీస్సులతోపాటు - శకుంతల నప్పగించినట్లు వ్రాసియున్నచో దుష్యంతుడు లోకాపవాదమునుండియు, భార్యాపరిత్యాగరూప కళంకమునుండియు విముక్తుడై యాదర్శప్రాయుడగునుగదా! అట్లు చేసినచో చతుర్థాంకముతోనే నాటకము సమాప్తమయ్యెడిది. కవిగూడ కథా విస్తృతి కొఱకు పరిశ్రమజేయ నవసరమేర్పడెడిదిగాదు. "సూక్ష్మములో మోక్షము" లభించుపద్ధతినివదలి మూడంకముల కథను పెంచుట దుష్యంతుని కేవల మాదర్శ వ్యక్తినిగా చూపుటకొఱకేయనుట భావ్యముగాదు. కథావిస్తృతివలన సాధింపబడిన ప్రయోజనము వేరు.

చతుర్థాంకముననే నాయికానాయకుల నేకము చేసినచో రసము కుంటువడుటయే గాక నాటకము సామాజికుల యభిరుచిని పొందజాలదు. తృతీయాంకమువరకు నభివర్ణితమైన శృంగారము సంభోగప్రధానము మాత్రమే. అది రసమున నొక భాగము. విప్రలంభము లేనిచో నది పరిపుష్టము కానేరదు. సంభోగ విప్రలంభముల కలయికయే శృంగార రసమున కఖండ స్వరూపమును ప్రసాదించును. చతుర్థాంకముతోనే నాటకము సమాప్తమైనచో విప్రలంభమున కవకాశము లేదు. తద్ద్వారా రసము చెడును. కావున కాళిదాసు పై వృత్తాంతములను రసపుష్టికొరకు కల్పించినాడు గాని ఆదర్శీకరణము నుద్దేశించి కాదు.

నాయకుని యాదర్శపురుషునిగనే ప్రదర్శించుట కవి యభిమతమైనచో పంచమాంకమున—

"మూర్ఛన్త్యమీ వికారాః
అని శార్ఙ్గరవునిచేతను—

"అనార్య! ఆత్మనో హృదయానుమానేన ప్రేక్షసే—క ఇదానీమన్యోధర్మకంచుకప్రవేశిన స్తృణచ్ఛన్నకూపోపమస్య తవానుకృతిం ప్రతిపత్స్యతే"

"అస్య పురువంశే ప్రత్యయేన ముఖమధో హృదయస్థిత విషస్య హస్తాభ్యాశము పగతా" "కథ మనేనకితవేన విప్రలబ్ధాస్మి" అని శకుంతల చేతను దూషింపజేసి యుండడు. ఇట్టి దూషణములు నాయకుని ఆదర్శప్రాయు నొనర్చునా? ఒకానొకమహారాజు నాతని భార్యచే నాతని యెదుటనే "అనార్యు డనియు, తృణచ్ఛన్నకూపోపము డనియు, పయోముఖవిషకుంభ మనియు, కితవు డ"నియు దూషింపజేయుట యాదర్శీకరణ మనిపించుకొనునా? "విశేషేణాఽధిక్షిప్తోఽస్మి" యని దుష్యంతుడే యా నిందావాక్యముల విని పరితపించినాడు. ప్రపంచమున భర్తృతిరస్కృత యగు వనిత, కోపోద్రేకమున తన పతిని నిందించుట సామాన్యము— అట్టి పరిస్థితినే దుష్యంతునియందు కవి వ్యక్తీకరించినాడు.

శకుంతలా విషయిక విస్మృతి దుష్యంతునకు సంపూర్ణముగా లేదు— అవ్యక్తస్మృతిగలదు. కావుననే హంసపదికాగీత మాతని కలవరపరచినది. "కింను ఖలు గీతార్థమాకర్ణ్యేష్ట జనవిరహాదృతేపి బలవదుత్కంఠితోఽస్మి" అను నాతని మాటలే యిందుకు ప్రమాణములు.

సంపూర్ణవిస్మృతియే యుండినచో తాను పరకళత్రమని శంకించిన శకుంతలను పురోహితునియింట చేర్చుట కంగీకరించి యుండడు. తనభార్యకానపుడామెను ఆటంకపరచుట యధర్మముగదా! ప్రథమాంకమున నిక్షిప్తమైన యాశాబీజము క్రమవృద్ధిని పొంది తృతీయాంకాంతమున "అహో! విఘ్నవత్యః ప్రార్థితార్థసిద్ధయః" అనుదుష్యంతుని మాటలో తాత్కాలిక

ముగ గుప్తమై మరల పంచమాంకమున "సందిగ్ధబుద్ధిం మాంకుర్వన్నకైతవ ఇవాస్యాఃకోపో లక్ష్యతే" అను దుష్యంతునియందు మరల పొడసూపినది. తపోధనులమధ్యనుండు నా సౌందర్యరాశిని వీడవలదని యాశ ఒత్తిడి చేసినది.

"అత్రభవతీ ఆప్రసవా దస్మద్గృహేతిష్ఠతు. త్వంసాధుభిరుద్దిష్టః ప్రథమ మేవ చక్రవర్తినం పుత్రం జనయిష్యసీతి — సచేన్మునిదౌహిత్ర స్తల్లక్షణోపపన్నో భవిష్యతి, అభినన్ద్య శుద్ధాంతమేనాం ప్రవేశయిష్యసి" అను పురోహితుని యుపదేశమునకు లొంగిపోయినాడు దుష్యంతుడు. ఆమెను తానిది వరలో పరిగ్రహింపలేదని తానే చెప్పుచు, చక్రవర్తి లక్షణుడగు పుత్రు నామె ప్రసవించినంత మాత్రమున భార్యగా పరిగ్రహించుటయు లేకున్న నెడల నడచుటయా? ఏమి ధర్మజ్ఞత! తన భార్యకాదని యనుచు నెట్లు పరిగ్రహింపగలడు? "అనిర్వర్ణనీయమ్ పరకళత్రమ్" అనిన దుష్యంతున కిపుడు పరదారా పరిగ్రహప్రత్యవాయము కలుగదుగాబోలు! ఇంతకు నాతడేమి చేయగలడు? ఆశ, కాముకతయనునవి యాతని నాడించుచున్నవి! వానికి దాసోహమనినాడు. పరదారయని తాను భావించిన స్త్రీని యొకానొక మిషచే తన శుద్ధాంతమున జేర్ప నంగీకరించుట యాతనియందలి మనోదుర్బలతవలన గలిగిన దోషము గదా! ఆతని యాదర్శపురుషునిగనే ప్రదర్శింపదలచినచో నిట్టి దోషమున కాతనియందు కవితావొసగునా? ఇట్టి లోపము ప్రయత్నపూర్వకముగనే యా పాత్రమునందు సృష్టింపబడినది.

అంగులీయ దర్శన ప్రభృతి ప్రియాపరిత్యాగము వలన గలిగిన దుఃఖముచే ధర్మాసన మధిష్ఠించి రాజకార్యముల నిర్వర్తింప నసమర్థుడైనాడు దుష్యంతుడు. క్రమముగా నైహిక సౌఖ్యములయెడ విరక్తి పొడమినది. తత్ఫలితముగ వసంతోత్సవము నిషిద్ధమైనది. సౌందర్యవతులగు బహు భార్యలగల్గియు, బహుమానగర్వితయగు వసుమతీదేవికి వెఱచుచున్నను, చిత్రఫలక మూలమున శకుంతలా సౌందర్యము నుపాసించుట మానలేదు. ఆ యుపాసనవలన నున్మత్తత ప్రాప్తించినది. చిత్రఫలకము నందలి మధుకరముపై

"బింబాధరం స్పృశసిచే ద్భ్రమర ప్రియాయా స్త్వాం కారయామి కమలోదరబన్ధనస్థం" అని తన శాసనమును ప్రయోగింపజూచుట యున్మత్తతగాదా? సార్థవాహ వృత్తాంతము తనయనపత్యతను స్మరింపజేసినది. అనపత్యుడగు తన జీవితము వ్యర్థమని భావించెను.

"అహో! దుష్యన్తస్య సంశయ మారూఢాః పిండభాజః" అని వాపోయి మూర్ఛనొందెను. కనసము వంశాభివృద్ధిని, పితరులను సంస్మరించిదియైన శకుంతలను గ్రహింపజాలని తన యవివేకమునకు పశ్చాత్తప్తుడై "ధిఙ్మాముపస్థిత శ్రేయోవమానినమ్" అని తనను తాను నిందించుకొని, శకుంతలను స్మరించుచునే మరణోద్యుక్తు డయ్యెను. నశ్వరమగు నొకానొక తాపస కన్యకా శరీర సౌందర్యము దుష్యంతునంతటి ధీరపురుషుని ప్రజాగరకృశునిజేసి యాత్మహత్యకు పురికొల్పినది.

ప్రథమాంకమున మృగయాసక్త హృదయుడై నిర్వికారచేతముతో శాంతమగు కణ్వాశ్రమమును ప్రవేశించినట్లు సప్తమాంకమున ప్రియా విరహరూపమైన విచారము నాకాశయానమున మరచి ప్రశాంతమగు మారీచాశ్రమమును ప్రవేశించినాడు దుష్యంతుడు. శుభనిమిత్తము మరల పొడసూపినది. గుప్తమైన "ఆశ" మరల రేకెత్తినది. ప్రథమాంకమునందువలె కాముకతతో గూడిన ఆశగా దిప్పుడు. విరాగమునందు జనించిన "ఆశ" తిరస్కృతయైన యా సౌందర్యఖని మరల లభించునా? యను సందియము పొడమినను ఆశాచోదితుడై ఆశ్రమము వైపునకే నడచినాడు. సర్వదమనదర్శనమున గలిగిన — "మహతస్తేజసోబీజం బాలోఽయం ప్రతిభాతి మే" అను భావము, భావిపునస్సగామసుఖానుభూతికి మొదటి మెట్టు.

బాలునిగాత్ర సంసర్గమున నొడలు పులకరించినది. తన యనపత్యతను మరచి బాలుని ముద్దాడెను. చక్రవర్తి లక్షణ లక్షితమగు బాలుని హస్తము ద్వితీయసోపానము. ఇరువురి యాకృతియు నొకే విధముగా నుండుట మూడవమెట్టు. సర్వదమనుని వృత్తాంతము తనను నిర్దేశించుట నాల్గవది. "శకున్తలావణ్యం ప్రేక్షస్వ" యను తాపసీవాక్యమునందలి నామసాదృశ్య మైదవసోపానము. రక్షాకరణ్డక వృత్తాంతమాఱవది. "ఆశా" వృక్షము క్రమముగా చిగిర్చి పుష్పించినది. విరక్తి యను మంచుతెర వదలినది.

"మమాపితాతో దుష్యంతః— నత్వమ్" అను బాలుని ముద్దుపలుకులకు ముగ్ధుడైనాడు దుష్యంతుడు. ఏకవేణీధారిణియై దుస్సహావిరహవ్రత దీక్షితయై దర్శనమొసంగిన శకుంతల మూలమున ఆశా వృక్షము ఫలించినది. అనిర్వాచ్యమగు పునస్సమాగమ సుఖానుభూతి యాతని సర్వాంగముల నవశము గావించినది. కంఠము బాష్పరుద్ధమైనది. పశ్చాత్తాపాగ్ని హృదయకలుషమును దహించి యాతని పునీతుని జేసినది. పారవశ్యమున నామె తన భార్యయను భావమును వదలియామె పాదములంబడి యగాధ హృదయమునుండి బహిర్గతమైన దుఃఖానంద సమ్మిశ్రిత బాష్ప వారిచే తత్పాదముల గడిగి యామె క్షమాభిక్ష నర్థించినాడు. అంతులేని పూర్వగాథను చెప్పుకొని హృదయభార మపనయించుకొనినాడు దుష్యంతుడు.

దుష్యంతుని కాముకత, ఆశ, సౌందర్యపిపాస, భయము మొదలగు చిత్తవృత్తులన్ని రమ్యముగా నిట ప్రదర్శింపబడినవి. మానవ జీవితమున నెట్టి సంఘటనల యందు మనోదౌర్బల్య మెట్టి పరివర్తనము గలుగ జేయునో అట్టి క్రమపరిణామమును దుష్యంతుని యందు వ్యక్తీకరించినాడనుట సత్యదూరముగాదు. ఒకానొక యాదర్శమును నిరూపించుటకే పాత్రము సృష్టింపబడినదనుట కాధారము కాన్పింపదు. నాయకుని జీవితమును యథార్థముగ చిత్రించుటయే కాళిదాసు యాశయ మనక తప్పదు. సామాన్యమానవుని యందుండదగిన లోపము లన్నియు నాతనియందు వ్యక్తీకరించుట యథార్థ చిత్రణముకొఱకే!



# నుగువాణి

## శ్రీభాస్కరాచార్య రామచంద్రస్వామి

నియతివశమునఁ బేదయై నిజదరిద్ర
ప్రజ యొకం డిచ్చు నన్నమాత్రమునఁ దనిసి
పూర్వసంపత్స్మృతిఁ మిపుల్ పొగులు విభుని
విధము దలఁపించు నేఁటి నా వేదభూమి!

తాఁటియాకుల యా పురాతనఁపు శాల
రాజవరుని మొదల్ పరివ్రాట్టుదాఁక
నెందఱో చొచ్చి మరలినా రెయ్యెడకునో
అందఱకు ధర్మశాల యీ యార్యగృహము!

విశ్వమానవసౌందర్యవిధముఁ దెలుపు
మతనిదానుల నెత్తె నా మాతృభూమి?

సర్వమతముల కెడమిచ్చి- స్వమత మెఱిఁగి
మానవతఁ బంచిపెట్టె నా మాతృభూమి!

తేనెతెరలు ఫలించు మాగానులందు
తేనెమాగాణి మా తేటతెనుఁగు రాణి!

ప్రక్కపల్లెలవారిఁ గాకెక్కఁజేయు
తేనెమాగాణి మా తెలంగాణవాణి!

విశ్వపురుషుని సంకల్పవిధముఁ దెలుపు
విశ్వనాదము నెఱిఁగిన వేదవాణి!

దేశభాషల- ఆంధ్రి ఆదిమపురంధ్రి
తీఁపిపలుకుల రాణి! మా తెనుఁగువాణి!

(యాత్రికుడు)

# నవ్యసాహిత్యంలో దీ యిదీ



= శ్రీ వడ్డాది శ్రీరామచంద్రమూర్తి =

నవ్యసాహిత్యం సుహృద్భావ సమీక్ష లేకపోవడం చేత నిందాజనిత మవుతూ వస్తోంది. తిక్కయజ్వ కాలమునుంచి కృష్ణదేవరాయలకాలంవరకు గలసాహిత్య మును పరీక్షిస్తే అది కృష్ణదేవరాయల కాలంనుంచి వీరేశలింగం పంతులు గురజాడ అప్పారావు పంతులు గార్ల వరకువచ్చిన సాహిత్యము కన్న భిన్నమైన రుచులు చూపిస్తుంది.

సాహిత్యంలో ఆర్యభాషాసాంప్రదాయాలూ, వారి లక్షణశాస్త్రాలూ, అవి ఏర్పరిచిన పడికట్లు తప్పకుండా అష్టాదశవర్ణనలు, చతుర్విధనాయకులూ అష్టవిధనాయికలూ మొదలయిన వాటితోనూ, శబ్దాది అలంకారాలతోను నిండి అంతాకాకపోయినా చాల వరకు 'నిర్జీవమైన శిల్పమే ప్రధానము గాగలది పురాణసాహిత్యం. అందులోనే జంగం కథలూ, స్త్రీలపాటలు పదాలూ, తుమ్మెదపదములు, ప్రభాత పదములు, పర్వతపదములు పండిత పామరజనులకు పరమానందం కలిగిస్తూ జీవము కలిగి వుంటాయి. నోరి నరసింహశాస్త్రిగారు వ్రాసినట్లు "రెండు సంప్ర దాయాలూ ప్రత్యేకముగా వస్తూ ఉన్నవి. ఒకటి శిల్ప ప్రధానమైనది. ఇంకొకటి జీవప్రధానమైనది. శిల్ప మున్న దానిలో జీవము తక్కువ జీవమున్న దానిలో శిల్పము తక్కువ",

ప్రబంధయుగము పూర్వయుగముకంటె భిన్న మార్గములు తొక్కింది. స్వచ్ఛందమైనట్టి అపూర్వమై నట్టి నూతన పద్ధతులు ఆవిర్భవించాయి. పెద్దన్న, తెనాలిరామకృష్ణుడు పింగళిసూరన్న ప్రభృతులు నూతన మార్గదర్శకులయారు. ఆనాటి నవ్యసాహి త్యము ప్రజాదరణపొందింది. కారణం ఆముక్తమాల్యద కర్త దక్షిణదేశమునకేకైకసామ్రాట్టు. ఆనాటి నవ్య సాహిత్యమును సుహృద్భావముతో నాదరించుట చేతనే. ఆముక్తమాల్యద పూర్వయుగసాహిత్య పద్ధతు లకు భిన్నమైన చిందులు తొక్కకపోలేదు. కాని సామ్రాట్టుకలంతొక్కిన చిందులు కనుక ఆనాటి లోకం హర్షించింది. ఆ చిందులను ఆ నాటి కవిలోకం అనుకరించింది. అందుచేత ఆ నాటి నూతన భావాలను ప్రజలు సుహృద్భావముతో వీక్షించి అందలి భావ శబలత భావౌన్నత్యము గ్రహించగలిగారు. కృష్ణ దేవరాయలు హంసకీబదులుగా బాతునువర్ణించినా 'భళీ' అన్నారు. నాటినుండి నేటివరకు అనగా గత నాలుగువందల సంవత్సరములనుంచి ఆంధ్రలోకము ప్రౌఢసమాసకల్పనలకు, శ్లేషకవిత్వమునకు సత్కావ్య రచనారసాయనంబుచకు అనుకవిత్వమునకు అలవాటు పడిపోయింది. శిల్పములోని జీవము అనుకరణమువలన క్రమముగా క్షీణించింది. అనుకరణ అలవాటై పోయింది. జాషువాకవి వ్రాసినట్లు "అనుకరణము నందు తెలుగయ్యలు నమ్మలు దొడ్డ"వారలైనారు. దానితో సారస్వతమందలి యభిలాష-మోజు క్షీణిం చాయి.

నూతన యుగోద్భవము పాశ్చాత్య సంపర్కము వలన అభివృద్ధిపొంది నూతన మార్గముల త్రొక్క నారంభించింది. **H. G. Wells, Victor Hugo, Alfanzo, Dandet, Alexander Dumas; Emi- le zola, Malthus, Marx, Lenin, Bernard**

**Shaw, Romain Roland Motherlinck, Carpents, Ibsen, Gandhi, Tagore,** మొదలయిన వారి వ్రాతలు యువకులంతా పఠించారు. ఉత్సాహవంతులు ముందు కురికి నిస్తేజమైన ఆంధ్ర సారస్వతం గాజు బొమ్మను తిరిగి సర్వసుందరమైన కోమలిగా మార్చుటకు ఆరంభించారు.

తమకలవడిన మార్గములకు భిన్నమార్గముల నవలంబించినవారందరు "ఆధునికులు" "నవీనులు" అయిపోయారు. వారియెడ వారి కవనముయెడ సహృద్భావమేల చూపవలెనో ఏకొద్ది సరసులకో తప్ప మిగిలినవారి కర్థంకాలేదు. అనుకరణ ఎవరో వ్రాసినట్లు ఆగమంగా, అపౌరుషేయంగా భావించిన పండితలోకం, భావగీతాలను అనాచారంగా భావించి హుంకరించింది. కావ్యసృష్టిలోకూడ ఆధునికులకు తదితరులకు కొంత భేదంవుంది. దీనికి ముఖ్యకారణం ప్రక్రియా వైవిధ్యం. పూర్వకవి తన కావ్యమునకు కావలిసిన పరికరములు చాలవరకు అష్టాదశ వర్ణనాదులు, కృతి భర్తల మనస్తత్త్వములు మొదలయిన బాహ్యనియమబద్ధముగుటచేత, బాహ్యసృష్టిలోనుంచి ఒక రస మయాంశాన్ని గ్రహించి దాని నాధారముగా చేసుకొని కావ్యసృష్టిచేశాడు. అందుచేత ఆ కవిత చాలవరకు పరాశ్రయ కవిత్వం. నవ్యకవుల కవిత్వం చాలవరకు ఆత్మాశ్రయరూపం పొందింది. ఇదీ గాక "ప్రాచీన కవితన హృదయసంజనితమైన భావములను కావ్యనాయకుని ముఖస్థంగా పరోక్షంగా వ్యక్తం చేస్తాడు. ఆధునిక కవితానై ప్రత్యక్షంగా స్వీయభావాలను వ్యక్తం చేస్తాడు. రెండోమార్గం రసానుభూతికి ఎక్కువపోషకం. ఏలనన కవి యిందు అంతర్ముఖుడై భావోద్రేకము కలిగినప్పుడు తన భావానికి ఆకారం కలగజేస్తాడు

"నానివాసమ్ము తొలుత గంధర్వలోక, మధుర సుషమా సుధాగాన మంజువాటి ఏ నొక వియోగ గీతికను" అని తనభావము ప్రత్యక్షంగా చెప్పివేస్తాడు.

అందుచేత పరాశ్రయరూపకవిత్వ దృక్పథమున కలవాటుపడినవారు ఆత్మాశ్రయరూప ప్రధానమైన ప్రణయగీతికల "విప్లవము" క్రింద "చీడపురుగు" క్రింద పరిగణిస్తున్నారు.

ప్రకృతిని విధిగావర్ణించితీరాలని, అంటే ఆ వర్ణనవుంచేసేకాని తమ రచనకు శాస్త్రనిర్ణీతమైన కావ్యత్వం సిద్ధించదేమో అనే భయం భావకవులకు లేదు. భావకవి ప్రకృతి తన్ను ఆకర్షించగా తాను దానిలో తాదాత్మ్యం పొందగలిగినప్పుడు అప్పుడే తన కావ్యంలో ఆరాధిస్తాడు.

అందుచేతనే వీరికవిత్వంలో ఒక విధమైన ప్రత్యేక వ్యక్తిత్వము కనబడుతుంది. పద్మావతీ చరణచారణ చక్రవర్తిలో వచింపబడినట్లు "ఏల చేరవలయునే శ్రేణిలోనైన సూక్ష్మదృష్టితోడ చూచునెడల, ప్రతికవీంద్రురచన ప్రత్యేకమైయుండు, కూడునన్నిగతుల కొన్ని యెడల" ఈ ప్రత్యేకతకుగల స్వేచ్ఛయే నవ్యసాహిత్యమును బహుముఖముగా ప్రవహింపజేస్తోంది. పదార్థవాదంతో విద్వేషాలు పెంచుకొంటున్న లోకంలో ఊపిరి సలపక కవులు విశ్రాంతి, స్వేచ్ఛ చైతన్యం, సౌందర్యం ఆశించి ప్రకృతిని ఆశ్రయించారు.

అనుకరణ ఆగమంగా భావించినలోకం హుంకరించిన కొలదీ నవ్యసాహిత్యము బహుముఖంగా ప్రవహిస్తోంది. కొందరు "ఆంధ్రపౌరుషము నుగ్గడించారు. కొందరు "ఆంధ్రుల మహోజ్వలచరిత్రము చావలేదు చావలేదు. హృదయములు చీల్చి చదువుడో సదయులార" అని ప్రబోధించారు. కంకణవిసర్జనకు కాలము కాదన్నారు మరికొందరు. నవ్యగీతికలలో ప్రణయము ప్రకృతి వెలిబుచ్చారు.

అవమతి వచ్చునో ? తెలుగు
టందముఁ జక్కదనంబుమాట మా
ర్దవమును లెక్కచేయవు సదా
పొరుగిండుల పుల్లకూరలో
చవులు వచింతు నీ సహజ
చాపల మూడునె, ఇంగిలీషు చి
ల్కవు వచియింప నేర్తువె బలా!
చిరకాలపు ధామ శబ్దముక్"

# నవ్యసాహిత్యంలో అదీయిదీ

అని మరికొంద రుగ్గడించారు. "గాజుబొమ్మల మెచ్చు కళ్లకు కోమలుల సొరెక్కునా" అని కొందరు నిరసించారు. నల్లమందే కాని కళ్ళిప్పనంటావు. రాతి గుళ్లకే కాని రాను పొమ్మంటావు. సుడిగాలి రేగిందిలే పిడుగు గర్జించింది" అని మరి కొందరు బెదిరించారు. నాస్తికులయారు కొందరు. వారిని నిందించారు కొందరు. ఈవిధంగా బహుముఖంగా వ్యాపించి సర్వాంగీణమైంది నవ్యసాహిత్యము. చాలామంది తమ నర్థము చేసుకొనలేని లోకమును పరిసరములను నిందించారు.

"విస్మృతోదంతములు శూన్యవీధులందు,
నావలెనె మౌనముగవెళి పోవుచున్న
ఓ నిశీథినీ! నీ గభీరోదరమున దొరికె
నీ దురదృష్టవంతునకుచోటు
త్రొక్కినకొలంది కాలితో తొక్కుచున్న,
యీ కఠినలోకమెల్ల బహిష్కృతమ్ము
రండు చిమ్మటలార! ఈ రాత్రివేళ
నావలెనెపాడుకొను మీరేనాకుసఖులు
నేనె మిగిలితి నీగౌతమీనదీ పవిత్ర
గర్భంబులో త్రోతవెట్టుచున్న
యుగయుగాంతర విశ్వమహోగ్రదుఃఖ
జీవగీతాలకావృత్తి చెప్పుకొనగ

ఏడ్పులో శాంతిపొందారు కొందరు. ఆ ఏడ్పునకు లోకము నడ్డమురావద్దన్నారు కొందరు. ంగారాన్ని ప్రబంధకవులవలె భౌతికదృష్టితోనే చూడక ప్రణయానికి స్వచ్ఛత పవిత్రత ఆపాదించారు, చాలామంది.

చెలివలపులేని నీకలిమి కాల్పనె వినుము
వలపుతీగనెజీవ ఫలము కాయునురా
ప్రేమకంటే ఎక్కు వేముందిరా ఎల్లి
కామ్యపదవులకంటె ప్రేమఎక్కువరా
ప్రేమించు సుఖముకై ప్రేమించు ముక్తికై
ప్రేమించు ప్రేమకె ఏమింకవలెనురా?

అన్నారు కొందరు.

శివరాత్రినాటి 'కాటునల్లని కాళరాత్రిలో' మహాదేవుని మహర్నటనము పాడగన్నారు కొందరు. ప్రతిదివసాంతమందు అవధరించు నటరాజుయొక్క నిత్యనూతన తాండవ నృత్యకేళి చూడగలిగారు కొందరు. "వేదసన్నిహితు ఆదిశంకరుని తపస్సమాధిని హుంకరించిన ఓంకారము" పాడగన్నారు కొందరు.

దైనిక జీవితంలో నిత్యం మొద్దుబారిన హృదయాలతో మనము చూచి కరగని దృశ్యాలే నవ్యకవుల చేతులలో హృదయస్పందనం కలగజేసే గీతికలకు ఆధారములైనయి.

రోడ్డుప్రక్కన — కడుపు ఆకలిమంటతోనే, కందికవలినకళ్లతోనే ఏడ్చియేడ్చిన శోషతోనే నిదురపోయేది—మనిషి ఏలే రాజ్యమందే, మనిషి పెంచిన చింతకిందే, మనిషి శిశువే కడుపుచిచ్చుకు మాడి ఏడ్చింది.

"కదలేదీ కదిలించేదీ, మారేదీ మారించేదీ పాడేదీ, పాడించేదీ పెనునిద్దర వదిలించేదీ, మునుముందుకు సాగించేదీ పరిపూర్ణపు బ్రదుకిచ్చేదీ. కావలోయి నవకవనాని"కన్నాడు శ్రీశ్రీ.

నాస్తికత్వం వెలిబుచ్చారు కొందరు:

రాయిరప్పలకి రూపం తెచ్చి, చీకటిగుళ్లో సింగారించీ, అదే పేరుతో ఆరాధిస్తారెన్నో మొక్కులు ఎన్నో పూజలు, సహస్రమిథ్యలు, హృదయం కాల్చే సంతాపంతో ఎందరెందరో ఏడ్చి పిలిచారు ఎన్నో కానుకలు నూడిదపెట్టారు చెక్కిన బొమ్మకు చెవులుంటాయా? కర్కశ శిలలకు కళ్లుంటాయా, మోసం ద్రోహం ఈర్ష్య క్రౌర్యం ఫణాలు చాచిన పాపజగతిలో, మానవశవాల మంటపాలపై ప్రభువులపతాక లెగిరే భువిలో, రాతి విగ్రహం రక్షిస్తుందా! పూజా మంత్రం బువ్వపెడుతుందా? అన్నారు కొందరు.

ఈ నాస్తికత్వం నిందించారు చింతావారు.

"నాగలిపట్టుకు దున్నగలవురా? రాట్నం పెట్టుకు వడకగలవురా? సుత్తెను ఎత్తి కొట్టగలవురా? బాడిత

విసరి చెక్కగలవురా? కాళ్లు చాపుకొని కూచుంటావా? దేవుడు నోటికి అందియ్యాలా? కడిపెడు అన్నం ఒంటికిబట్టా బీదలకంటూ పెట్టగలవురా? దేవుణ్ణెందుకు తిడతావు?

పటపటపళ్ళను కొరకడ మెందుకు? పద్యాల్లో భీభత్సా లెందుకు దేవుడు సుళ్ళను కూల్చాలంటూ పదపదమంటూ పరుగులు వ్యాసుడు పుట్టిన దివ్యభూమిలో దేవుడు లేడనుమాట ఎందుకు పుట్టైనా? కృష్ణుడు రాసక్రీడలు సల్పినదేశములోనే దేవుడు లేడుట శివతాండవ సుక్షేత్రములో నా దేవునిపై అపనిందలు రామమోహనుడు, రామకృష్ణుడూ మొన్న మొన్ననే వాసంజేసిన పుణ్యభూమిలో దేవుడులేదని పుట్టిందా యీ దారుణవాక్యం మహర్షులింకా యింతో అంతో యింకా దేశంలోపల తిరుగుచుండగా దేవుడు లేడా నవ్యకవీ? అని వారి నెదుర్కొన్నారు కొందరు.

తమ చిట్టివాంఛను చూచినప్పుడు తమకు గల్గిన భావములను హృద్యంగా చిత్రించారు చాలామంది. జనమంచి వారి తోట్టిలో బాబు. బసవరాజు నాగుల చవితి మొదలయినవి వీటి కుదాహరణములు. వారి కీడు మూడినప్పుడు కల్గినవారి భావములు 'చలిపిడుగు' 'కోయిల' సౌదామనియొక్క దురదృష్టము మొదలయినవాటిలో కనబడుతుంది.

ఈ విధంగా పాశ్చాత్యవిజ్ఞాన సంపర్కముచేత పదార్థవాద పూరితమైన ప్రపంచమునుండి విశ్రాంతి కోరి నవ్యకవులు తమ భావస్వేచ్ఛ ప్రకటించారు. అది సర్వతోముఖంగా ప్రవహిస్తోంది. పంతులుగారు చెప్పినట్లు "నవ్యసాహిత్యం లేకుంటే లోకసంగ్రహం జరగదు. లోకం వృద్ధిపొందదు." ఏ నూతన సంస్థనూ ప్రప్రథమమున లోకము సరిగా గౌరవించలేదు. సుహృద్భావసమితుడు కాళిదాసుకి భవభూతికే లేకపోయింది. వారిలాగే మనము

"యేనామకేచి దిహ నః ప్రథయ న్త్యవజ్ఞాం
జానంతు తే కిమపితా న్ప్రతి నైవయత్నః
ఉత్పత్స్యతేఽస్తి మమకోఽపిసమాన ధర్మా
కాలోహ్యయం నిరవధి ర్విపులాచ పృథ్వీ"

"పురాణ మిత్యేవ న సాధుసర్వమ్
న చాపికావ్యం నవమిత్యవద్యమ్
సంతః పరీక్ష్యా న్యతర ద్భజంతే
మూఢః పరప్రత్యయ నేయ బుద్ధిః"

అని చెప్పుకోవలసివస్తుంది.






భామా ఫిలిమ్సు
"వాల్మీకి" నుండి

శ్రీ కుమారి
వి. బాలత్రిపురసుందరి

"హెచ్. ఎం. వి." హైఫిడెలిటి సూదులు.

N. 18764 { నీలిమబ్బుల / రామ నామ




రామారావు & శ్రీమతి అనూరాధ

N. 18763 { నాకు వొళ్లెల్లమంట / వల్ల నేరమా

"హెచ్. ఎం. వి." గ్రామఫోన్ వ్యాపారులందరియొద్ద దొరకును.

ది గ్రామఫోన్ కంపెని లిమిటెడ్, మద్రాసు.



# చాకలి మళ్లీ పాడు చేశాడు!

## అన్నిటికీ ధరలు మండిపోతున్నాయి

మరి యీ విధంగా వాడిని చేయటం సాగనిచ్చారా, మీ యిల్లు గుల్లచేస్తాడు. బాగా ఆలోచించండి—యిప్పటి ధరలతో—వాడు చింపే బట్టలను మరల కొనాలంటే ఎంత అవుతుందో: బట్టలు చెడగొట్టటానికి వాడు అవలంబించే పద్ధతులను యిక మనము సాగనివ్వకూడదండీ. అవి కేవలం మనకు నష్టమైనవి—యిప్పుడు ఆ పద్ధతులు అనవసరంటాను. ఎందుచేతనంటారా—సన్‌లైటు "సబ్బు-రక్షణ" విధానంతో దుస్తులను చాలా బాగా వుండేటట్లు వుతుక్కొనవచ్చును. ఇది చాలా సుళువైన మార్గం—బండకేసి బాదటం, గట్టిగా కొట్టటం—యిటువంటివేమీ అక్కరలేదు. సన్‌లైటుయొక్క స్వతసిద్ధమైన నురుగు బట్టల మురికిని తొలగించి, చాకలాడికంటె యెక్కువ తెల్లగాను, శుభ్రంగాను చేస్తుంది—పైగా బక్కనూలు పోగుకూడా చెడగొట్టదు. ఈ స్వల్ప విషయములను మీ పని మనిషికి బోధపరచి, అన్ని దుస్తులు ఇంటివద్ద సన్‌లైటుతో వుతుక్కోటంవల్ల చక్కగా బట్టలను చాల కాలము మన్నునట్లు చేసుకొని డబ్బుకూడా ఆదాచేసుకుంటూ వుండవచ్చు.



### మీ పనివాడికి సన్‌లైటు "సబ్బు-రక్షణ" విధము నేర్పండి

1. గుడ్డలను బాగా తడపండి. 2. తరువాత సబ్బు బట్టకు పట్టించండి. మరీమురికిగావున్నచోట సన్‌లైటు బాగా పట్టించవలెను. 3. సబ్బు బట్టలకు బాగా అంటనివ్వండి. రాతి కేసిగాని కఱ్ఱతోగాని బాదవద్దు. సన్‌లైటుయొక్క స్వతసిద్ధమైన నురుగు మురికినంతటిని వస్త్రమునుండి వదల్చును. 4. మురికి అంతయు పోయేటట్టు బట్టలను బాగా వుసమండి. బాగామురికిగావున్న బట్టకు ఇంకొకసారి సబ్బు పట్టించుట అవసరము.

# సన్‌లైటు సబ్బు బట్టలను కాపాడును




S. 70-23 TL.

LEVER BROTHERS (INDIA) LIMITED

# విశ్వం పెళ్లి

[ నాటకము ]

= శ్రీ సోమంచి యజ్ఞన్నశాస్త్రి:



## నాలుగో అంకము

[ఫూటీలో ఒక బంగళాకు అంటిపెట్టుకున్న రోట. సింహాచలం ఒక పెద్దమనిషితో ప్రవేశం.]

సిం—(పెద్దమనిషితో) తమ రిక్కడే వుండండి. నే వెళ్లి అమ్మాయిగారితో చెప్పేసొస్తాను.

పెద్ద—అమ్మాయిగారా ? అంటే ఉష ఏనా ?

సిం—(వెళ్లబోతున్నవాడు అనుమానంతో ఆగి) అయితే మీరు ఎరుగుదురా, ఎరగరా ?

పెద్ద—ఎరుగుదునా అంటావా ! ఎవరినీ ? ఉషనేనా ? నే నెరుగుదు నంటావూ ?

సిం—ఆహా ! మీతో మా పెద్ద తంటా వొచ్చిపడిందే! మీరు ఉషాదేవిగారి నెరుగుదురా, ఎరగరా ?

పెద్ద—నీ కెందుకు ?

సిం- -నాసంగ తెరగరు కాబోలు. నే తీసుకొచ్చిన సీటీ మీ క్కాకపోతే నా కారులో ఎందు కెక్కి ఇక్కడి కొచ్చేశారు ?

పెద్ద—ఆ చీటీ నాక్కాకపోతే మ రెవరికి ?

సిం—కరుణాకరంగోరి కిమ్మని ఉషమ్మ సెబితే తీసుకొచ్చాను. కరుణాకరంగారిని నే నదివర కో మాటు సూశా ! కుట్టాయన. ఆ సీటీ పుచ్చుకోని బుడుంగున మీ రొచ్చారు. మీరు నే యెరుగున్న కరుణాకరంగారు కానేకాదు. ఆ పేరట్టుగు మీ రెందు కొచ్చారు ?

(అంటూవుంటే లోపలినించి ఉష పైకొస్తుంది)

ఉష—చీటీ తీసుకెళ్లావా సింహాచలం ?

సిం—తీసికెళ్లానమ్మా ! తీసుకెళ్లి సీటీ లోపలి కంపిస్తే మన కరుణాకరంగారికి బదులు యీ పెద్దమనిషి దిగొచ్చి 'వోయెస్. నే వొస్తా పద' అన్నాడు ! వోటల్లో అడిగితే ఈయనే కరుణాకరంగో రన్నారు. సరేగదా అని తీసుకొచ్చేశాను. ఇప్పుడేమో మాట తిరిగిపోతున్నాడు. తీసుకెళ్లి వోటలుదగ్గర గిరాటేసిరానా ?

పెద్ద—అమ్మాయీ, నీలో రెండుమాటలు మాట్లాడాలి. నువ్వు ఉత్తరంరాసిన ఆ కరుణాకరం తండ్రిని నేను. దైవాత్తూ చీటీ నాచేతిలో పడింది.

ఉష—రండి. కూచోండి.

సిం—మాట్టాడతారా ? అయితే నే వెళ్లనా ? దగ్గిర్లోనే వుంటా లెండి ! అవసరమయితే కేకెట్టండి. సిటికలో తీసుకుపోతా ! (అని వెళ్లిపోతాడు.)

ఉష—క్షమించండి. అతను మా కారుడ్రైవరు. కారు అరవైమైళ్లవేగంలో అవలీలగా తోలుతాడు. ఏం పాడయిపోయినా సొంతంగా బాగుచెయ్యగలడు. అంచేత అతన్ని వొదులుకోలేకుండా వున్నాము. అందరితోటీ ఇలా చనువుగా మాటాడతాడు.

పెద్ద—బాగుంది. చూస్తున్నా కాదూ ఇప్పటి సంగతి ! డబ్బెక్కువయినకొద్దీ నౌకర్లమీద మనం ఆధారపడ్డమూ ఎక్కువవుతోంది. మనం సొంతంగా ఒక్క పని చేసుకోలేక పోతాము. నౌక ర్లేమనుకుంటారో, ఎక్క డెళ్లిపోతారో అని భయంచేత వాళ్లకి లొంగుండవలసొస్తోంది. సరే....అతన్ని కావాలని నేనే వాగించాను. దానివల్ల మీరంతా మొన్ననే ఇక్కడి కొచ్చారనీ, మా అబ్బాయికూడా మీతోనే వొచ్చాడనీ తేలింది.

ఉష—అవునండి. మా వాడిని ఒకతన్ని వెతుక్కుంటూరావలసొచ్చింది. మీ అబ్బాయి పెద్దకారుంది కాదూ ? అంచేత అతని కారులో వొచ్చేశాము. అతనూ మాతో వొచ్చేశాడు.

పెద్ద—వెతుక్కుంటూ రావలసొచ్చిందా ?

ఉష—అదంతా ఓ పెద్ద గాథలెండి !

పెద్ద—అలాగా ? ఆ గాథ నా కెందు కిప్పుడు ? (జేబులోనించి ఒక చీటీ తీసి) మీ పేరే అనుకుంటాను ఉష.

ఉష—(తాపీగా కూచుని) అవును !

పెద్ద—మా అబ్బాయికి మీరు రాసిన వుత్తరం ! "కరుణం ! అందరూ మ్యూజియమ్ చూడ్డానికి వెళ్లారు. నాకు తలనొప్పొచ్చిందని ఇంటిదగ్గిరే వుండిపోయాను. తోటంతా మనదే. ఎక్కడా రెండో పిట్ట లేదు. ఉత్తరం చూసిన తక్షణం కారులో ఉరుకు. చిటికలో సింహాచలం ఇక్కడ చేరుస్తాడు. తప్పకుండా రావాలి. రావాలి. రావాలి. —నీ ఉష."

(చీటీ మళ్లీ మడిచి జేబులో పెట్టుకుంటూ) మీ యిద్దరికీ ఏ మాత్రం పరిచయ ముందో తెలీదుకాని....

ఉష—మీ అబ్బాయిని నేను చాలా బాగా ఎరుగుదునండీ. మీకేమన్నా అభ్యంతర ముందా ?

పెద్ద—నా కేం అభ్యంతర ముందీ ? కాని ఓ సంగతి మాత్రం జాగర్తగా జ్ఞాపక ముంచుకోవాలి. వాడికి నేనిస్తే కద్దు.; లేకపోతే దమ్మిడీ లేదు. నా ఆస్తంతా నా స్వార్జితం. నా యిష్టం లేందే ఏమీ జరగదు.

ఉష—మీవాడి విషయంలో మీరేమీ మూర్ఖంగా వుండరుగా !

పెద్ద—వుండకుండా వుండాలనే నా ప్రయత్నమూ అనుకో. కాని నా వయస్సులో మూర్ఖం అనిపించనివి నీ వయస్సులో చాలా మూర్ఖ మనిపించవొచ్చును. వేడిరక్తం కాదూ ?

ఉష—ఇలా సందిగ్ధంగా మాట్లాడుకుంటే లాభం లేదు. చల్లకొచ్చి ముంత దాచడ మెందుకు ? మీ అబ్బాయి నన్ను పెళ్లి చేసుకుందా మనుకుంటున్నాడు.

పెద్ద—ఈ వుత్తరంధోరణి చూసి నే అనుకున్నా ! సరే. పెళ్లిచేసుకుంటా నని పట్టుబడితే చేసుకోవొచ్చును. నే నేం అడ్డుపడలేను. కాని నాదగ్గిరనించిమాత్రం ఇహ దమ్మిడీ ముట్టదు.

ఉష—ఏం ? నేనంటే మీ కెందు కిష్టం లేదు ?

పెద్ద—నీ మీద నా కేం కోపం లేదమ్మా ! నువ్వు మంచిదానివే కావొచ్చు. కాని మావాడి పెళ్లివిషయమై నాకు వేరే వుద్దేశా లున్నాయి !

ఉష—మీ వాడికి ఆ వుద్దేశా లేమీ లేకపోవొచ్చు. అవి నచ్చకపోవొచ్చు.

పెద్ద—కావొచ్చు. నా ఉద్దేశాలన్నీ వాడికి నచ్చాలని నే నెప్పుడూ అనలేదే ? వాడి కిష్టం లేకపోతే వా డిష్టమొచ్చినట్టు వా డుంటాడు. నాకేం సంబంధ ముండదు. అంతే. మీ వయస్సులో ప్రేమే ప్రధానం, డబ్బుంటేనేం, లేకపోతేనేం ? అనుకుంటూవుండాలి. కానీండి. మీరు దీనికి సిద్ధపడే వుంటారు !

ఉష—క్షమించాలి ! కరుణాన్ని నే చేసుకోవాలంటే చాలా డబ్బుండాలి!

పెద్ద— (అనుకోని జవా బొచ్చినందుకు చాలా ఆశ్చర్యపడి) ఆ ! ఓహో! అలా అయితే సరే. కష్టపడమను. సంపాదించుకోమను.

ఉష—అతను మళ్లీ కష్టపడి సంపాదించుకోవాలంటే మరి మీ కింత డబ్బుండి ప్రయోజనం ! మీ రనేవాంట్లో ఏమీ సబబులేదండి. మీ అబ్బాయి సుఖంగా పదిమందిలోనూ తలెత్తుకు తిరగడానికి మీరు తగిన దివ్వాలి. అది అతని హక్కు.

పెద్ద—హక్కూ గిక్కూ నా దగ్గిర పనికిరావు. హక్కెక్కడో వుందనుకునిమాత్రం పెళ్లాడకమ్మాయ్.

ఉష—మీ అబ్బాయిసంగతి మీ కంత బాగా తెలీదండీ. అత నేం కష్టపడలేడు. అందరినీ తేలిగ్గా నమ్మేస్తాడు. అలా కాకుండా అతన్ని కాపాడుకుంటూరావాలి.

పెద్ద—అదంతా నువ్వేకాని మ రెవరూ చెయ్యలేరంటావు !

ఉష—ఆ ! ఎక్కువ కట్నంతో మీ కొచ్చే ఆ పిల్లా మీ అబ్బాయిలాగే లోకజ్ఞానం లేని దవుతుంది. ఇద్దరూ కలిసి మీ డబ్బు తగలెయ్యడానికే పనికొస్తారు.

పెద్ద—ఆ జాగర్తేదో నే పడతానులే. ఆ బాధ నీ కెందుకు ?

—— కట్నం పుచ్చుకోడం గొప్పనుకుంటున్నారు మీరు. కట్నా లిప్పు డందరూ అసహ్యించుకుంటున్నారు. పుచ్చుకుంటున్నవాళ్ల చెడ్డవా ళ్లంటున్నారు.

పెద్ద—అంటే అన్నారు. నాకేం ఖరవాలేదు.

ఉష—మీ కెందుకు పెద్దకట్నా లివ్వాలి ? మీవంశం ఏమంత గొప్పదా ? మీ కెవరూ పెద్దకట్నం ఇవ్వనేఇవ్వరు.

పెద్ద—ఇరవైవేలు కట్న మిస్తామని రెండు గొప్ప కుటుంబాలవాళ్లు సంవత్సరంనించి తిరిగిపోతున్నారు తెలుసా ? నా వంశాన్ని పట్టికాదు ఇప్పుడు నాకు గౌరవం ! నాభాగ్యాన్ని పట్టి ! నా కేమర్యాద కావలిస్తే ఆమర్యాదే కొనుక్కోగలను,

ఉష—అంత డబ్బుండి ఇంకా మీకు కట్న మెందుకు చెప్పండి ? మీకు కట్నం రాలేదని మమ్మల్ని మాడుస్తా

మంటారా! నన్ను చేసుకోకపోతే మీఅబ్బాయి మహా దుఃఖ పడతాడు.

పెద్ద—కొద్ది రోజులేలే. తరువాత అలవాటయి పోతుంది. ప్రేమలో దెబ్బతింటే తేరుకోవొచ్చును గాని, డబ్బువిషయంలో కాలుజారితే మాత్రం ప్రమాదం, ప్రేమ లేకపోతే బతకొచ్చును గాని, తిండి లేకపోతే బతకలేరుగా.

(అంటూవుండగా అకస్మాత్తుగా లోపలికి కరుణాకర మొస్తాడు)

ఉష—నువ్వే వొచ్చేశావు! నువ్విప్పు డేమీ మాట్లాడకు. ఒక్కమాటు బయటకి వెళ్లవూ? మా మాట అయి పోయినతరవాత మళ్లీ వొద్దువుగాని! వెళ్లవూ?

కరు—నీకు తెలీ దుంపు ఉషా. ఎప్పటికప్పు డిలాగే అవుతోంది. ఈదెబ్బలో అటో యిటో తేలిపోవాలి. నాన్నా, నీ వ్యవహారం ఏమీ బాగాలేదు!

పెద్ద—అంటే?

కరు—నా కొచ్చిన వుత్తరం నువ్వు విప్పిచదివావు. దొంగపేరు చెప్పుకుని ఇక్కడి కొచ్చావు. ఇ దేం మర్యాదగా వుంది! ఇ దేం పెద్దమనిషితరహాగా వుంది!

పెద్ద—వొరేయ్, ఆలోచించి అను మాటలు. లేక పోతే జాగర్త.

కరు—నే ఆలోచించను. ఇదివరకంతా ఆలోచించే వూరుకున్నాను. ఇహ ఆలోచించను. ఓ, జాగర్తగానే వుంటాను. నా గౌరవం, నా మర్యాదా పాడయిపోకుండా జాగర్త పడతాను.

పెద్ద—నీగౌరవం, నీమర్యాదా? ఎక్కడివిరా నీకు? నా డబ్బెట్టి కొనిపెట్టాను.

కరు—కావొచ్చు. ఇప్పు డంతా పాడుచేసేశావు. నాకు ఓ అమ్మాయి రాసిన వుత్తరం, ఓ రహస్యవుత్తరం, ఓ ప్రేమలేఖ విప్పేసి చదివేశావు!

ఉష—ఊరుకో కరుణం! నీ పేరూ, మీ నాన్న పేరూ ఒకటేనయ్యె మరి! పైన నీపేరు రాస్తే, ఆయనపే రనుకుని విప్పి చదివుండొచ్చును. ఇందులో ఆయనత ప్పేముంది?

పెద్ద—వినరా! ఆ మాత్రం బుద్ధి లేదు నీకు. బాగా చెప్పావమ్మా!

కరు—ఆవిడకి బుద్ధుందని తెలుస్తూనేవుంది. నీ కేదీ?

పెద్ద—వొళ్లు దగ్గిరపెట్టుకు మాట్లాడు. మాటకి మాట జవాబుచెబుతావురా? వూరుకునేది లేదు తెలుసా?

ఉష—ఉష్. ఉష్. ఇప్పుడైనా వూరుకోండి. వాళ్లంతా యిటే వొస్తున్నారు.

(తండ్రీ, కొడుకూ ఒకరిమీద ఒకరు ఉరుముకుంటూ నిలబడిపోతారు. విశ్వం, చయనులూ, అరవిందం లోపలి కొస్తారు. కౌముదికూడా లోపలికొచ్చి, ఉషఅవస్థ చూసి, సానుభూతితో సంజ్ఞచేసి లోపలికి వెళ్లిపోతుంది.)

ఉష—అప్పుడే వొచ్చేశా రేం?

విశ్వం—ఇవాళ మ్యూజియం తెరవలేదు. శలవట! (అంటూ తండ్రీకొడుకులమధ్య కొస్తాడు.)

ఉష—ఏం నాటకం!

చయ—అమ్మా ఉషా! చాలా తలనొప్పిగా వుందన్నావు. ఇలా ఆరబయట గాలిలో కొచ్చేశా వేమమ్మా? పడుకుంటేనేగాని తలనొప్పి తగ్గదు.

విశ్వం—కరుణాకరం! నీకూ తలనెప్పి పోయిందీ!

ఉష—మరిచిపోయాం. మీనాన్నని అందరికీ పరిచయంచెయ్యవోయ్.

కరు—నే చెయ్యను. ఇతగాడు మా నాన్న కాదు!

పెద్ద—నాన్ననే కాదంటావురా?

ఉష—(కరుణాన్ని వారిస్తూ) బాబ్బాబు! గలభా చెయ్యకు.

కరు—అది కాదు ఉషా! నేను సిద్ధాంతాలకోసం, నా జన్మహక్కుకోసం, నా వ్యక్తిస్వాతంత్ర్యంకోసం పోట్లాడుతున్నా. నేను కొడుకునే. తండ్రిమాటకి సాధారణంగా ఎదురుచెప్పను. కాని నా వుత్తరాలు విప్పిచూసేసి, పైగా నేను నిన్ను పెళ్లాడకూడదంటే, ఇహ నాకు తండ్రేమిటి? ఇహనించీ నాదారి నాది, ఆయనదారి ఆయనది!

విశ్వం- -ఉషని పెళ్లాడతావా?

చయ—నీ కేం వెఱ్ఱెత్తిందా ఏమిటి?

విశ్వం—నీతో చెప్పింది మరిచిపోయావూ?

కరు—చెబితే చెప్పారు, నా కేం లెక్కలేదు!

చయ—శ్రీరామచంద్ర, శ్రీరామచంద్ర! ఏంకాలం?

విశ్వం—ప్రేమించామని చెప్పినవాళ్లందరినీ కొట్టులో పెట్టి తాళమేస్తేనే గాని ఇహ లాభం లేదు.

పెద్ద—(ఇదేం అర్థంకాక) ఏం? మీ రంతా ఇలా అంటున్నారేం? ఈ అమ్మాయిని చేసుకోడానికి మా వాడు తగడా?

విశ్వం—అయ్యో. ఏం చెప్పం! ఈ అమ్మాయికి ఇదివరకే పెళ్లయిపోయింది, మీ వాడి కా సంగతి తెలుసు. అయినా వెఱ్ఱి కుదరలేదు. వెనకపడ్డాడు.

పెద్ద—అదా సంగతి! (అని కోపంగా కరుణంమీదికొచ్చి) భాగ్యవంతుల వెధవ అవినీతిగుణాలన్నీ అప్పుడే అబ్బాయీ?

కరు—మరేం భయం లేదు. నే చేసే పనుల్లో బాగోగులు నే చూసుకోగలనులే.

విశ్వం—శబాష్! బాగా చెప్పావు. పెళ్లయితే నీతీ, పెళ్లికాకపోతే నీతికాదూ అన్న సిద్ధాంతంలో అర్థం లేదు. కాని ఉష ఆ సంగతి ఒప్పుకోదుకదా!

పెద్ద—అమ్మాయీ! మీ ఆయ నెవరో నాకు తెలీదు గాని నువ్వు ఇంకోడి పెళ్లాని వయ్యిండి మావాడి కిలా వుత్తరం వ్రాయడం ఏమీ బాగాలేదు. నువ్వే మావాడి నిలా తప్పుదోవని దింపి పాడుచేశావు.

కరు— (ఉద్రేకంతో) ఇహ నే వూరుకోలేను. నా పెళ్లాన్నే మాటలంటూవుంటే సహించివుండలేను.

పెద్ద—నీపెళ్లామా!

విశ్వం—నువ్వా నాయనా ఆ పేరు తెలియని మొగుడివి?

చయ—మమ్మల్నందర్నీ ఎంతకాలం కన్నుకప్పావయ్యా!

పెద్ద—నువ్వు నన్నడక్కుండా, నా అనుమతి తీసుకోకుండా పెళ్లాడావు.

కరు—కట్టిపెట్టండి మీ దబాయింపులు. నాకూ, ఉషకీ పెళ్లి అయిపోయింది. నాలిక పీక్కున్నా లాభంలేదు. ఏమంటారు మీ రిప్పుడు?

పెద్ద—ఏమంటానా? ఇహనించీ నీ కొక్క దమ్మిడీ యివ్వ నంటాను. నువ్వు ముష్టెత్తుకోవా లంటాను.

కరు—మరేం భయంలేదు. ఉద్యోగం చెయ్యకపోతే కూలిపనయినా చేసుకు బతుకుతాము.

పెద్ద—ఆ కబుర్లు చెబుతున్నావు. నిన్ననే మనియార్డరందిందికనక, ఆసొమ్మేం కాపరంచెయ్యదు! అదయిపోనీ. నే ఒక్క దమ్మిడీ, ఒక్క తోలీ, ఒక్క చిల్లిగవ్వ ఇచ్చేది లేదు. అప్పుడు చెప్పు ఈ మాటలు.

కరు—(జేబులోనించి నోట్లకట్ట తీసి) ఇదుగో నువ్వు వంపించిన డబ్బు తీసుకో, లక్షరూపాయ లిస్తానన్నా నా పెళ్లాన్ని మాటపడనిస్తానా? అమ్మయ్య! నీకూ నాకూ తెగతెం పయిపోయింది. మళ్లీ నా విషయంలో జోక్యం కలగజేసుకోకు. నాకు నువ్వూ వొద్దు, నీ డబ్బూ వొద్దు.

పెద్ద—కరుణం! నీకు దరిద్రమంటే ఏమిటో తెలీదురా!

కరు—తెలీకపోతే తెలుసుకుంటాను. నా కేం భయం లేదు. నా కాళ్లమీద నే నిలబడాలి. ఉషా! రా! మనం వేరే వెళ్లిపోదాం! ఇల్లు చూసుకునేదాకా హోటల్లో వుందువుగాని. నిన్నేదోవిధంగా పోషించకపోలేను.

అర—బావా! శబాషయిన పని చేశావు. నువ్వంటే నా కెంతగౌరవంగా వుందో చెప్పలేను.

ఉష—నీకు బుద్ధిలేదు అరవిందం, అతను కూలిపనేం చెయ్యగలడు చెప్పూ?

విశ్వం—కూలిపని చెయ్యక్కర్లేదు. ఏ వ్యాపారం పెట్టినా సరిపోతుంది. పెట్టుబడి కేం తక్కువలేదు. ఎంత కావలిస్తే అంతా నే నిస్తాను.

అర—నేనూ కొంచె మిస్తాను.

పెద్ద—మీ వెధవద బ్బెవరికి కావాలి? వాడికి డబ్బు కావలిస్తే తండ్రిదగ్గిర్నించి తీసుకుంటాడా, వూరివాళ్లందర్నీ ముష్టెత్తుతాడా? వారే! దుడుకుతన మొద్దు. నే నోరుజారి అన్నందుకు చాలా విచారిస్తున్నారా! ఉషమీద నాకేం కోపం లేదు. సరిగ్గా నీకు కావలసినలాటి భార్యే దొరికింది. సరేనా!

కరు—సరే నాన్నా. నువ్వింక చెప్పక్కర్లేదు. మ నిద్దరికీ రాజీ అయిపోయింది. కాని నీదగ్గిరనించి డబ్బు మాత్రం తీసుకోను.

పెద్ద—(బతిమాలుకుంటూ) చూశావా? చూశావా? నాతో స్నేహంగా వుండి కడుపు మాడ్చుకోడంకంటె నాతో దెబ్బలాడుతూనయినాసరే డబ్బుచ్చుకుంటేనే సంతోషిస్తారా! నీకు ఆకలంటే తెలీదు. లోకం ఎంతక్రూరంగా ప్రవర్తించగలదో తెలీదు, నాకు తెలుసు. డబ్బు తీసుకోవూ?

కరు—తీసుకోను, తీసుకోను. ముమ్మాటికీ తీసుకోను. మరి ఆసంగతి మాట్లాడొద్దు, (ఉషతో) పోదాం రా ఉషా!

ఉష—నిలుచున్న వళంగా ఎలా బయలుదేరిరాను? పెట్టే, పక్కా సర్దించుకువొస్తాను.

కరు—సరే అయితే. ఈలోపుగా హోటల్లో అన్నీ ఏర్పాటుచేసొస్తాను. (అని వెళ్లిపోతాడు)

పెద్ద—(ఉషతో) నువ్వు వాడికి బుద్ధిచెప్పి మంచి తోవకి తీసుకొస్తావు కాదమ్మా! నాకు తెలుసు. నువ్వు చెయ్యగల వానని!

ఉష—ఇంత పట్టుదలమనిషని నాకు తెలీదు. మొండి పట్టు పడితే నేనేం చెయ్యగలను!

పెద్ద—నిరుత్సాహపడకు. నువ్వు కీలెరిగి వాతపెడితే తప్పకుండా మారిపోతాడు. డబ్బు తీసుకునేటట్టు చేస్తావు కాదూ ? చేస్తానంటేగాని నాకు నిద్దరట్టదమ్మా !

ఉష—ప్రయత్నిస్తాను. కోరికోరి దరిద్రం అనుభవించడంలో అర్థం లేదు.

పెద్ద—అవునవును,

ఉష—ఇందాకా మీ చేతి కిచ్చిన డబ్బు నా కివ్వండి. హోటలు కివ్వడానికి కొంత డబ్బు కావాలిగా ! ఈ సొమ్ము ఉపయోగించడానికి ఒప్పుకుంటాడేమో ప్రయత్నించి చూస్తాను. వెంటనే కాదులెండి; నెమ్మదిమీద.

పెద్ద—చాలా బాగుంది. ఇదే మంచిపద్ధతి. (అని డబ్బిచ్చి) ఇంకా ఏమన్నా కావలిస్తే.......

ఉష—ఆలోచించి చెబుతా లెండి.

(అని మాట్లాడుతూ వెళుతుంది. తండ్రి చివరిదాకా వెళ్లి సాగనంపుతాడు)

విశ్వం—(చయనులుతో) ఆయనండీ లక్షాధికారి ! ప్రపంచంలోకే ధనికుడు ! ! ఒక్క ఆడపిల్ల అటకాయించి బోల్తాకొట్టించింది. నాకూ ఎప్పుడన్నా ఈగతి పడుతుందా అని భయంగా వుంది.

చయ—ఎంత త్వరలో అయితే అంత మంచిది. శుభస్య శీఘ్రం.

పెద్ద—(తిరిగొస్తూ) ఎంత మంచిది ! ఎంత తెలివయింది ! ! లక్షరూపాయల కట్నం మొస్తేమాత్రం ఇలాటి కోడలు దొరుకుతుందా ?

చయ—తమ రిక్కడికి అకస్మాత్తుగా దయచెయ్యడంవల్ల తమ దర్శనభాగ్యం లభించింది. ఏదో పనిమీద దయచేసినట్టుంది ఇక్కడికి.

పెద్ద—పెద్ద పనేమీ లేదు. ఆ మధ్య ఏదో మానవ సేవాసంఘం అన్న కంపెనీషేర్లు చవగ్గా వొస్తున్నాయని కంపెనీషేర్లన్నీ కొనేశాను. మరి ఆ కంపెనీ ఏమిటో, ఏం వ్యాపారం చేస్తోందో తెలీదు. కంపెనీ మేనేజరు ఎవరో ప్రసాదుట. హెడ్డాఫీసు ఈ వూరంటేను, అదేదో కనుక్కుందామని వొచ్చాను.

విశ్వం—మానవసేవాసంఘమా ? ఆ ప్రసాదుని నే నెరుగుదునులెండి. మనం అల్లా వెళ్లొద్దామా ఏమిటి అయితే !

పెద్ద—అలాగే.

విశ్వం—అరవిందం ! (అని కేకేస్తాడు. కేక విని అరవిందం లోపలి కొస్తాడు. అరవిందంచెవిలో) మీచెల్లెలి మామగా రెవరో తెలుసా ? దొంగలకంపెనీకి పెట్టుబడి దారుడురోయ్ ! (అంటూ వెళ్లిపోతాడు. పెద్దమనిషి, చయనులు కూడా వెళ్లిపోతారు.)

కౌ—అరవిందం, నువ్వు వెళ్లడం లేదా యేమిటి వాళ్లతోటికూడా !

అర—నన్ను వెళ్లిపొమ్మంటున్నావా కౌముదీ ? ఎంత నిర్దయ ? నా హృదయ....

కౌ—పాపం ! ఏం కష్టమొచ్చింది నీ హృదయానికి !

అర—నా సర్వస్వమూ నీ కర్పిస్తున్నానే. నా జీవితం నీ పాదపద్మాల కంకితంచేస్తున్నా. నన్ను వివాహం చేసుకోవూ ?

కౌ—ఏం లాభం అరవిందం ! నే నేం చెయ్యగలను చెప్పు. నేనేమో విశ్వాన్ని పెళ్లిచేసుకోవాలని అమ్మ పట్టు పట్టి కూచుందయ్యే.

అర—విశ్వాన్నా ?

కౌ—నీ కాశ్చర్యంగా వుందికాదూ ?

అర—ఇదా సంగతి ? ఇన్నాళ్లూ విశ్వం నాతో చెలగాటా లాడుతున్నాడా ? తనే పెళ్లిచేసుకుందా మనుకున్నాడు కాబట్టి నన్ను పెళ్లాడొద్దనేవాడు !

కౌ—అహాఁహాఁ. అలా నే అన్నానని ఆతనితో అనేవుసుమా ? విశ్వానికి అతని మనసు తిన్నగా తెలీదోయ్. కాని, చూడు, మానాన్న విల్లువల్ల నే నతన్ని పెళ్లాడాలని ఆయన కున్నట్టు తెలుస్తూనే వుందా ? ఇప్పుడు అమ్మ పట్టు పట్టి భీష్మించుకు కూచుంది.

అర—నీకోరిక లన్నీ చంపుకుని ఎల్లకాలమూ మీనాన్నమాటా, అమ్మమాటా పాలించడమా ? ఈ త్యాగానికి అంతుండాలి.

కౌ—మానాన్నకి నేనంటే ఎంతో ఇష్టమా ? అమ్మకీ అంతే. మరి వాళ్ల మాట ఎలా కాదనగలను చెప్పు ? నా కోరికలూ, నాస్వలాభం అనుకోడం మంచిదా, వాళ్ల కోరికని బట్టి నడుచుకోడం శ్రేయస్కరమా ?

అర—నువ్వెంత త్యాగం చెయ్యగలవో నాకు తెలుసు. కాని మరోవిధంగా ఆలోచించు. నువ్వు నిజంగా విశ్వాన్ని ప్రేమించకుండా వున్నప్పుడు అతన్ని పెళ్లిచేసుకోడం అతనికి అన్యాయం చెయ్యడం కాదూ ? నన్ను పెళ్లాడక నాసుఖం పాడుచేసి, అతన్ని పెళ్లాడి అతని సుఖం పాడుచెయ్యడం ధర్మమా ?

కౌ—(చాలా జాలిగా చూస్తూ) అరవిందం ! నువ్వు చాలా మంచివాడవోయ్. నువ్వు నన్ను పూజిస్తున్నావు కాదూ?

అర—నువ్వు నా హృదయాధిదేవతవి. నీపాదస్పర్శ తగిలిన ప్రదేశం పూజిస్తాను. ఆజన్మాంతం పూజిస్తాను.

కౌ—అంత మెలా వుంటుందో మన కిప్పుడు నిజంగా తెలుసా ? అదికాదుగాని నామీద నీకున్న సదభిప్రాయం నిలబెట్టుకోడం ఎంత కష్టమో చూడు. నేను దేవత నంటావు. దేవతాపీఠం దిగరాద దంటావు ! నాతరమా ? నేను నిన్ను కాక విశ్వాన్నే పెళ్లాడా ననుకో. నువ్వు నన్ను దూరంనించే చూసి పూజిస్తూవుంటావు కనక నీకు నామీద వున్న మోజు పోదు. స్వాప్నికమూర్తిలాగ నేను నీచేతి కందకుండా వుండాలి. అప్పుడు నువ్వు ప్రేమగీతాలూ, విషాదగీతికలూ వ్రాయొచ్చు.

అర—కటువుగా మాట్లాడ్డం నీకు ఆ విశ్వందగ్గిర పట్టుబడింది. నా కదే మంచనుకుని నా మీద ప్రయోగిస్తున్నావు !.... మరి నీ మీద విశ్వానికి మోజు తగ్గిపోదూ ?

కౌ—అతనికి నా మీద మోజు లేనిదే ? పోతుందని భయ మెందుకు ? విశ్వానికి నా మీద మోజు తగ్గుతుందని ప్రమాదం లేదు. అప్పుడప్పుడు కలగొచ్చునన్న ఆశ వుంది.

అర—నాకు సందేహం లేదు. నువ్వు ఆనంద జ్యోత్స్న విరజల్లగలవు. వాడేమో. బుద్ధిలేక, వాడి జీవిత మంతా దుఃఖమయం చేసిపారేస్తా వనుకుంటాడు.

కౌ—అవును. అదే యిప్పుడు పెద్ద గడ్డుగా వుంది.

అర—నువ్వు అతన్ని ప్రేమిస్తున్నా వని నే పెళ్లి చెప్పిరానా విశ్వంతో ?

కౌ—వొద్దొద్దు. చెబితే మళ్లీ పారిపోతాడు !

అర—(నిర్ఘాంతపోయి) ఏమిటి కౌముదీ ? నువ్వంటే ఇష్టంలేక పారిపోయేవాణ్ణి పట్టుకు పెళ్లాడుతావా ?

కౌ—నీ కేమీ తెలీదు అరవిందం ! మనకి నిజంగా కావాలనుకుంటే ఇష్టం లేని మనిషంటూ ఎవరూ వుండ రనుకో....అయినా నీకు ప్రమాదం తప్పిపోయిందని అప్పుడే సంతోషంగా వున్నట్టుంది కాదూ ?

అర—సంతోషమా ? నాకా ? చూశావా ? ఏమి అన్యాయం !

కౌ—నీకు సంతోషంగాక బాధగా వున్నట్టయితే, మరికొంత బాధ కావాలని కోరుకుంటావా ?

అర—నేను బాధ కావాలని కోరానా ?

కౌ—నేను ప్రేమిస్తున్నట్టు విశ్వంతో చెబుతా నన లేదూ ? అది స్వార్థత్యాగ మంటావుకాబోలు. కాని దాంట్లోనూ నీకు సంతోషం కలిగించే దేవో వుండాలి.

అర—నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నువ్వు సుఖంగా వుండాలని వాంఛిస్తున్నాను. నువ్వు నన్ను ప్రేమించడం లేదు కనక నేనై నిన్ను సుఖపెట్టలేను. మరెవరైనా నిన్ను సుఖపెట్టగలిగితే నే నెందుకు సహాయం చెయ్యకూడదు ? ఇందులో అర్థం చేసుకోలేని దేముంది !

కౌ—కాబోలు. నిన్ను నే ప్రేమించడం లేదేమో ! క్షమించు.

అర—నిన్ను క్షమించడానికి నువ్వేమీ అపరాధం చెయ్యలేదు. ఇహ నిన్ను నే బాధించను, నాగుండెల్లో గాయం మానకపోయినా ఆ రుధిరం నీకు కనిపించదు.

కౌ—కవిత్వం, కవిత్వం, ఆఖరిదాకా కవిత్వమే !

(అంటూ లోపలికి వెళ్లిపోతుంది. అరవిందానికి కన్నీళ్లు తిరుగుతాయి. రామాయమ్మగారు లోపలి కొచ్చి అరవిందంకన్నీళ్లు కనిపెడుతుంది)

రామా—(ఆత్రుతగా) అరవిందం ! ఏమిటమ్మా ! వొంట్లో బాగా లేదా ?

అర—ఏమీ లేదమ్మా ! ఏమీ లేదు.

రామా—ఏమీ లేకపోవ టేమిటి ? కన్నీళ్లు పెట్టు కుంటున్నావు ఎందుకు? ఉష పెళ్లినిగురించి బాధ నాయనా?

అర—ఏమీ లేదు. శిథిలహృదయం....అర్థం లేదు కాదూ ?

రామా—అంటే, కౌముది ఏమయినా చేసిందా ?

అర—కౌముది చేమీ తప్పులేదు. నేను మిమ్మల్ని ఏమీ అనడంలేదు.

రామా—నన్నా ! ఎందుకూ ?

అర—అనడం లేదంటున్నాగా ?

రామా—అసలు నన్ను అనడం సంగ తెందుకు వొచ్చింది నాయనా ? నే నేమీ చెయ్యలేదే ? సంగతేమిటి ?

అర—(ఆ కన్నీళ్లలోనించే నవ్వడానికి ప్రయత్నిస్తూ) కౌముదికి నాకంటె విశ్వమే తగినవా డని మీ రనుకుంటే, నే నేం అడ్డుచెబుతానా ? కౌముదిని హృదయపూర్వకంగా ప్రేమించడంవల్ల నాకు బాధగా వుంది, అంతే !

రామా—విశ్వాన్ని పెళ్లిచేసుకోమని నే అన్నట్టు ఎవరితోనైనా చెప్పిందా ఏమిటి ?

అర—నాతోనే చెప్పింది !

రామా—అరవిందం ! నువ్వంటే నాకు చాలా జాలేస్తోంది. దానికి విశ్వాన్ని పెళ్లాడాలని వున్నట్టు చెప్పడం పద్ధతి అది. లేకపోతే నాయిష్టాయిష్టాలు దానికి కావాలా ?

అర—అంటే ? మీరు కోరుతున్నారని నమ్మకుండానే అలా చెబుతోం దంటారా ? అబద్ధమాడి మోసం చేసుందంటారా ?

(అంటూవుంటే విశ్వం లోపలి కొస్తాడు)

విశ్వం—అమ్మయ్య ! ఆ దొంగ ల్నిద్దరినీ ఒక్క చోట చేర్చాను, ఇహ వ్యూహాలకి తక్కు వుండదు. (అరవిందంకేసి చూసి) అరే అరవిందం ! ఏమిటి సంగతి ?

అర—మొహం కడుక్కొస్తేనేకాని లాభం లేదన్న మాట. (రామాయమ్మతో) మీ కోరిక విశ్వానికి చెప్పండి. (విశ్వంతో) కౌముదికూడా ఒప్పుకుంది !

విశ్వం—ఏం ఒప్పుకుంది ?

అర—అమ్మే చెబుతుందిలే. విను. (అని లోపలికి వెళ్లి పోతాడు.)

రామా—(తాపీగా కూచుని) ఇదేమిటో తమాషా ప్రపంచ మయిపోయింది. ఒక్కళ్లూ తిన్నగా, మామూలు పద్ధతుల్ని ఆలోచించడం లేదు ; చెయ్యడమూ లేదు

విశ్వం—మీ కోరి కేమిటో చెప్పండి

రామా—అదే చెబుదా మనుకుంటున్నా : నా కిష్టమున్నా లేకపోయినా కౌముదిని నువ్వేలాగా పెళ్లాడుతావనుకో.

విశ్వం—ఈ వరసని చూస్తే నా కిష్టమున్నా, లేకపోయినాకూడా జరిగిపోయేట టుంది.

రామా—కావొచ్చు. కౌముది ఏదన్నా నిజంగా సాధిద్దామనుకుంటే దానికి అడ్డముండదు. నీకు తెలిసిందేగా. అందుకుగాదు. నా మీద పెట్టొద్దు. అంతే నే నంటున్నది. నిన్ను పెళ్లాడమని నేనేమో కౌముదిని నిర్బంధిస్తున్నట్టు అరవిందంతో చెప్పిందట. అతను దానిమీద పంచప్రాణాలూ పెట్టుకునివున్నాడు. ఈ మాట వినేసరికి మనస్సు చివుక్కుమని బాధపడుతున్నాడు. ఈ పెళ్లితో నాకేం సంబంధం లేదు. నే నెప్పుడూ ఏమీ అనలేదని అరవిందంతో చెప్పి లాభంలేదు. అతను నమ్మడు. నువ్వంతకంటె తెలిసినవాడివికనక చెబుతున్నాను. నువ్వు కౌముదీని పెళ్లాడితే. మాత్రం తప్పు నా మీద పెట్టకు. నా కంతకంటే ఏమీ అక్కర్లేదు.

విశ్వం—నాకు కౌముదిని పెళ్లాడా లని ఎంతమాత్రం కోరిక లేదు !

రామా—నీకు సరిపోతుంది విశ్వం ! మిగిలినవాళ్లెవరూ దానికి ఉజ్జీలుకారు. ఎప్పుడయినా నువ్వే దాన్ని లొంగతియ్యగలవు.

విశ్వం—లాభం లేదమ్మా. ఏ మొగాడూ ఏ ఆడదాన్ని లొంగదియ్యలేడనుకో. నేనూ దాని బానిసనయే వుండాలి.

రామా—కాదులే. నువ్వంటే దానికి కాస్త పక్కబెదు రుంది. అది చెప్పే అబద్ధాలన్నీ నువ్వు నమ్మవు సరిగదా, మొహమ్మీద అనేసే ధైర్యంకూడా వుంది.

విశ్వం—కౌముది ఎలాటిదో నే చెప్పడం ప్రారంభించానా, అందరూ నామీద పడి కరుస్తారు. కౌముది అబద్ధాలాడుతుంది. బుకాయిస్తుంది, అది కాదు, అబద్ధా లాడనివాళ్లూ, బుకాయించనివాళ్లూ ఎవ రీ లోకంలో ? తనెప్పుడూ అబద్ధమే ఆడనట్టు నటిస్తుంది. అదీ గొడవ, తనేమో అన్ని నియమాలూ ఉల్లంఘించేసి ఇష్టమొచ్చినట్టు నడుచుకుంటుంది. మిగతావాళ్లందరూ మాత్రం తు. చ. తప్పకుండా ధర్మశాస్త్రప్రకారం నడుచుకోవా లంటుంది. ఈ కపటం, నటనామాత్రం భరించలేము.

రామా—అవునవును, దాని దంతా నటనే. చేసే వన్నీ చేసి, నంగనాచి వొంగముల్లులా వుంటుంది.

విశ్వం—మరయితే నన్నెందుకు పెళ్లాడమంటారు ?

రామా—అదుగో చూశారా? నామీదే పెట్టండి తప్పు. అరవిందం చెప్పేదాకా నేను ఆమాటన్నా అనుకోలేదుగదా ! అందరికీ నామీదే కోప మొస్తుంది. కౌముదేమో దేవత అని నే పూజించడం లేదని అరవిందానికి కోపం. ఇప్పుడు నువ్వేమో నే నన్నదానికి పెడర్థాలు తీసి........

(కౌముది లోపలి కొస్తుంది)

కౌము—అమ్మా! నువ్వూ, విశ్వం ఏవో రహస్యాలు మాట్లాడుకుంటున్నట్టుంది. తోటంతా వినిపిస్తోంది.

రామా—(ఆశ్చర్యంతో) మామాటలు విన్నావా ?

విశ్వం—ఏమీ వినలేదు, అంతా కపటం, నటన. ఇప్పుడేగా ఆసంగతి చర్చించుకుంటున్నది. దాని మాట ఒక్కటీ నమ్మకండి.

రామా—వింటేవింది; లేకపోతే లేదు. నే అనుకున్నది చెప్పితీరతాను.

(లోపలినించి ఉష వొస్తుంది)

ఉష—నే వెళ్లొస్తానమ్మా.

రామా—వెళుతున్నావా తల్లీ. (కన్నీళ్లు పెట్టుకుని) తిన్నగా పెళ్లివేడుకలేమీ జరక్కుండా ఇలా అత్తారింటికి వెళ్లిపోడం ఏమీ బాగాలేదమ్మా! నువ్వు నా కడుపున పుట్టి పలసింది తల్లీ. కౌముదికి నా మీద ఏమీ ప్రేమ లేదు. నువ్వూ వెళిపోతే ఎలా వుంటానో యింట్లో?

కౌము—అమ్మా, ఉష సంతోషంగా వెళతానని చెప్పడానికొస్తే నువ్వు ఏడుపు మొదలెడితే ఎలాగ చెప్పూ. అది ఉష కేమీ యిష్టముండదు

ఉష—నే వెళ్లొస్తా విశ్వం

విశ్వం—మంచిదే.

ఉష—నువ్వుకూడా వీలయినంత త్వరలో పెళ్లాడెయ్యి విశ్వం. లేకపోతే అందరికీ నీ మీద అపోహలే వుంటాయి.

విశ్వం—సాయింత్రం పదేలోపల ఎలాగా నా పెళ్లయిపోయేటట్టే వుంది. మీ రందరూ అప్పుడే నిశ్చయించేసినట్టు కనిపిస్తోంది.

ఉష—వూరుకున్నకొద్దీ ప్రమాదమేగాని మరేం లేదు. (రామాయమ్మతో) అమ్మా, నువ్వుకూడా నాతో హోటలుదాకా రావూ? నన్ను దిగబెట్టి మళ్లీ వొద్దువుగాని? (అని రెక్కపట్టుకు తీసుకుపోతుంది)

(విశ్వం, కౌముదీ మిగులుతారు. విశ్వం వెళ్లిపోబోతాడు. కాని మళ్లీ ఆగిపోతాడు. కౌముది తదేకదృష్టితో చూస్తూవుంటుంది)

విశ్వం—నేను నిన్ను పెళ్లిచేసుకోను. విన్నావా? చేసుకోను. చేసుకోను. ముమ్మాటికీ చేసుకోను.

కౌ—తమ ర్నెవరినీ అడగలేదండీ మహాశయా! అడగలేదు. అడగలేదు. అడగలేదు. సరిపోయిందా? (అని కూచుంటుంది.)

విశ్వం—అడగలేదు నిజమే! కాని మన పెళ్లప్పుడే నిర్ణయమయిపోయినట్టు అందరూ మాట్లాడుతున్నారు. మనిద్దరం తటస్థపడగానే ఇద్దర్నీ వొంటరిగా వొదిలేసి మిగతా వాళ్లందరూ వెళ్లిపోయారు. అరవిందం నాకు ఆశీస్సులిచ్చాడు. మీ అమ్మ చెప్పనేచెప్పింది. సింహాచలం నువ్వే యజమాని వయినట్టు చూసుకుంటున్నాడు. అసలు వాడే మొదట నాకళ్లు తెరిచింది!

కౌము—అందుకనేనా నువ్వు పారిపోయింది?

విశ్వం—కా నేం లాభం, ప్రేమ ప్రేమ అని కొట్టుకుంటున్న దొంగముండావాడి చేతులో పడ్డాను. మీరు వెనక తరిమిపట్టుకున్నారు.

కౌము—సరే, నీ కంత పెళ్లిచేసుకోవాలని ఇష్టం లేకపోతే మానెయ్యి, (అని మెల్లిగా వెళ్లిపోబోతుంది)

విశ్వం—(వెనకబడి) ఇష్టం లేకపోతే యేం లాభం: బలిపశువు ఎందుకు తిరగబడదు: నీకు భర్తంటూ ఎవరో ఒకరు వుండడం ప్రకృతిసంకల్పం కనక నేను నిన్ను పెళ్లి చేసుకోక తప్పేటట్టు లేదే? కాని నేనే ఎందుకు? అరవిందాన్నెందుకు పెళ్లాడవు? అతను సిద్ధంగా వున్నాడుగా. నీ బలిపశువు గిజగిజ కొట్టుకుంటేనే గాని నీకు తృప్తిలేదా? అరవిందమంటే నీ కిష్టంలేదూ?

కౌము—(చుట్టుపక్కల అరవిందం లేడని చూసి) లేదు.

—నే నంటే నీ కిష్ట ముంది.

కౌము—(వేలితో బెదిరిస్తూ) జాగర్త. తెలుసుకు మాట్లాడు.

విశ్వం—అంతా నటన. దెయ్యం.

కౌము—కొండచిలువ. సాలీడు, సుడిగుండం: విశ్వం, నన్ను పెళ్లిచేసుకుంటేనే నీకు శ్రేయం. లేకపోతే నువ్వనేవన్నీ నిజమనుకుని నమ్మి ఆచరణలో పెట్టేదయితే నాలుగురోజుల్లో నిన్ను ఉరి స్తంభానికి ఈడుస్తుంది.

విశ్వం—మీ నాన్న నన్ను విల్లులో గార్డియన్‌గా వేశాడుగాని, నీభర్తగా నియమించలేదు,

కౌము—ఎవరు గార్డియన్ కావాలని నన్ను మా నాన్న అడిగాడు. నేను నిన్ను కోరుకున్నాను

విశ్వం—అయితే మొదటినించీ నాకోసం వల పన్నావన్నమాట.

కౌము—నేను పన్నద మేమిటి? చిన్నప్పటినించీ కూడా నీకూ నాకూ అతీతమయిన ఆ శక్తి ఏదో మన్నిద్దరినీ తరిమింది.

విశ్వం—నేను నిన్ను పెళ్లిచేసుకోను. చేసుకోను. చేసుకోను.

కౌము—చేసుకుంటావు. చేసుకుంటావు. చేసుకుం

విశ్వం—లేదు. లేదు. లేదు.

కౌము—అవును. అవును. అవును.

విశ్వం—(చేత్తో తల పట్టుకుని) నా తలతిరుగుతోంది.

కౌము—(అతనికేసి అతితీక్షణంగా చూస్తూ) నువ్వు నన్ను ప్రేమించడం లేదూ ?

విశ్వం—(గబుక్కున చెయ్యి పట్టుకుని) లేదు. ప్రేమిస్తున్నా మహాశక్తి ఆకర్షించింది. సుడిగుండంలో పడ్డా. కాని ఇంకా స్వేచ్ఛకోసం ప్రాణం రక్షించుకుందామని గిజగిజ లన్నుకుంటున్నా.

కౌ—విశ్వం. జాగర్త. నన్నిలా పట్టుకున్నది ఎవరైనా చూస్తే ప్రమాదం. నన్ను పెళ్లిచేసుకోక తప్పదు.

విశ్వం—(చెయ్యి నొక్కేస్తూ) మన మోపర్వతశిఖరాగ్రంమీ దుంటే నిన్ను గాఢంగా కౌగలించుకుని కింద కురుకుదును.

కౌము—విశ్వం, నన్నొదిలిపెట్టు. అతిసాహసం చేశాను. వొదులు. నే భరించలేను.

విశ్వం—నేనూ భరించలేను. ఆ మహాశక్తేదో మన్నిద్దరినీ కబళించెయ్యనియ్యి.

కౌము—విశ్వం. నా కళ్లు తిరుగుతున్నాయి. శక్తంతా పోతోంది. మూర్ఛొస్తున్నట్టుంది.

(పడబోతుంది. పడకుండా విశ్వం పట్టుకుంటాడు. చయనులు, సింహాచలం, ఉష, అరవిందం, రామాయమ్మగారూ ఈ సమయంలో లోపలి కొస్తారు. వీళ్లని చూడగానే తప్పుకుందా మని విశ్వం అనుకుంటాడు. ఉష కౌముది సమీపాని కొస్తుంది.)

ఉష—వొంట్లో యెలా వుంది ?

కౌ—(శక్తంతా కూడదీసుకుని) నేను విశ్వాన్ని పెళ్లాడ్డానికి ఒప్పుకున్నాను.

(అని మూర్ఛపోతుంది. విశ్వం లేచి పైకి వెళ్లిపోతాడు, మిగతావా ళ్లందరూ చుట్టూమూగుతారు)

సిం—చుట్టూ మూగకండి, గాలి రావాలి. గాలి. (అని అందరినీ దూరంగా పంపిస్తాడు)

అర—విశ్వం, నువ్వదృష్టవంతుడివి !

విశ్వం—పెళ్లిచేసుకోమని నే నడగలేదు. అరవిందం నన్ను కబళించెయ్యడానికి పన్నిన వ్యూహ మిదంతా !

(కౌము—(మెల్లిగా లేచి, ఉషతో రహస్యంగా) నే మూర్ఛపోయినప్పుడు విశ్వం ఏమన్నా అన్నాడా ?

ఉష—ఏమీ అనలేదు.

: (అని మళ్లీ పడుకుంటుంది)

రామా—మళ్లీ మూర్ఛపోయింది.

కౌము—లేదు. మూర్ఛ కాదు. ఆనందం.

విశ్వం—(దగ్గర కొచ్చి నాడి చూసి) నాడి కావలసినంత గట్టిగా కొట్టుకుంటోంది. ఇంకా ఎందుకు పడక. ఊ. లే. (అని లాగుతాడు)

కౌము—ఇప్పుడు బలంగానే వుంది కాని, నా ప్రాణం తీశావు విశ్వం! (అని అరవిందం దగ్గిరకి వెళ్లి) అరవిందం! నేను విశ్వాన్ని పెళ్లి చేసుకుంటున్నాను. నువ్వు ఆఖరిమాటు కన్నీళ్లు పెట్టుకోవూ ?

అర—ఇహ నాకు కన్నీళ్లు లేవు. నీ సౌఖ్యమే నా సౌఖ్యం.

చయ—విశ్వం. నువ్వు అదృష్టవంతుడివి. సుఖపడతావు,

విశ్వం—నేను సుఖపడతా నంటారు. మీకేం ? ఎద్దుపుండు కాకికి నెప్పా ! కౌముదీ ! అరవిందాన్ని కవ్వించడం మాని ఇలా రా !

కౌము—ఏం మనిషివి ! (అని దగ్గిరకొచ్చి నించుంటుంది)

విశ్వం—ఇక్కడ సమావేశమయినవా ళ్లందరికీ నేను మనస్ఫూర్తిగా చెబుతున్నాను. నా కేం సంతోషం లేదు. కౌముది సంతోషిస్తున్నట్టు కనిపిస్తోంది కాని అది సంతోషం కాదు. విజయగర్వం. ఈనాడు మే మిద్దరమూ కలిసి భవిష్యత్తున సుఖం, స్వేచ్ఛ, శాంతి అన్నీ త్యాగంచేశాము. సంసారసాగరంలో పడిపోయాం. ఈ మహాపతనం అర్థం కాక ఎవరైనా పండగచేద్దామంటే ఒప్పుకునేది లేదు. మా పెళ్లికి బాజాభజంత్రీ లుంటువు. రెండోకంటివాడికి తెలీకుండా జరుగుతుంది. విందేమీ వుండదు. మా కెవరయినా పెళ్లికట్నాలు చదివిద్దా మనుకుంటున్నారు కాబోలు. ఆ రాబోయే వెండికప్పులూ, గిన్నెలూ, పళ్లాలూ, కుంకం భరిణెలూ వగయిరాలన్నీ వెంటనే అమ్మేసి, ఆ సొమ్ముతో నాపుస్తకం అచ్చేసి, అందరికీ వూరికే పంచిపెడతాను. నా పెళ్లికి ఎవరూ పంచరత్నాలూ, గించరత్నాలూ వ్రాయకూడదు. ఇది ఆనందసమయం కాదు. విషాదసమయం, కావలిస్తే విషాదగీతికలు. (తెర)

# కళిగ ంప

## కీ॥ శే॥ నందిగాన వేంకటశాస్త్రిల వారు

బ్ర॥ శ్రీ॥ నందిగాన వేంకటశాస్త్రిలవారు బొబ్బిలిదరి నున్న బిటివాడ యను గ్రామమున ౧౮౫౩ వ సం॥మున జన్మించిరి. బ్ర॥ శ్రీ॥ సుమ్మలూరి వేంకట శాస్త్రిలవారివద్ద వీణను, గాత్రపాటయు నభ్యసించిరి. శ్రీ బొబ్బిలిమహారాజావారి యాస్థానసంగీత విద్వాంసులు. శ్రీ పట్నం సుబ్రహ్మణ్యయ్యగారి సమకాలికులు. విద్యనంతయును గురుసన్నిధిని పూర్తిచేసుకొని దక్షిణదేశము వెళ్లి అచ్చట పదునైదువత్సరము లుండి యచ్చటనున్న విద్వాంసులందరిలో యెన్నిక కెక్కిరి.

వారికి గాత్రపాటనుమించిన వీణావాదనమును, వీణావాదనమునుమించిన యును అభ్యాసము వీణ వాయించుచు గాత్రమును కలిపి పాడునపుడు ఆ రెండిటికిని భేదము కనపడునది కాదు. ఒక్కొక్క రాగమును మూడురాత్రులకుకూడ మించి వేసినసంగతి వేయకుండ పాడేవారు. నాలుగుస్థాయిల గాత్రము. నాలుగుస్థాయిలలోను ఒక్కొక్క సంగతిని పెంచుకొని డింకీపావురములవలె పైస్థాయిలలో సంచారముచేసి తిరిగీ మంద్రానుమంద్రములకు వచ్చి సంగతులను ముగించువారు. మంద్రానుమంద్రములలో గాత్రము పూరించి పాడునపుడు శ్రోతల కందరకును భూమిలోనుండి యనేక నాదములు వినపడునవి. తారక స్థాయిలో పాడునపు డుత్తమమైన శారీరమువలె వినపడునది. వీరు కేవలము రాగము పాడునప్పుడుకూడ అన్ని యవస్థలను కనపరచి శ్రోతలనందరిని తన్మయులను చేసి అన్నియవస్థలలో నుంచువారు.

ఒకసారి బ్రహ్మపురమున డిస్ట్రిక్టు జడ్జీగా రసు దా ల యింట సావేరి రాగమును పాడు



చుండగా వారు పరవశులై యానందించి రూ. ౫౦౦ ఖరీదు గల వజ్రపుటుంగరమును బహుమాన మొసగిరి. విజయనగరమున నొకరాత్రి పాడుచుండగా అచ్చటి విద్వాంసు లందరును తమకంటె వీరి గానము తక్కువ యనిపించుటకు వీరితో పాడ నారంభించగా ఎవరును పాడలేకపోయిరి. మంద్రస్థాయిలో పాడ నారంభించునపుడు పైవారి మాదిరి తన పాటను కనపరచి పిమ్మట తారకస్థాయిలో వారికి మించిన పాటను కనపరచి వారి నోడించువారు. తారకస్థాయిలో పాట యభ్యాసము కలవారు పాడినవెంటనే వారి మాదిరిగా పాడి

తిరిగి మంద్రస్థాయిలో నాదమును పూరించి పాడి వారి నోడించువారు.

ఒకనాటిరాత్రి బొబ్బిలిలో వీణ వాయించు చుండగా అందరును తన్మయులై వినుచుండగా అంద రిని తప్పించుకొని వచ్చి యొక పెద్ద నాగుబాము పడగనెత్తి వీరి యెదుట ఆడుచుండెను. కొంతసే పైన తరువాత కొందరు చూచి ఆశ్చర్యపడి దానిపై నొక పెద్ద గంపనుంచి చివరకు దానిని పట్టించి దూరమున పారవైచిరి.

వీరు దేశములకు విద్యార్థులకు తమ యింట భోజ నముపెట్టి విద్య నేర్పిరి. వీరి శిష్యులలో ముఖ్యులు బ్రహ్మశ్రీ తుమరాడ సంగమేశ్వర శాస్త్రులవారు.

వేంకటశాస్త్రులవారి కపరిమితమగు పల్లవి జ్ఞానము కలదు. అనేకులు మార్దంగికులు వారి పల్లవి, పాటకు సరిగా వాయించలేక మద్దెలకు కన్నముపడు నట్లు గట్టిగా కొట్టి మద్దెలకు కన్నము పడిపోయిన దని యప్పటి కేదో విధముగా తప్పించుకొనువారు.

వారు అంత్యదశలో పీఠికాపురమున నుండు వారు. వార్ధక్యదశలో వీణా వాద్యము చాలకాలము నుండి యభ్యాసములేని సమయమున నొకనా డచ్చటి పెద్దగృహస్థుల యింట తమ శిష్యులగు శ్రీ సంగమేశ్వర శాస్త్రులవారి వీణకచేరీ పెట్టిరి. మృదంగము, తంబుర, ఫిడేలు, వీణ అన్నియును శ్రుతులు గూర్చుకొని తమ శిష్యులు వీణ ప్రారంభించే సమయమున అన్ని శ్రుతులను వినినతోడనే శ్రీ వేంకటశాస్త్రులవారి కొక విధమైన యుత్సాహము కలిగి శిష్యుని చేతిలోనున్న వీణను తాము తీసికొని చాలకాలమునుంచియును వీణను ముట్టకపోయినను రెండు గంటల కాలము అపురూపమైన సంగతులతో వాయించగా అందరును తన్మయులై విని యాశ్చర్యము నొందిరి. అటులనే ఇక నాలుగైదు దినములకు పోవుదు రనగా జబ్బుతో మంచముమీద నుండగా వీరి యాప్తు లొకరు వీరిని చూచుటకు వచ్చిరి. తనకుచాలా జబ్బుగా నున్న దనియు, కొద్దిగా పాడ మనియు







వచ్చినవారిని కోరిరి. వచ్చినవారు తంబుర ప్రతివేసు కొని హనుమంతుని యెదుట కుప్పిగంతులు వైచినట్టు మీయెదుట నేను పాడగలనా" యనుచు క్షమాపణను కోరి పది నిముషములు పాడునప్పటికి అంతజబ్బుతో లేవలేనిస్థితిలో నున్నను శ్రీ శాస్త్రులవారికి శ్రుతులు విని పాట వినునప్పటి కొకవిధమైన యుత్సాహము కలిగి లేని బలమును తెచ్చుకొని మంచముమీదనుండి మెల్లగా క్రిందకు దిగి కూర్చొని గాత్రము శ్రుతులలో కలిపి రెండుగంటలసే పపరిమితముగా పాడిరి. సహజ ముగా పెద్దగాత్రము కలవారు కావున ఊరిలోనివా రందరికిని వినిపించగా అందరును యెవరో క్రొత్తవారు పాడుచున్నా రని గుంపులుగా వచ్చి విని యపరిమితా నందము నొందిరి. వారి యౌవనములో పాడునప్పుడు ఆరుమైళ్లకు పైగా వారి పాట వినిపించేది. బొబ్బిలిలో

శ్రీ మహారాజావారి కోటలో పాడునప్పుడు పాలతేరను గ్రామములోనికి వినబడి వారందరును తన్మయులగుచుండిరి. ఇట్టి ముచ్చట లెన్నియేని కలవు.

వీరు 1917 సం॥ వ పీఠికాపురమున శ్రీ కుక్కుటేశ్వరస్వామి సన్నిధిని స్వర్గస్థులైరి.

యం. ఆర్. శాస్త్రి.

## 'ఆరువేలనియోగులు

మన తెనుగుదేశంలో గ్రామకరణాలు చాలా భాగం 'నియోగులు'గాను, ముఖ్యంగా 'ఆరువేల నియోగులు'గాను ఉండడం మన మెరిగున్న సంగతే. వారికీ 'ఆరువేలనియోగు'లని పేరు రాడానికీ, కరణాలంతా నియోగులే కావడానికీ కారణంగా ఒక కథ చెపుతారు మనవారు. ఆ కథ నీక్రింద పొందుపరుస్తున్నాను.

"పూర్వం మన తెలుగుదేశంకూడా ఏలిన ఒక నవాబు ఆస్థానంలో 'అక్కన్న, మాదన్న'లనే ఇద్దరు తెలుగునాటి నియోగిశాఖకు చెందినవారు (అన్నదమ్ములనే అంటారు) ఉండేవారు. వారు నవాబుకు పరిపాలనా విషయంలో చాలా సహాయంగా ఉండేవారు. ఒకనాడు 'నవాబు' మనసుకు నచ్చే ఉపకారం వీరిద్దరూ చేసినకారణంగా నవాబు వీరిని పిలిచి ఏమికావలెనో నిరభ్యంతరంగా కోరుకొమ్మని కోరారు. వారు తమ కవసరమువచ్చినప్పుడు కోరుకుంటామని నవాబుగారి వరాన్ని ఉత్తర కాలానికి దాచి పెట్టుకున్నారు.

తరవాత కొన్నాళ్లకి తెనుగుదేశంలోని గ్రామాలకు 'కరణాల'ను నియోగించవలసి వచ్చింది. ఈసోదరులింతకుమునుపే తమ శాఖవారి పేర్ల జాబితాను తమ వద్ద సిద్ధంగా ఉంచికొనివుండి నవాబు ఇంక రెండు మూడు రోజులలో ఉద్యోగాల నిస్తాడనగా—నవాబును తమ వెనకటివరం ఇప్పించమని అడిగారు. ఏమి కోరుతారో కోరమని నవాబు కోరగా 'నవాబుగారి సీలు' (ముద్ర)ను ఆరుఘడియలకాలం తమ కిప్పించమనివారు కోరారు. అందుకు నవా బంగీకరించాడు.

'అక్కన్న, మాదన్నలు' తమవద్ద అంతక్రితమే సిద్ధంగా ఉన్న జాపితాలో ఆరువేలమందికి మాత్రం ఆ ఆరుఘడియల కాలంలోనూ, గ్రామకరణీకమును వ్రాసి వాటిపైన 'నవాబు' గారి ముద్రను ఉంచగలిగినారు. 'నవాబు' గారి ముద్రతో ఉన్నవి కనుక వారందరూ ఉద్యోగాల్లో ప్రవేశించారు. అప్పుడు ఉద్యోగాల్లో ప్రవేశించిన ఆరువేలమందికీ చెందినవారంతా నాటినుంచీ ఆరువేల నియోగులని వ్యవహరింపబడుతున్నారు."

ఈ కథ చూడటానికి యథార్థంగానూ, సమంజసంగానూ కనబడుతోంది. కాని, ఇది ఎంత నిజమో కాదో చారిత్రక పరిశోధకులే ప్రమాణం.

శ్రీ రామశాస్త్రి.





ఏ. ఎన్. ఎస్. నర్సుల ఉద్యోగము

# స్త్రీలకు స్వతంత్రవృత్తి

## స్వార్థరహితమైనది, గౌరవప్రదమైనది

ఇంటివద్దనే సోమరితనముగా కూర్చొను బాలికా సంఘమునకు అవసరములేదు. ప్రతిభావంతమైన నవలారత్నమగు నీవు ఇండియా సైనిక సహాయక నర్సింగు సర్వీసు (ఏ. ఎన్. ఎస్.)లో ఉత్సాహవంతముగా, ఉపయుక్తముగా పనిచేయ్యడానికి అవకాశమున్నది. "కారుణ్యదేవత" ధరించు మల్లెపుష్పసమమైన యూనిఫారము లేదు.

యుద్ధానంతరము పౌరజీవితములో సులువుగా నర్సింగు ఉద్యోగము చేసుకొనుటకు చక్కని శిక్షణ యివ్వబడును. కాని, నీవు యితర ఆలోచనలు వుండవచ్చు. నీవు గృహవసతి జీవితములోను, లేదా, దేశానికి సాంఘికసేవ చేసే జీవితములోనూ ఈ శిక్షణలో పొందగల వైద్య విద్యానుభవములు అమూల్యముగా ఉపకరించగలవు. ఈ అవకాశము పోగొట్టుకొనవద్దు!

ఏ. ఎన్. ఎస్. జీతము తగినంతగా హెచ్చించబడినది. ఉదాహరణముగా క్రొత్తగా జనరల్ సర్వీసు జీతము నెలకు రూ. 135-175. బస, భోజనము, సేవకులతో సహా ఉచితము. లేదా, అవిలేకుండా జీతము నెలకు రూ. 203-243. 17 నుండి 45 సంవత్సరముల వరకు వయస్సుగల యే స్త్రీ అయినను ఇందులో చేరవచ్చును. వీరు బ్రిటిష్ ఇండియాలోని వారుగాని స్వదేశ సంస్థానములలోని వారుగాని అయివుండవలెను.

ఇంతకుముందు అనుభవమేమియు అవసరములేదు. కాని, నర్సింగులో అనుభవము వున్నట్లయితే పెద్ద జీతములో చేరవచ్చును. నర్సులను జాగ్రత్తగా చూస్తారు. తమంతట తామే విదేశాలకు వెళ్ల వలచినవారు తప్ప, మిగతావారందరు ఇండియాలోని ఉద్యోగములలోనే నియమించబడుదురు.

స్త్రీలకు

## ఏ. ఎన్. ఎస్.

సర్వోత్తమమైనది

పూర్తి వివరములకు లేడీ డిప్టీ చీఫ్ సూపరింటెండెంటు సెంట్ జాన్ ఆంబ్యులెన్సు బ్రిగేడ్ ఓవరుసీస్, మద్రాసుకు వెంటనే వ్రాయండి.

AAA 1197 TG



# విమర్శనము



## మహర్షి జీవితకథామృతము

కర్త: శ్రీ బులుసు వేంకటేశ్వర్లుగారు. క్రౌన్ ¼ సయిజు. ౧౫౫ పేజీలు. వెల రు ౨. కావలసినవారు గ్రంథకర్త పేర ఆంధ్రసాహిత్య పరిషత్తు కాకినాడకు వ్రాసుకోవలెను.

ఇది పన్నెండుమంది పురాణప్రసిద్ధ మహర్షుల జీవితచరిత్రము. దీనికి ఇంగ్లీషున పది పంక్తుల్లో గ్రంథకర్త పూనికను మెచ్చుకొంటూ శ్రీ సి. పి. రామస్వామి అయ్యరుగారు తొలిపలుకు వ్రాసినారు.

మహర్షుల జీవితములు ఆయా పురాణాలలో ప్రసక్తి వచ్చినచోటనల్లా కనబడుతూ ఉంటవి. కాని పుట్టినది మొదలు గిట్టేవరకున్నూ ఆయా మహర్షుల జీవితములను వర్ణించిన గ్రంథములు సంస్కృత భాషలో నైనా లేవు. ఇక తక్కిన భాషలసంగతి చెప్ప నవసరమే లేదు.

ఈ గ్రంథకారుడు ఆలోచనకు స్ఫురించి ఆయా పురాణాలను చూచి ఒక్కొక్క మహర్షి జీవితమునూ ఒక్కచోట కూర్చినాడు. పురాణాదులలో దొరికినదంతా యథాతథము తెనుగు వచనమున వ్రాసినారు. ఆయా మహర్షుల జీవిత సంఘటనలను కూడా గ్రంథకారుడు తనకు తోచిన క్రమమున కూర్చినాడు. ఒక్కొక్క మహర్షినిగురించి ఇదొక సర్వస్వము అని చెప్పవచ్చును. ఆయా మహర్షుల జీవితముల కోసము వివిధపురాణములను వెతుకుకో నవసరము లేకుండా చేసివేసినారు. సంతోషమే. కాని ఆయా మహర్షుల అద్భుతచర్యలు వాటి పరమార్థమును గురించిన సమన్వయము ఏమిన్నీ లేదు. పయిగా గ్రంథకర్త ఆయా జీవితముల ఘటనల క్రమము కూడా కొంత వరకు వ్యత్యస్తముగా ఉన్నది. ముందు చెప్పవలసింది వెనకా—వెనక చెప్పవలసింది ముందు చెప్పినట్లుగానున్నూ ఉంది. అయినప్పటికిన్నీ ఆయా మహర్షుల అన్ని చర్యలను ఒక్కదానిని కూడా బీరు పోనీయకుండా చెప్పినందుకు గ్రంథకారుడు వందనార్హుడు.

భాష గ్రాంథికము. ఎక్కువగా సంస్కృతము వాడినారు. ఇటువంటి గ్రంథరచనలో ఇది తప్పదేమో కూడానూ. అచ్చు అందముగా వుంది.

ఆంధ్రు లందరూ — ప్రాచీనవిజ్ఞానావబోధము కోసము ఈ పుస్తకము చదువవలెను.

## ఊసుపోక

శ్రీ కొండేపూడి సుబ్బారావు. దొరకుచోటు కొండపల్లి వీర వెంకయ్య అండ్ సన్స్, రాజమండ్రి 62 పుటలు వెల ఎనిమిదణాలు.

ఊసుపోకకు వ్రాసిన 7 కథల పుస్తకం ఇది. కూటికొఱకు కోటి విద్యలు అన్నది వ్యాసంగా లెక్కకువస్తుంది. మిగిలినవన్ని సంసారపక్ష విషయాలు ఉదంతాలకు కొంత ఊహ జోడించి రచించినవి. వ్రాయసుని శిల్పం ఇందులో "అత్తా, తాతా" అంటున్నది. ఇతివృత్తం రమ్యమనిపించటం వస్తువు కొంతా సమ్మిశ్రితం కనుక స్వాభావికమే—రచనకు, పఠనకు ఊసుపోక.

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, Madras. Editor:— S. Sambhu Prasad.




చక్కని రుచి, ఘుమ ఘుమలాడే
సువాసన, నేత్ర పర్వంగావుండే
రంగు, తక్కువధర, వీటి అన్నింటి
నిబట్టి లిప్టన్స్ వైట్ లేబుల్
మిగతా వాటిని తలదన్ని అత్యా
ధిక గౌరవాన్ని తెచ్చుకున్నది.




# లిప్టన్స్
## వైట్ లేబిల్

మృదు మధురమైన ఇండియన్ లీఫ్ టీ

LTK 84 WTG




# అన్నివేళల చికాకులు

ఉద్యోగాలు, వ్యాపారము, వ్యవసాయము —
గృహానికి సంబంధించిన ప్రతివానిమీద
యుద్ధము చాలా యెక్కువ వొత్తిడి తెచ్చి
పెడుతుంది. ఆహారం సంపాదించడము
కష్టము, కిరసను, క్రిక్కిరిసివున్న ట్రాములు,
బస్సులు, రైళ్లు వీటిలో సుఖంగా
ప్రయాణం చేయడానికి అవకాశం లేకుండడమేకాక
కొన్ని సమయాలలో చాలాకష్టం
కూడాను; యుద్ధానికిపూర్వపు ధరలతో పోల్చితే
గుడ్డలధరలు యెంతో యెక్కువ.
అంతేగాక అవి లభ్యం కావడంకూడా కష్టం
ప్రతివ్యక్తీ వెనుకటికన్నా యెక్కువ
శ్రమతోనూ యెక్కువ వొత్తిడిక్రిందను పనిచేయ
వలసి వున్నది. అందువల్లనే వొక
దీర్ఘమైనరోజు పనిచేసి అలసటజెందిన తరువాత —
వొక మంచి కప్పు టీ యిచ్చే రక్షణ,
సదుపాయములవేషు అంతముంది
ప్రజలు మెచ్చుతారు. టీ ఉషారిస్తుంది-
మీకు ఉత్సాహాన్ని యిస్తుంది. మీ నీరసాన్ని
అలసటను తగ్గిస్తుంది ఏ స్థలంలో
నైనా ఏ సమయంలోనైనా సరే,
టీ ఉత్తమోత్తమ పానీయము.





ఒత్తిడి సమయాలలో ఇండియన్ టీ వేపుమరలండి

ఇండియన్ టీ మార్కెట్ ఎక్స్పాన్షన్ బోర్డుచే ప్రకటితము.

IK 335 T.E.



నాగయ్య... జయమ్మ... భానుమతి....
నారాయణరావు... లింగమూర్తి... శివరావు
నటించిన....

వాహినీ వారి

# స్వర్గసీమ

...త్వరలో వస్తున్నది...

డైరెక్టర్.... బి.యన్.రెడ్డి



Studio NEWTONE



CAMERA...BARTLEY · SOUND...DINSHAW · ART...NAGOOR